


వేగుంజుక్క గ్రంథమాల 19

# శ్రీ తులసీ రామాయణము

## బాలకాండము

(నిర్వచనము)

విజయవిజయ, విచిత్రవీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, అభినవభర్తృహరి
కాళికాపురాణ, గాంధిశతకాది గ్రంథకర్తలగు
భాగవతుల నృసింహశర్మగారిచే
ప్రణీతము

బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారిచే
సంపాదితము

మొదటికూర్పు 1000

రాజమహేంద్రవరము
సరస్వతీ పవర్ ప్రెస్

 1925 [వెల రు 1—8—0

ఇలయువారు :
కార్యదర్శి
వేగుంజుక్క గ్రంథమాల
పూడిపెద్దివారివీధి
బరంపురం (గంజాం)

For copies apply to
THE SECRETARY
VEGUJUKKA
GRANDHAMALA
Pudipeddivari Street
BERHAMPUR (Ganjam)

ఓమ్ నమశ్శివాయ

మ. రా. శ్రీ. దేశోద్ధారక బిరుదాంకితులగు

కాశీనాథుని నాగేశ్వరరావుగారిచే విరచితమైన

# పీఠిక

శ్రీరామావతారము భగవదవతారములందు, సకలజంతువులకును బ్రహ్మానందదాయకమైన యవతారము. శ్రీరాముఁడు రావణసంహారమున కవతరించిన నరపుంగవుఁడు. రావణుఁడు బ్రహ్మనిష్ఠాపరుండైనను, ఆసురసంపదారాధకుఁడు. దశకంఠుఁడు మహాబలుఁడు. దాశరథి మానవమాత్రుఁడు. శ్రీరాముఁడు మానవుఁడైనను ధర్మనిరతుఁడై, రావణాదులను సంహరించి, దైవబలప్రాబల్యమును విశదముచేసెను. శ్రీరామావతారమునందు, నరసింహ వామన కృష్ణ బౌద్ధావతారములందుంబోలె, లోకాతీతమైన భయంకరకార్యములుంగాని దివ్యవిలాసములుగాని వ్యక్తముగాక, లోకమునకుఁ బరిపాటియైన సాంసారికప్రవృత్తి వ్యక్తమైనది. శ్రీరామచంద్రుఁడు సామాన్యమానవులవిధంబున సంసారయాత్రకు సహజములైన సుఖదుఃఖముల ననుభవించిన యవతారమూర్తి. అతఁడు దశరథమహారాజునకుఁ జిరకాలమునకుఁ దపఃప్రభావమువలనఁ గల్గిన ప్రియపుత్రుఁడు. ఆతఁడాగర్భశ్రీమంతుఁడయ్యు, బాల్యమునందు విశ్వామిత్రాశ్రమములో గురుకులవాసముఁజేసి, యజ్ఞరక్షణమును జేసెను. శివధనువును మోపెట్టి సీతను బెండ్లియాడెను. అతఁడు పితృవాక్యపరిపాలనార్థము రాజ్యాధికారమును ద్యజించి, యరణ్యావాసమును గైకొనెను. సీతాలక్ష్మణులతో నరణ్యావాసక్లేశము ననుభవించెను. భార్యావియోగదుఃఖము ననుభవించెను. వాలినిజంపి సుగ్రీవునకుఁ బట్టముగట్టి హనుమంతుని భక్తిని

బడసెను. రావణునిఁజంపి సీతనువిడిపించి విభీషణుని రాజ్యమునందు నిలిపెను. సీతాలక్ష్మణాదులతో రాజ్యాభిషిక్తుఁడై ప్రజలనేలెను. జనాపవాదమును బోఁగొట్టుకొనుటకై జానకినివనవాసమునకంపెను. కుశలవులను రాజ్యాభిషిక్తులనుజేసి యవతారమును జాలించెను. రామచరితము చాటుపద్యములందు మనోహరముగా వర్ణింపఁ బడియెను.

శ్రీరామచరితము సంసారయాత్రకు సామాన్యమైన సుఖ దుఃఖములతో నిండియున్నను మానవజన్మకుఁబరమావధియైన దైవ ప్రతిష్ఠను మనోహరముగా సువ్యక్తముచేయుచున్నది. సంసార యాత్రయందనవరతము ధర్మాధర్మములకు సంరంభము సంప్రాప్త మగుచున్నది. మానవులు మమకారాహంకారములు జనునిధర్మపరా ఙ్ముఖులగుచు సామాన్యముగఁ బురుషార్థమును నిరర్థకముచేయు చున్నారు. ధనరాజ్యదారాపుత్రాదులందుఁగలమమకారము ధర్మ విషయందుఁ గలుగక నరజన్మము వ్యర్థమగుచున్నది. మోహ పరాయణుల దుర్గతిని రామాయణము హృద్యముగ వర్ణించుచున్నది. నరరూపమును దాల్చిన శ్రీరామచంద్రుఁడు బాల్యమునుండియును మోహమును విసర్జించి ధర్మము నారాధించి జీవయాత్రను సార్థ కముచేసి లోకారాధ్యుండయ్యెను. అవ్యక్తమైన శ్రీమన్నారాయణ ప్రభావము రామావతారమూలమునను మానవజన్మమునందు సుఫలమై లోకమునకుఁదరణోపాయము కరతలామలకమయ్యెను. బహువిధపురుషార్థములకును రామనామయోగము స్వస్తివాచక మయ్యెను. రామరక్ష రామరాజ్యము రామబాణము రామభక్తి రామ మైత్రి రామవాక్యము రామకార్యము రామతారకము మున్నగు పదములు భారతామ్నాయమునందారూఢార్థప్రయోగములైనవి. విశ్వంభరుండైన శ్రీరామమూర్తిని వారివారిసంస్కారమున కను

రూపముగను భక్తులు భజించియును, కవులువర్ణించియును, గాయకులుసంకీర్తించియును ఋషిజనులుసేవించియును కృతార్థులైరి. భగవద్గీతయందుఁ దెలిపినటులు

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహం।
మమవ ర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

శ్రీరామమూర్తి రామభక్తుల ననుగ్రహించినవిధమును రామలీలలు విశదముచేయుచున్నవి. శ్రీరామమూర్తియాంధ్రుల హృదయేశ్వరుఁడు. ఆంధ్రదేశమునందువ్యాపకమునఁ గలరామ మందిరములు రామభజనలు రామకీర్తనలు రామకృతులు రామకోటులు రామదండులు ప్రజలకుఁ గలయపారరామభక్తిని విశదముచేయుచున్నది భాగవతుల నృసింహశర్మకృత మైనతులసీదాసరామాయణాంధ్రీకరణముసైత మాంధ్రహృదయస్థ మైనరామభక్తిని విశదము చేయుచున్నది.

రామకావ్యములు, కృతులు:—రామతారకమంత్రము, నీక్రింది విధమున శంకరుఁడుపార్వతికుపదేశించిన విధముపురాణప్రసిద్ధముః

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామవరాననే॥

వాల్మీకి ఋుత్తమోత్తము మైనరామాయణకావ్యమును రచియించి శాశ్వతప్రతిష్ఠను బడసెను. ఆంధ్రమునందు భాస్కర రామాయణము, మొల్లరామాయణము, అధ్యాత్మరామాయణము, సంక్షేపరామాయణము, గోపినాధరామాయణము మున్నగు సుప్రసిద్ధాంధ్ర కావ్యములుగలవు. శ్రీయుత వావిలికొలనుసుబ్బరాయకవిగారు పదునైదేండ్లకుఁ బూర్వ మాంధ్రవాల్మీకిరామాయణమును రచియించిరి. గతసంవత్సరము నందు శ్రీయుత జనమంచి శేషాద్రి శర్మగారు విశేషాంధ్రవాల్మీకిరామాయణమును రచియించిరి. ఆంధ్ర

భాషయందు శ్రీరామచరితామృతమును బ్రిసాదించెడి మనోహర కావ్యములు, నాటకములు, శతకములు పెక్కులు గలవు. ఆంధ్ర భాషయందుఁగల 600 శతకములందు రామభక్తిపరములైన శతకములు నూరు కలవు. రామదాసుకీర్తనలు త్యాగరాజకృతులు తరంగములు లాలిపాటలు జోలపాటలు పెండ్లిపాటలు రామకోటులాంధ్ర హృదయావృతమైన రామచరితామృతాస్వాదనాభిలాషను విశదము చేయుచున్నవి. అఖండమైన శ్రీరామావతార మహిమను ఖండరూపముల నెందఱుకవులు వర్ణించినను జిత్రకారులు చిత్రించినను గాయకులు కీర్తించినను భక్తులు భజించినను నూతనరచనలు పురుషార్థసిద్ధికి సాధనంబు లగుచున్నవి శ్రీరామభక్తిభరితమైన తులసీదాసరామాయణమాంధ్రవాఙ్మయమునకలంకారమై రామభక్తులకు బ్రహ్మానందమును గలుగఁజేయఁగలదు

తులసీదాసు:—తులసీదాసు రాజపూరు జిల్లాయందలి బాందాపురమునందు ౧౫౭౯ సంవత్సరము మూలానక్షత్రము ప్రథమ పాదమునందు జననమునొందెను జన్మనక్షత్రము గండనక్షత్రము. తలిదండ్రులు వెంటనే తులసీదాసును విడనాడిరి. సరయూతీరవాసియైన సాధు నరసింహదాసు తులసీదాసును స్వీకరించి సూకర క్షేత్రమునందుఁ బెంచి పెద్దవానినిజేసెను. నరసింహదాసు సన్నిధిని బాల్యమునందు సయితము తులసీదాసు రామకథామృతమును భక్తి శ్రద్ధలతోఁ గ్రోలుచుండెను. దీనబంధుపాఠకుఁడు గోస్వామికిఁ దన కూతును.రత్నావళినిచ్చి పెండ్లిచేసెను. భార్య కాఁపురమునకు వచ్చిన తరువాత మోహపరవశుఁడై యొకదినమైనను జాయావియోగమును సహింపఁజాలకుండెను.

అత్తమామలెన్ని వర్తమానముల నంపినను భార్యను బంపకుండెను. మామ స్వయముగవచ్చి పిలిచినను బ్రయోజనము లేకుం

డెను. తులసీదాసు బజారునకుఁబోయిన సమయమునను భార్య సోదరునితోఁ గూడి పుట్టినింటికిఁ జెప్పక వెడలిపోయెను. గోస్వామి యిరుగుపొరుగు వారినుండి, యీవృత్తాంతమును గ్రహించి వెంటనే యత్తవారింటికిఁబోయి చేరెను. భార్యపుట్టినింట నిరుఁగుపొరుగువారలతోఁ గుశలప్రశ్నలను ముగింపకమునుపే, భర్త ప్రత్యక్షమగుటను జూచి రత్నావళి కోపగించి, ధిక్కరించి, యిటులు పరిహసించెను:—

"లాజనలాగత్ ఆపుకోదౌరె ఊ ఆయేసాత్
ధిక్ ధిక్ వెసే ప్రేమకో కహా కహా హూఁ నాథ
అస్థి చర్మమయ దేహ మమతా మేఁ జైసీ ప్రీతి
తైసీజో శ్రీరామ మహఁహోత్ నతౌ భవభీతి.

ఈవాక్యములు ప్రేమసంపన్నమైన గోస్వామి హృదయమునందు వైరాగ్యమును గలుగఁజేసెను. వెంటనే గోస్వామి మరలిపోయి కాశీనగరమును జేరెను. అయోధ్యా మధురామాయా ప్రయాగాది క్షేత్రములను సందర్శించి భక్తిజ్ఞాన వైరాగ్యములను బడసి కృతార్థుఁడయ్యెను. ఆంజనేయుని యనుగ్రహమువలన నతఁడు చిత్రకూటమునందు శ్రీరాముని సందర్శించినటులు గాథలుగలవు. మహాభక్తుల జీవితములందుఁ బ్రత్యక్షమయ్యెడి యద్భుతములు గోస్వామి జీవితమునందును గనుపట్టుచున్నవి. చచ్చినవానిని బ్రతికించుట, అక్బరుచక్రవర్తి గోస్వామిని ఖైదుచేయుట, వానరసేనలు కోటను ముట్టడించుట మొదలగు నద్భుతగాథలనేకములు గలవు. గోస్వామికి నక్బరుచక్రవర్తిమంత్రి ఖాన్‌ఖాన్ మిత్రుఁడుగనుండెను. ఆకాలపుఁ బండితులతోను సాధువులతోను భక్తులతోను ఇష్టగోష్ఠిని గాలముగడుపుచు ౯౭-వ యేట క్రీ. శ. 1623 సం॥ నందు గోస్వామి తులసీదాసు పరమపదమును జేరెను.

# తులసీరామాయణము

ఇదిప్రపంచమునందుఁ గల యుత్తమగ్రంథములం దొక యుత్తమగ్రంథముగ నున్నది. తులసీరామాయణము వాల్మీకిరామాయణమునకు భాషాంతరీకరణముగాక యొక స్వతంత్రకావ్యముగ నున్నది. హిందీభాషయందుఁగల గ్రంథములందుఁ దులసీరామాయణమగ్రస్థానము నలంకరించుచున్నది. భాషయందును, భావములందును, రచనావిధానమునందును, వ్యాపకమునందును, హిందీభాషయందుఁ దులసీరామాయణమునకు సాటియైనగ్రంథము వేఱొకటిలేదు. హిందూస్థానీభాషను మాటాడెడివారు, తులసీరామాయణ పారాయణముచేసి కృతార్థులగుచున్నారు. నాల్గణాలు మొదలు నలువది రూప్యముల వఱకును విలువగల రామాయణ ప్రతులుగలవు. ప్రతియేటను వేలకొలఁది ప్రతులు విక్రయింపఁబడుచున్నవి. ఒకదోహాయైనను రాని హిందూస్థానియుండదు. తులసీరామాయణము పండిత పామరులకాదరణీయమై పూజింపఁబడుచున్నది.

తులసీదాసు భాషారామాయణమును రచించినపుడు పండితులాక్షేపించి, తిరస్కరించిరి. అతఁడు వారి తిరస్కారములను లక్ష్యముసేయక, దీనినిరచించి ధన్యవాదములను బడసెను. ఆకాలమందు మహాపండితుఁడుగఁ బరిగణింపఁబడిన మధుసూదనసరస్వతి తులసీరామాణము నిటులుప్రశంసించెను:—

శ్లో॥ పరమానంద పాత్రోయం జంగమస్తులసీతరుః।
కవితామంజరీయస్య రామభ్రమరభూషితః॥

తులసీదాసురామాయణమును స్వతంత్రకావ్యముగ రచించెను. వాల్మీకిరామాయణమునందు లేనిసందర్భములను జేర్చియును

ఉన్నవానిని విడిచియును, స్వతంత్రకావ్యమును జేసెను. సీతాస్వయంవరమునకుఁ బూర్వము సీతారాములకు నుద్యానవనమునందు గౌరీపూజారూపమునను సమావేశమును గలిగించి, ప్రేమపరికర్షణమును మనోహరముగ వర్ణించెను. గ్రంథమునఁ గొన్నిసందర్భములందు సోరఠ, చౌపాయీ, ఛందావృత్తములు వాడఁబడినను సామాన్యముగఁ బాడుటకనుకూలమై, మధురమైన "దోహా" "చౌపాయి" వృత్తములే పాడఁబడినవి. గోస్వామి నలువదెనిమిదవయేఁటను అతి వృద్ధదశయందు రామాయణమును రచియించి జీవించియుండెడి సమయమునందే మహాప్రతిభను గడించెను. ఆప్రతిభ కాలక్రమమున వికసించి, తులసీరామాయణమమూల్యగ్రంథరాజముగ వెలయుచున్నది. శ్రీరామచరిత్రమునం దానందదాయకములైన భక్తి శృంగార వీరకరుణారసంబు లద్భుతరీతిని సమ్మేళనమునొంది, యోగరసమువలె సమ్మోహమును గలుగఁజేయుచున్నవి. విశ్వసమ్మోహ జనకమయిన శ్రీరామచరిత్రమును అద్భుతరీతిని రామాయణమునందుఁ బ్రత్యక్షముఁ జేసి, యానంద రసోదయమును గలుగఁజేయఁగలిగిన గోస్వామి "తులసీదాసు" ధన్యుఁడయ్యెను. తులసీరామాయణము సర్వజనసమాదరణీయము.

## ఆంధ్రతులసీరామాయణము

ప్రపంచావృతమైన నవజీవనోజ్జీవనమున కుదారభావభరితములైన గ్రంథములు సాధనములు. ఉదారభావవికాసమునకు-నూతనరచనలవలె భాషాంతరీకరణములు సాధనములై యున్నవి. ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి నూతనరచనలు నిర్మింపఁబడుచున్నవి. భాషాంతరీకరణములు చేయఁబడుచున్నవి. ఆప్రయత్నములందాంధ్రతులసీరామాయణము వర్తమాన కాలమునందుఁ బ్రియో

జనకరమై, యాంధ్రహృదయమున కానందమును గలుగఁజేయఁ గలదు. దేశమందంతటను హిందీభాషాప్రచారము జరుగుచున్నది. ఆంధ్రయువకులు పరమోత్సాహముతో హిందీభాష నభ్యసించు చున్నారు. ఆంధ్రహృదయేశ్వరుఁడైన శ్రీరాముని చరితామృత మును గ్రోలుటకును, హిందీసాహిత్య పరిచయమును బొందుటకును, దులసీరామాయణము వినియోగపడఁగలదు. భాషాంతరీకరణము దుష్కరకార్యము. రసభరితములైన కావ్యముల నాంధ్రీకరించుట దుష్కరతరకార్యము. ఆంధ్రీకరణమునందాంధ్రహృదయ సంస్కార మును, కవిచిత్తసంస్కారమును సహజముగఁ బ్రత్యక్షములగుచు మూలగ్రంథాను వాదమునకు భంగము గలుగుచుండును. ముక్కకు ముక్క ననువదించుటనిరుపయోగమైనను, మూలగ్రంథభావమును బరిస్ఫుటము చేయుటయనువాదమునకుఁ బ్రయోజనము. మూలగ్రంథ మందులేని సందర్భములును గల్పనలును, భావములును, భాషాం తరీకరణ గ్రంథమున కలంకారములైనను, మూలగ్రంథస్వరూప మును మార్చుచున్నవి కవిహృదయమును, భాషాహృదయమును, భాషాంతరీకరణమునకు నూతనాకారము నొసంగుట సహజమైనను, మూలస్వరూపమును బ్రత్యక్షముచేయుట ముఖ్యధర్మము.

ఆంధ్రవాఙ్మయమునకుఁ దులసీరామాయణకృతినినమర్పించిన శ్రీయుత భాగవతుల నరసింహశర్మగారు ధన్యాత్ములు. కవిత్వము ధారాళమై, సరళమై, రసవంతముగ నున్నది. పద్యము లడ్డులేక చక్కఁగ నడుచుచు నాంధ్రవాణీస్వరూపమును విశదము చేయు చున్నవి. భాషాంతరీకరణమునందుఁ గవి కొన్నిసందర్భములందు మూలము ననుసరించినను, గొన్నిసందర్భములందు స్వేచ్ఛానుసార ముగ భాషాంతరీకరించినవిధమును గ్రంథము విశదము చేయుచున్నది. ఆరంభమునందు సుజనదుర్జనప్రశంసలందుఁ గొన్నిగంభీరభావము

లధికముగఁ జేర్పఁబడినవి. మూలమునందలి భావము నీపద్యము హృద్యముగఁ దెలుపుచున్నది.

గీ॥ నీరసంబయ్యు గుణములన్ విస్తరిల్లి
యన్యగుహ్యావనంబున నఖిలకష్ట
ములకు నోర్చిన కార్పాసఫలముఁ బోలు
సాధుచరితంబు సత్కవి సన్నుతంబు॥

అహల్యాశాపవిమోచనసందర్భమున మూలగ్రంథమునందు లేనిభావము లీగ్రంథమునందుఁ జేర్పఁబడినవి. గంగావతరణవృత్తాంతము, మూలమునందు లేనిది, దీనియందుఁ జక్కఁగ వర్ణింపఁ బడినది. మూలమునందుఁ గల మిథిలానగరవర్ణనము దీనియందుఁ గనఁబడదు. జనకుని రామలక్ష్మణులవర్ణనయందు మూలమునకును భాషాంతరీకరణమునకును భేదము గలదు.

జనవరకులపాలకులో?

మునికులతిలకులో? యెటుంగఁ బోలదె చెపుమా!॥

(ప. 906)

“బ్రహ్మజో నిగమ నేతికహి గావా ఉభయ వేషధలిసో ఊకి ఆవా ”

వేదములందు “నేతి” యని వర్ణింపఁబడిన బ్రహ్మ ముభయ రూపములఁ దాల్చివచ్చినది.” అని మూలమునం దుండగా, భాషాంతరీకరణమునందు వేఱై యున్నది.

గీ. “సహజవైరాగ్యము గల మత్స్వాంతమునను।
అందరాని బ్రహ్మానంద మంకురించె”

(ప. 908)

“సహాజ విరాగరూప మన్మేరా పరబస్ బ్రహ్మసుఖహి మానత్యాగా”

మూలమునందు 'బ్రహ్మానుఖమునే మనసు విసర్జించినది.' యని యుండగా "అందరాని బ్రహ్మానంద మంకురించె" నని భాషాంతరీకరణము కలదు ఉద్యానవనమునందు సీతారాముల యన్యోన్యావలోకనసందర్భమునందలి వర్ణనమునందును భేదము గలదు. శ్రీరాములవర్ణనమునందుఁ దులసీరామాయణమునందు గలమాధుర్యము పోయి యాంధ్రప్రబంధవర్ణనలు గోచర మగుచున్నవి. తులసీదాను సీతకుఁ బుష్పదామమును గౌరీదేవి యొసంగి నట్లు వ్రాసియుండెను. భాషాంతరీకరణమునందు ధాత్రి యొసంగి నటులు గలదు. మూలమునం దీసందర్భమున సూర్యాస్తమయవర్ణన లేదు. ఆంధ్రీకరణమునందు సూర్యాస్తమయవర్ణన కలదు.

ఆంధ్రతులసీరామాయణమునం దీవిధముగ మూలమున లేని కొన్ని విషయములు చేర్చుటయును, ఉన్నవిషయములను విడుచుట యును, నూత్నభావములను జేర్చుటయును, సంభవించినవిధము గ్రంథపరిశీలనము విశదముచేయుచున్నది. సుప్రసిద్ధమైన తులసీ రామాయణమును మూలానుసారముగ భాషాంతరీకరించుట, ఆంధ్ర వాఙ్మయమునకును, హిందీప్రచారమునకును, నధికతర మగుప్రయో జనము నొడఁగూర్చును. కాని, యాంధ్రవ్యక్తిత్వము, భాషా సాంప్రదాయము, కావ్యరచనాసాంప్రదాయము, కవిసంస్కారము, ఆంధ్రతులసీరామాయణమునకు, నూతనాకారమును గలుగఁజేసినవి.

భాషాంతరీకరణమునందు భేదములున్నను, శైలి రసవంతమై, పద్యములు ధారాళముగ నడచుచు, గ్రంథము మనోహరముగ నున్నది.

భాగవతుల నరసింహశర్మగారు రచియించిన యాంధ్రతులసీ రామాయణ మాంధ్రులయాదరణమునకుఁ బాత్ర మగుగాత!

కృతికర్త శేషించిన గ్రంథమును బూర్తిచేసి ప్రచురించుటకుఁ బరమేశ్వరుఁడును ప్రజలును దోడ్పడుదురుగాత!

ఈగ్రంథమునకుఁ బీఠికను వ్రాయు గౌరవమును నాకొసంగినందులకు శ్రీయుత భాగవతుల నరసింహాశర్మగారికిఁ గృతజ్ఞుఁడను.

కా. నాగేశ్వరరావు.

# మనవి

ఇంతకుఁ బూర్వము నేను రచించి ప్రచురించిన గ్రంథములఁ బఠించి, తగినంత ప్రోత్సాహ మొసంగిన యాంధ్రపాఠక మహాశయులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. తులసీరామాయణము నాంధ్రీకరింపవలె నను నభిలాష నన్నుఁ జాలకాలమునుండియుఁ బీడించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు విజాపురపు వేంకటరావుగారు, తాము జయపురములో నుద్యోగులై యుండు కాలమున బరంపురమునకు విచ్చేసిరి. మ॥రా॥శ్రీ దేవరాజు శ్రీకృష్ణారావుగారి గృహమున వా రుండగా నేను దర్శింపఁ గలిగితిని. అపుడు వీ రిరువురి ప్రోత్సాహబలమునఁ నెట్లయిన నేతద్గ్రంథము నాంధ్రీకరించి యాంధ్రభాషాయోషామణికి సమర్పింపవలె ననుసంకల్పము నాహృదయంబున నంకురించి క్రమక్రమముగ రేకెత్తి యిపు డీగ్రంథరూపమున ఫలోన్ముఖతకు వచ్చినది. ఈగ్రంథముఁ గూర్చి నే నేమియు వ్రాయ నక్కఱలేదు. ఆంధ్రదేశోద్ధారక బిరుదము సార్థకముఁ జేయుచున్న మ॥రా॥శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి పీఠికఁ బఠించి, మంచిచెడ్డల విమర్శింపవలసిన బాధ్యత, పాఠకమహాశయులయందే యున్నది. నే నీసందర్భమున నొక చిన్నయంశము మనవి చేయక తప్పదు. అచ్చటచ్చట నించుకంత మార్పు చేయవలసివచ్చినది. కథాసందర్భముఁ బట్టియు, నాంధ్రదేశీయుల రుచులఁ బట్టియు నట్లు చేయక తప్పినది కాదు తప్పో, యొప్పో నిర్ణయించువాఁడను నేను గాను. గుణగ్రహణపారీణు లగుపండితులపైఁ గవులపై నాభారమున్నది. ఆంధ్రలోకము సంపూర్ణ ప్రోత్సాహ మొసంగెనేని, మిగిలినభాగము, నచిరకాలములోనే యాంధ్రీకరింపఁగలవాఁడ నని మాత్రము వినయపూర్వకముగ మనవిచేయు చున్నాను.

# కృతజ్ఞత

నే నాంధ్రీకరించిన యీబాలకాండము, మిక్కిలి మెలఁకువతోఁ దుది ముట్టఁ జదివి, పీఠికవ్రాసి యొసంగిన, సార్థకబిరుదాంకితు లగు



శ్రీయుత భాగవతుల నృసింహశర్మగారు

విజయవిజయ, విచిత్రవీరబొబ్బిలి, ప్రతిజ్ఞాచాణక్య, అభినవభర్తృహరి, కాళికాపురాణ, రసపుత్త్రజీవనసంధ్య, గాంధిశతక, తులసీ రామాయణాది గ్రంథకర్తలు.

మ॥ రా॥ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి కాయురారోగ్య భాగ్యములఁ బ్రసాదింప శ్రీరామచంద్రుని మనఃపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. ఏతత్తులసీరామాయణ బాలకాండరచనా సందర్భమున, నాకనేకవిధములఁ దోడ్పడిన బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతి గారికి ననేకాభివందనముల సమర్పించు చున్నాను.

హిందీ తులసీరామాయణముఁ జెప్పించి, ప్రతిదినము నాకుఁ దగినంత ప్రోత్సాహ మొసంగుచుండెడు జామి కాశీవిశ్వనాథ శాస్త్రిగారికి నాయాశీర్వచనములు. ఈగ్రంథముఁ బ్రకటింప నియ్యకొనిన వేగుఁజుక్క గ్రంథమండలి దినదినాభివృద్ధిఁ బొంది యాంధ్ర మహాజనుల ప్రోత్సాహముఁ బడయుఁ గాక.

బరంపురము.
(గంజాం)

ఇట్లు
సర్వజనవిధేయుఁడు
భాగవతుల నృసింహశర్మ
గ్రంథకర్త.

| విషయసూచిక | పుటసంఖ్య |
| --- | --- |
| రావణుఁడు వాలిచేఁ బరిభవింపఁబడుట | 129 |
| రావణుఁడు కార్తవీర్యార్జునిచే బంధింపఁబడుట | 131 |
| రావణుఁడు రంభను బలాత్కరించుట | 132 |
| నలకూబరుఁడు రావణుని శపించుట | 132 |
| సీతాజననము | 134 |
| రావణుని దారుణచర్యలు | 135 |
| భూదేవి గోరూపముధరించి యమరులమ్రోలవిలపించుట | 136 |
| బ్రహ్మకృతశ్రీవిష్ణుస్తుతి | 138 |
| అభయప్రదానము | 139 |
| శ్రీరామజననము | 140 |
| నామకరణము | 146 |
| శ్రీరామచంద్రప్రభావము | 147 |
| శ్రీరామబాల్యక్రీడాభివర్ణనము. | 149 |
| విశ్వరూపప్రదర్శనము | 150 |
| విశ్వామిత్రుఁడు దశరథుని జూడవచ్చుట | 152 |
| దశరథుని పరితాపము | 154 |
| దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రుతోఁబంపుట | 156 |
| శ్రీరాముఁడు తాటకను సంహరించుట | 158 |

| విషయసూచిక | పుటసంఖ్య |
| --- | --- |
| సూర్యాస్తమయవర్ణనము | 159 |
| సంధ్యాసమయవర్ణనము | 159 |
| రామలక్ష్మణులు సుబాహుమారీచాదిదనుజుల సంహారించుట | 160 |
| అహల్యాశాపవిమోచనము | 161 |
| అహల్య శ్రీరాముని స్తుతియించుట | 162 |
| గంగావతరణవృత్తాంతము | 163 |
| రామలక్ష్మణులు మిథిలాపురమున విహరించుట | 169 |
| ఉద్యానవనమున సీతారాముల యన్యోన్యావలోకనము | 171 |
| సూర్యాస్తమయవర్ణనము | 175 |
| చంద్రోదయము | 175 |
| చంద్రోపాలంభనము | 176 |
| సూర్యోదయము | 177 |
| మునితో రామలక్ష్మణులు యజ్ఞశాలఁ బ్రవేశించుట | 178 |
| సీతాసౌందర్యాభివర్ణనము | 180 |
| వందిమాగధులు జనకుని ప్రతిజ్ఞఁ బ్రకటించుట | 181 |
| రాజులధనుర్భంగ ప్రయత్నము | 182 |
| జనకుఁడు రాజులనోదార్చి సంతాపించుట | 184 |
| లక్ష్మణునియాగ్రహము | 185 |

| విషయచూచిక | పుటసంఖ్య |
|---|---|
| పరశురామునియాగమనము | 195 |
| పరశురామునియాగ్రహము | 197 |
| పరశురామకృతశ్రీరామస్తుతి | 219 |
| సీతావివాహసన్నాహము | 220 |
| మిధిలాపుర బ్రాహ్మణుల యోధ్యకువెడలుట | 222 |

| విషయసూచిక | పుటసంఖ్య |
|---|---|
| శుభశకున సందర్శనప్రాప్తి | 227 |
| దశరథుని మిథిలానగర ప్రవేశము | 228 |
| కన్యాదానమహోత్సవము | 232 |






శ్రీరామాయనమః

అవిఘ్నమస్తు

# శ్రీ తులసీరామాయణము

## ఇష్టదేవతాస్తుతి



"రామా! శ్రితమూర్తి! కోదండ! జయశ్రీ! శ్రీధుర్యాలం జేసె, నో
గౌరీ! పావన నవర్ణములనం । ఖ్యాతంబుగన్ భక్తులన్,
ఘోరాఘాంబుధినుండి ప్రోచు" నని భ । ర్గుండున్ బ్రశంసించు సం
సారోగ్రానలకృష్ణమేఘమును రా । మున్ బ్రహ్మమున్ గొల్చెదన్

## జానకీస్తుతి

చ. వనితలకెల్ల రత్నమయి । భాసిలు నేసతిఁ గాంచినంత నే
తనరెను రత్నగర్భ యన । ధారుణి, యేలలితాంగిఁ బెంచుటన్
జనకమహర్షికిన్ జనక । నామము సార్థక మయ్యె; నట్టి సా
ధ్విని, రఘురామభూమిభుని । దేవిని, నెంచి నమస్కరించెదన్.

## శ్రీవిష్ణుస్తుతి

మ. సిరితో ముచ్చటలాడు వేళనయినన్ । జేజేలు, మౌనీంద్రులున్
"నరసింహా" యని సన్నుతించునపుడై । నన్ దన్నుఁ బ్రార్థించినన్
గరుణన్ వేఁ జనియెట్టి ప్రాణినయినన్ । గాపాడు వేల్పున్ సురా
సురసంపూజితు, జిష్ణు, విశ్వమయు, వి । ష్ణున్ గృష్ణుఁ బ్రార్థించెదన్.

## లక్ష్మీస్తుతి

ఉ. మత్సర మూలి కౌస్తుభము । మాదిరి భాసిలు నుత్సహించు శ్రీ
వత్సము పెంపణంచి నిజ । ఫాలకళంకము తేజరిల్ల, నే
త్రోత్సవమై రహించి, కమ । లోదరు పేరుర మాక్రమించి, యా
పత్సమయంబునన్ దనదు । భక్తులఁ బ్రోచెడు లక్ష్మిఁ గొల్చెదన్.

## మహేశ్వరస్తుతి

చ. తనయుఁడ మేనుఁ బార్వతి స్వ । తంత్రతఁ గైకొని కౌఁగిలింపఁగన్
దనిసి, కుమారు గర్భమునఁ । దాల్చినయంతఁ దదర్ధభారమున్
గొని, ప్రసవించు వేళఁ బను । నొప్పులలోఁ దన కెట్టిపాలు లే
దనుచు విచార మొందినగ । మైన మహేశ్వరు సన్నుతించెదన్.

## పార్వతీస్తుతి

సీ. మువ్వేల్పులకు మున్ను । పూజలం గొనెడు పె
ద్దమ్మ యయ్యును బాల । యనఁగ నొప్పెఁ
గడుభీతిఁ గొలిపెడు । కాళి నాఁ బరగియుఁ
ద్రిపురసుందరి నాఁగఁ । దేజరిల్లె,
నాఁడభిక్షుకునిఁ బెం । డ్లాడినయట్టి య
పర్ణయయ్యు సదాన్న । పూర్ణ యయ్యెఁ,
గాత్యాయనీఖ్యాతిఁ । గలిగియుఁ గడుపార
ననుఁగుబిడ్డలఁ గన్న । యార్య యయ్యెఁ,
గీ. భూమిధర సార్వభౌముని । పుత్రి యయ్యుఁ
నరయ నారాయణి యనంగ । నలరె, నట్టి
సతిని, సుగుణవతిని, శుభా । కృతినిఁ జారు
మతిని, వీరసంతతిని, నా । మతిని గొలుతు 6

### కుమారస్తుతి

చ. యమనియమాదియోగకలితాత్ముని భగ్గునిఁ బెండ్లియాడి, యా
యమ యుమ నైరహించి, కడుపారఁగ నెవ్వనిఁ గాంచె, వాసవా
ద్యసురులఁ బ్రోచ నేయలఘుఁ డాతనిఁ గొల్చెద సింహావిక్రమ
క్రమజితతారకాసురునిఁ, గ్రౌంచవిభేదను, వైరిసూదనున్. 7

### గణేశస్తుతి

చ. "కనుఁగొనఁ జంద్రరేఖయును గంగయు రాజిలె, ఫాలనేత్రమా
యినుఁ డనవచ్చుఁ, జుక్కలు రహింపవుగా" యని తుండమెత్తి ఖే
లనముగ గాంగశీకరములన్ బయిపై వెదఁజల్లి నేను నా
జనకుఁడు వ్యోమకేశుఁడని సమ్మదమందు గజాస్యుఁ గొల్చెదన్.

### విధాతృస్తుతి

ఉ. "జే" యని సన్మునీంద్రులు భజింప, సరస్వతి ముచ్చటింప, నా
మ్నాయపయోధి నంచయను నావపయిన్ విహరించు సత్యధా
రేయుని, సాత్త్వికోదయు, విరించను, విశ్వసృజున్, విధాత, దీ
ర్ఘాయువు శ్రీయు, నీయఁగల యానలు మోముల వేల్పుఁ గొల్చెదన్.

### సరస్వతీస్తుతి

మ. "జననీ" యంచు నుతించు సత్కవుల యజ్ఞానాంధకారంబుఁ దా
గనులన్ గాటుకఁగా, శిరంబున కలంకారంబుఁ బోల్ కొప్పుఁగాఁ
గొని, విజ్ఞానశరీర యై, సుకవితా కోటీర యై, సాహితీ
వనిలోఁ బాటలఁ, బాడుచున్ మెలఁగు నవ్వాణిం బ్రశంసించెదన్.

### హనుమద్వాల్మీకిస్తుతి

గీ. జానకీరామ సుగుణప్రసూన జనిత
వరశోగంధభృజ్జగద్వనమునందు

సాహితీగానఫల రసా । స్వాదనమున
వటులు నత్కవీశ్వరుఁ గవీ । శ్వరు నుతింతు. 11

వ్యాసమహాముని స్తుతి

ఉ. వ్యాసుఁ, గవీంద్రచిత్తగృహ । వాసు, జగన్నుత భారతాగమో
ల్లాసుఁ, బవిత్రవాఙ్మయవి । లాసు, మునిస్తవనీయచిత్కళా
భ్యాసుఁ, బురాణరత్నచయ । భాసు, శ్రుతిస్మృతిమార్గపాదవి
న్యాసు, నుతించెదన్ సతము । హస్తము లెత్తి నమస్కరించెదన్.

శంకరాదిమతగురుస్తుతి

ఉ. ప్రాకటతత్త్వవేత్త లయి । పామరకోటిఁ దరింపఁ జేయ లో
కైకమతప్రచారమున । కై భువిఁ గారణజన్ము లైన ను
శ్లోకుల, శంకరాది మత । సూరుల ధీరులఁ, గొల్చెదన్ నమో
వాకముఁ బల్కెదన్ సకల । పండితపామర సమ్మతంబుగన్. 13

శ్రీగాంధిస్తుతి

ఉ. గాంధికి, లోకసన్నుత యు । గంధరమంత్రిసమానదివ్య ధీ
కంధికి, వాఙ్నిశాతశర । కాండవిఖండిత శత్రురాడ్గళ
గ్రంధికి, సంధివర్జితవ । రస్వరరంధికి, సర్వదేశసం
బంధికి, భక్తిపూర్వకన । మస్కృతు లిచ్చెద నిష్టసిద్ధికిన్. 14

సద్భక్తప్రశంస

చ. కొనవిడుభక్తి రాఘవునిఁ । గొల్చి భుజింపఁగఁ బో, క్షుధాగ్నిచేఁ
గనకనలాడు నొక్కశున । కంబు గృహంబును జొచ్చి, భక్ష్యముల్
గొనిపరువెత్తఁగన్, "ఘృతముఁ । గొమ్మనుజా" యనియాజ్యపాత్రితో
వెనుకొను ధీరు నెన్నఁదగ । బీరుని భూతదయానుసారునిన్. 15

సీ. శతకోటిమార్తాండ । సంకాశకాంతి నా
వ్యామోహతమసంబు । నణఁచుఁ గాదె?
ఘనసార కస్తూరి । ఘనవాసనల మీఱి
మలినవాసనలను । దొలఁచు గాదె?
దేవవైద్యప్రాప్త । దివ్యౌషధ మనంగ
భవరోగబాధలఁ । బాపుఁ గాదె?
ఫాలాక్షతనులిప్త । భస్మధూళిం బోలి
కామాగ్నికీలలఁ । గప్పఁ గాదె?

గీ. అమృతమూలికాచూర్ణ మై । యార్యజనుల
హృదయదర్పణములము హ । రించుఁ గాదె?
భక్తజనపాదరజము, దే । వతల కిజము
ఎల్లజనులకు నూహింప । నిదియె నిజము. 16

ఉ. అన్నవనీతచోరుని క । థామృతధారలఁ గ్రోలినట్టి పో
తన్నను గొల్చి, రాముసుగు । ణౌఘము లెన్నిన రామదాసు గో
పన్నను మెచ్చి, రాముచరి । తాంబుధి నీదిన గోపినాథ వేం
కన్నను, సుబ్బరాయకవి । కాంతుని నెంచి, నమస్కరించెదన్.

సీ. అన్నకు నఖిలపి । త్రార్జిత మర్పించి,
రామపీఠంబు మా । త్రము గ్రహించి,
రఘురామభక్తి, సా । మ్రాజ్య మంచు భజించి,
భోగభాగ్యవిలాస । ములఁ ద్యజించి,
ఏడిండ్లలో బిచ్చ । మెత్తి తృప్తిం గాంచి,
నృపు లిచ్చుకల్మిఁ దృ । ణీకరించి,
హృద్యానవద్యస । త్కృతులను విరచించి,
కలియుగనారద । ఖ్యాతి మించి,

గీ. గాయకశ్రేష్ఠులకు నగ్ర । గామి యైన
యతులశాంతాననాంభోజు । యతిబిడౌజుఁ;
త్యాగవిజితాంగరాజు, శ్రీ । త్యాగరాజు,
భక్తిధిక్కృత కపిరాజుఁ । బ్రస్తుతింతు. 18

చ. ఎవనిఁ స్మరింప, జ్ఞాన ముద । యించి నిజాత్మగృహస్థదీప మై
రవియనఁ గ్రాలు, మోహమయ । రాత్రి సమస్తము నస్తమించునో,
బ్రవిమలదివ్యనేత్రము వి । రాజిలు, రామచరిత్రరత్న వై
భవము లభించు, నట్టిహరిఁ । భక్తున కిచ్చెద మన్నమస్కృతుల్.

సత్పురుషప్రశంస

గీ. మోహజనితసందేహసం । దోహతమస
మెవరి నఖకాంతికిఁ నశి । యించు నందు
రట్టిగుణమణిఖను లగు । నార్యజనుల
సాధుచరితంబు నెన్నెద । సంతతంబు. 20

గీ. నీరసం బయ్యు గుణములన్ । విస్తరిల్లి,
యన్యగుహ్యావనంబున । కఖిలకష్ట
ములకు నోర్చిన కార్పాస । ఫలముఁ బోలు
సాధుచరితంబు సత్కవి । సన్నుతంబు. 21

గీ. మంగళానందకరరూప । మహిత మగుచు
నలరు సాధుసత్పురుష స । మాగమంబు,
పతితపావనవిఖ్యాతిఁ । బరిఢవించు
జంగమాకార తీర్థరా । జంబు గాదె? 22

గీ. సత్పురుషనామ తీర్థరా । జంబునందు
రామభక్తియె గాంగని । ర్ఝరిణిఁ బోలు;
బ్రహ్మజిజ్ఞాసయే సర । స్వతినిఁ బోలు;
హరికథాసుధాలహరియె । యమునఁ బోలు. 23

గీ. సాధుసజ్జనతీర్థరా । జంబునందు
విమలవిశ్వాసమే వట । వృక్ష మగును;
ఆత్మధర్మంబె యూహింప । నచలభావ;
మఖిలజనగమ్య మత్యాది । యవనియందు. 24

గీ. అందు సేవించి సుస్నాతు । లైనవారు
వరచతుర్వర్గఫలసిద్ధిఁ । బడయఁ గలరు
సాధుసజ్జన తీర్థరా । జప్రసిద్ధి
ఇట్టి దని చెప్ప శక్యంబె । యెవరి కైన. 25

గీ. సాధుజంగమతీర్థరా । జంబునందు
సంచరించినఁ గొక్కెర । యంచ యగును;
కాకియున్ గోకిలంబగు । ఘనతఁ గాంచుఁ;
దత్ప్రభావ బు వర్ణింపఁ । దరమె మనకు.

మ. మునివాల్మీకియు, నారదుండు, ఘటసం । భూతుండు, నూహింప స
జ్జనసాంగత్యము కారణంబునను ప్ర । జ్ఞాధుర్యు లై, భూతలం
బున రాణిల్లరె? భూజలాంబరచరం । బుల్, చేతనంబుల్ విచే
తనముల్ ధన్యతఁ గాంచవే యతుల । త్సాంగత్యయోగంబునన్.

గీ. స్థల జలాంబరచరములు, । స్థావరములుఁ
జేతనంబులు, నను పంచ । జీవములును
మతి, యశో, గతి, భూతి, స । న్మాననీయ
వర్తనము లొందె సుజనసం । పర్కమునను. 28

గీ. మంగళానందనామక । మ్మోజమునకుఁ
బురుషవరుల సత్సంగతి । మూల మండ్రు;
జపతపస్సాధనములు పు । ష్పంబు లండ్రు;
కార్యసిద్ధియే ఫలమందు । రార్యజనులు. 29

గీ. శఠుఁడు సుజనసాంగత్య సం। సర్గమహిమఁ,
బారదముఁ బొందు లోహంబు। వలె రహించు;
ఘనుఁడు దుర్జనసాంగత్య। మొనసె నేని?
బాము చందాన గుణమణిం। బాయకుండు. 30

చ. సరసిజగర్భుఁ డున్ హరియు। శర్వుఁడు వాణియుఁ బండితోత్తముల్
సరసకవీంద్రులున్ బురుష। సత్తములన్ గొనియాడుచుందు రా
సరణిని వారి నేఁ బొగడఁ। జాలుదు నొక్కొ? యనర్ఘరత్నభా
స్వరసుగుణోత్కరంబులను। శాకవణిక్కు గ్రహింపవచ్చునే? 31

చ. పరనిజభేదహీనమను। భావులు, పుష్పసమాను లైన స
త్పురుషుల కేను సంతతము। మ్రొక్కెద హస్తయుగంబు తద్యశః
పరిమళవంత మై యెసఁగ; । బాలుర ముద్దులఁ బోలు మద్వచ
స్సరణిని వీనులార విని। సంతస మొందెద రంచు నెంచుచున్.

దుర్జనప్రశంస

చ. ఖలు లగువార లాత్మహిత। కాంక్ష రవంతయు లేనివార ల
న్యులకు హితంబుఁ జేయరు, జ। నోత్తమగేహవినాశనాభిలా
షులు, గృహసుస్థిరత్వమును। జూడరు, నెమ్మది మంచిచెడ్డలం
దలఁపరు, వారి కేను సత। తంబును మ్రొక్కెదఁ గార్యసిద్ధికై.

చ. హరిహరసచ్చరిత్రముల। నారయువేళల, విఘ్న మాచరిం
తురు, పరసద్యశోవిధు వి। ధుంతుదు లౌర! సహస్రబాహుభీ
కరులు, సహస్రనేత్రు లవ। కార మొనర్పఁగ, దోషపుంజముల్
పరిపరి సంప్రతింప; ఖలు। లన్ బహుభావల సన్నుతించెదన్. 34

గీ. ఖలుల కోపంబు మహిషరా। కేన నిభంబు;
వారి తేజంబు ప్రజ్వల। ద్వహ్ని సమము;
ఉదయ మూహింప ధూమకే। తూవ మితము;
హితము కుంభకర్ణుని నిద్ర। వితము దలఁప. 35

గీ. "చచ్చిసాధించు'' నను సామ్య । మిచ్చగించు
దానవులు దుర్జనులు; వారి । మానసములు
ఒరుల సుఖసస్యములకు హి । మోపలములు
సజ్జనహితాజ్యమక్షికా । సంచయములు. 36

గీ. అన్యదోషంబు వర్ణింప । నాలకింప
ఫణికులేశులు, పృథుచక్ర । వర్తు లనుచు
ననిశము సు రానుకూలు రై । యలరు నట్టి
యమరవిభు లంచు ఖలుల నే । నభినుతింతు. 37

గీ. హితము నహితము నొకరీతి । నెదఁ దలంచు,
శాత్రవుని, నుదాసీనుని । మిత్రవరుని
నొక్కరీతిగ భావించు, । నుక్కలుండు;
వానినైజంబు వినుతింప । వలయుఁ గాదె? 38

గీ ఎలమిఁ బ్రేమించు శిష్టుని । చెలిమిఁ గనక
దాష్ట్యముం జూపు దుష్టుఁ డౌ । ద్ధత్యమునను;
పాయసముఁ బాసి యతినీచ । ఫలలఖండ
మాత్రమున కాతఁ డలరుఁ బో । మానసమున. 39

చ. హిత మొనరించి స్నేహమున । కెంతయు సంతస మొందుసజ్జనుం
డతులవియోగదుఃఖము నొ । కప్పుడు గూర్చు; నసజ్జనుండు సం
గతముఁ దిరస్కరించు, నుప । కార మొనర్పఁడు, సేగిఁ గూర్చు; నే
సతతము నేకరీతి నశ । సజ్జనులం గని నన్నుతించెదన్. 40

చ. జలజజలూకముల్ సలిల । సంభవముల్,సుధయున్ విషాగ్నియున్
జలనిధిఁ బుట్టె; నట్లు, సద । సజ్జను లొక్కెడ సంభవించినన్
దలఁపగ మంచిచెడ్డల వి । ధంబునఁ గీర్త్యపకీర్తులం బలెన్
బొలుచును వారివారి గుణ । ముల్ జనలోకశుభాశుభంబులై.

గీ. అమృతరాశియుఁ జంద్రుండు, । నమరనదియు
సజ్జనోపమానంబులు । జగతియందు;
నగ్నియున్, దుష్టకలియును, । హాలహాలము,
నహహ దుష్టోపమానంబు । లండ్రుబుధులు. 42

గీ. మంచిచెడ్డల లో వివే । కించుకొనుచు
సంచరింతురు సజ్జనుల్ । జగతియందు;
దాము గావించునదియె । సిద్ధాంత మనుచుఁ
గష్టముల సంఘటింతురు । దుష్టజనులు. 43

గీ. మంచిఁ గావించి విఖ్యాతిఁ । గాంచె ఘనుఁడు,
ఎల్లజనులఁ బీడింప వ । ర్ధిల్లె ఖలుఁడు,
అమృత మమరత్వమునను వి । ఖ్యాతిఁ బొందె;
విష మపాయంబుఁ గావింపఁ । బృథ్వి వెలసె. 44

గీ. స్వర్గ నరకంబులను బోలి, । బ్రాహ్మణ శ్వ
పచుల చందానఁ, బుణ్యపా । పములభంగిఁ,
గలిమి లేములరీతి, నమరరా । క్షసుల కరణి
జగతి వర్ధిల్లు సుజనదు । ర్జనుల సరణి. 45

గీ. చేతనాచేతనంబుల । సృష్టిఁ జేసి
మంచిచెడ్డల బ్రహ్మ క । ల్పించుఁ గాక;
దోషవిషరాశి సద్గుణ । దుగ్ధరాశి
నంచవలె సజ్జనుండేర్ప । రించుఁ గాదె! 46

గీ. విధివశంబున జ్ఞాన మా । విర్భవింప
దోషముఁ ద్యజించి జనుఁడు స । ద్గుణముఁ బడయుఁ;
గాల నైజకర్మంబుల । కారణమున
మాయకుం జిక్కి వర్జించు । మంచితనము. 47

చ. వ్రణమును మించుదుష్టుని స్వ। భావము మాన్పఁగ శక్యమా? స
ద్గుణయుతు లైన సజ్జనుల। కూటమిచే నొకదుర్జనుండుఁ దా
గుణియగుఁగాక, నైజగుణ। దోషముమాత్రముఁ బాయఁ, డెన్నఁడున్
ఫణిమణిధారణంబునను। బాయునొకో కుటిలప్రచారమున్. 48

గీ. జలము, పవనంబు, గ్రహము లో। షధులు, వస్త్ర
ములును, సాంగత్యకారణం। బునను గాదె
మంచిచెడ్డలఁ గావించు। మానవులకు;
నరయఁ దగుఁ జూవె సాంగత్య। మనఁగ నేమొ? 49

గీ. అంధకారప్రకాశంబు। లాక్రమించి
యొకటి చంద్రుఁ బోషించు, నిం। కొకటి యణఁచు;
నక్కతంబున నీరెండు। నవనియందు
జనుల కీర్త్యపకీర్తుల। సామ్య మొందు. 50

గీ. సృష్టిఁ బెంపొందు చేతనా। చేతనముల
నఖిల జీవంబులన్ బర। మాత్ముఁ డైన
రాముఁ డాత్మ యై సతతంబుఁ। గ్రాలుచుండు
నెల్లపుడు మొక్కు లర్పింతు। నెల్లఱకును. 51

కవిప్రశంస

సీ. భాసత్కవి పాద। పద్మసౌరభ మాని,
కాళిదాసుని దివ్య। కవిత కెఱఁగి,
బాణుని వాగ్వైభ। వప్రభవము నెంచి,
పండితాఖండలు। దండిఁ దలఁచి,
భవభూతి సుకవిత్వ। పటిమను గొనియాడి,
జయదేవు విమలవా। ఙ్మయముఁ బొగడి,

బిల్హణు సుకవితా । కల్హారమును మెచ్చి,
మల్హణు వాగ్జాల । మహిమ మరసి,

గీ. భారవికి నర్థగౌరవ పద । మొసంగి,
సరసమేఘుని మాఘుని । సన్నుతించి,
ఉరుగదాహిమయూరు మ । యూరుఁ గొల్చి,
యాంధ్రకవిపుంగవశ్రేణి । నభినుతింతు. 53

గీ. రావణుని కారణంబున । రాఘవునకు
సద్యశశ్శ్రీ లభించిన । చందమునను,
కుకవిచేఁ గాదె సత్కవి । కొమరు మిగులుఁ
గుకవి నేరీతి దూషింతుఁ । గోవిదుండు. 53

స్వవిషయప్రస్తావన.

శా. "వ్యాసోచ్ఛిష్టమయంజగ" త్తని బుధుల్ । భాషింపనాలించియున్
దీపంబో యణుదీపమో కఱచి ని । ర్వేదంబునం బోక, యు
ల్లాసం బూని ప్రబంధకంధిజ యశో । లక్ష్మీ విలాసంబునన్
భాసిల్లన్ గమకింతు రాత్మగత వి । శ్వాసంబునన్ మాదృశుల్

చ. తలఁపులు స్వల్పముల్ సుకవి । తా గరిమం బిసుమంత లేదు, పూ
ర్వులవలెఁ గీర్తిం బడయుఁ । బూనితి రామకథన్ రచింపఁగన్;
దలఁపఁగఁ గుంటివాఁడు రత । నంబులఁ గోరి యగాధ మైన య
జ్జలనిధిలోనికిన్ దుముకు । చందమునన్ విబుధుల్ హసింపఁగన్.

ఉ. మాయలఁ బన్ను దానవుల । మాపి, జగంబులఁ బ్రోవ నాదినా
రాయణుఁ డర్కవంశమున । రాముఁ డనంగ జనించి నిత్యపా
రాయణయోగ్య మైన యభి । రామయశంబు గణించెఁగాన రా
మాయణ దివ్యగాథఁ గొని । యాడెదఁ బండితు లాదరింపరే! 56

ఉ. ఆదరణీయ సారకవి । తాధికు లైన మహాకవీంద్రులా
మోదమునన్ రఘూద్వహు న । మోఘచరిత్రసుధాబ్ధి మగ్ను లై
యాది రహించి; రేనును ద । దంబుధి దోఁగి భవాబ్ధి దాటినన్
గా దను వారె? యట్టియధి । కారము లే దనువార లుందురే? 57

ఉ. రాతిని నాతిఁ జేసె రఘు । రాముని పాదసరోజధూళి; నా
కాతనిసత్కటాక్షకళి । తామృతవృష్టి లభించె నేని, మ
చ్చేతమునంద మోఘముగ । జీవకళా కవితాస్రవంతి నం
జాతము గాక యున్నె? యఘు । సంచయవృక్షము పెల్లగిల్లగన్.

చ. ఎవని కృపాదృగంచల మొ । కించుకయంత లభించినంతఁ బం
గువు వనపర్వతాంబునిధి । కోటుల దాటఁగ నోపు, మూఁగయున్
గవనముఁ జెప్పు, నట్టిహరి । నామము సంతతమున్ స్మరించు స
త్కవులకు లోవ ముండ దను । ధైర్యమునన్ విరచింపఁ బూనితిన్.

శా. పీయూషంబును ధిక్కరించు కవితా • విస్ఫూర్తి లేకున్న, సు
జ్ఞేయాంశంబులఁ జొన్పి, పాఠకులు హా । ర్దింపంగ, క్లిష్టార్థముల్
బాయం జేసి, శిరీషపుష్పమృదువా । క్ప్రాగల్భ్య మేపార నే
వ్రాయం జొచ్చితి నిచ్చ మెచ్చి తులసీ । రామాయణగ్రంథమున్.

మ. తులసీదాసుఁడు భక్తితత్పరత, సం । తుష్టాంతరంగంబునన్
బలుకన్ సర్వదిగంతరంబుల ధ్వనిం । పన్ గర్ణపర్వంబుగాన్;
గలనాదం బని సామగాన మని వి । జ్ఞానుల్ ప్రశంసింతు రే
యులఘుగ్రంథము; నట్టిగ్రంథమును నే । నాంధ్రీకరింతున్ దగన్.

మ. తులసీదాస కృతప్రబంధ మతి ని । ర్దుష్టంబు; స్పష్టంబుగన్
దెలుఁగుంబాసను వ్రాయఁగా దొడఁగితిన్; । శ్రీరాము సేవింప, నా
తులసీదాసుని గౌరవింప, విబుధ । స్తోమంబు మద్గ్రంథవా
క్కులసారస్యము సంగ్రహించి, సభలన్ । గొండాడ కగ్గాదు నే?

గీ. రాముఁ డభిరాముఁ డాదినా । రాయణుండు;
తులసి, తత్కథాలహరికి । నలరి పలికె;
నట్టి పలుకులఁ బలికెద । నాంధ్రమునను;
సంతసింపని ప్రాజ్ఞు లీ । జగతిఁ గలరె? 63

ఉ. ఏయెడ నన్నపార్యగతి । నేగఁగఁ బాండితి లేదు, భారతా
మ్నాయ విరించి తిక్కకవి । నాథుని ఫక్కి యలభ్యయోగ మా
హా! యెఱనాదిసత్కవుల । యట్లు రచింపఁగఁ జేవ లేదు, రా
మాయణ సత్కథారచన । మాటలపైఁ గొనసాగునట్టిదే॥ 64

ఊ. పంతముఁ బూని కావ్య మన । పద్యముగా విరచింప నౌనె? ధీ
మంతున కేని దోషము ప్ర । మాదవశంబున నుండు నందురే
నెంతటివాఁడ? దప్పుఘటి । యిల్లిన నయ్యది యక్కజంబె? యా
వంత కృపాకటాక్షమున । నారయుఁడీ కవులార మ్రొక్కెదన్. 65

ఉ. శ్రుత్యవపథ్యశబ్దములఁ । జొన్పను, క్లిష్టసమాసదుష్టసాం
గత్యముఁ గూర్ప, భావ రస । గౌరవమున్ విడనాడ, శైలిదా
ర్గత్యముఁ జూప, వ్యర్థపద । కాండముఁ బ్రాసములన్ ఘటింప, సా
హిత్యము లేనిపాఠకుల । కిర్వగ నెంతయు నింపు నింపదే? 66

శా. కారాగారమునందుఁ జిక్కి హరిభ । క్తప్రోక్తమార్గంబునన్
హో రామా సుగుణాభిరామయనుచున్ । ధ్యానింపఁగన్ మెచ్చి ని
స్సాకున్ తుష్టునిఁ జేసి భక్తునకు స్వే । చ్ఛం గూర్చి రక్షించు సీ
తారామున్ గొనియాడు వేళ సుకవి । త్వస్ఫూర్తి ప్రాప్తింపదే? 67

ఉ. వీనుల కింపుఁ బెంప, సుక । విప్రకరప్రమదప్రదాన మై
తానముతోడి గానము వి । ధానమునన్ గనుసొంపు సింప, వి
జ్ఞానము పల్లవింప, జన । సంఘము మే లని యాలకించి యా
నా నని సంతసింపఁ గవి । తామృతధారలఁ గ్రుమ్మరించెదన్. 68

చ. సురనది కైవడిన్ విషము। జొబ్బిల, వక్రపథప్రచారమున్
బొరసిన నేమి! రాఘవునిఁ। బొందినమత్కవిప్రయువాహ మి
ద్ధరణిఁ బవిత్ర మై బుధను। తం బగుఁ గాదె! శ్మశానభూతి యీ
శ్వరతనులిప్త మై పరమ। పావన మయ్యె జగన్నుతంబుగన్. 69

చ. హరిహరపాదపద్మముల। యం దనురక్తిఁ గలట్టివాఁడు మ
ద్విరచితకావ్యపఙ్క్తి విని। వేమఱు సంతసిలున్; కుతర్కమున్
మఱఁగి యసూయతన్ దురభి। మానమునన్ సదసద్వివేకవి
స్మరణమునన్ మెలంగు మతి। మంతునకీకృతియింపుఁ బెంపునే? 70

చ. తనకయితంబు రమ్యమయి, । తాను పఠించిన యంతరువ్యమై,
ఘనమయి, పంచదారచిలు। కంబలెఁ దియ్యముగాఁగ దోఁచు; నే
యనఘుఁడు నిర్మలాత్ముఁడయి। యన్యసుభాషితముల్ పఠించునో,
విని ముద మందునో, యతఁడె। విజ్ఞుఁ డనందగు నెల్లభంగులన్.71

గీ. భావరసపుష్టి, ఛందోని। బంధనంబుఁ
బదచమత్కృతి మత్కృతి। త్వంబునందు
నించుకంతయుఁ గనుపట్ట। దెంచి చూడ
రామకథ యని సజ్జనుల్। ప్రస్తుతింత్రు. 72

గీ. భాగ్య మత్యల్ప మాశ య। పారవార్ధి?
అల్పుఁ డపహాసముం జేయు। టట్టు లుండె;
సజ్జనుఁడు సంతసించినఁ। జాల దొక్కొ
యనెడువిశ్వాస మొండు నా। యాత్మఁ గలదు. 73

గీ. కాకి, కలకంఠముల కంఠ। గరిమఁ గేరు;
బకము, హంస నిస్వనమును। బరిహసించు;
గప్ప, చాతకస్వరమును। గాకు సేయు;
నీచుఁడు సుభాషితంబులన్। ధిక్కరించు. 74

ఉ. నల్లని యావు, త్రావెడుజనంబులకున్ గుణదాయకంబుగన్
దెల్లని పాలొసంగు కరణిన్ బరికింప మదీయపుస్తకం
బెల్లవిధంబులన్ మిగుల హేయముగన్ గనుపట్టుఁ గాక, యా
నల్లని వేల్పుఁ జెందుకతనన్ రసవంతము గాక యుండునే 75

మ. ఫణిభోగంబున, నద్రిపై, గజశిరోభాగంబునన్ బుట్టియున్
మణి, మాణిక్యము, మౌక్తికంబుఁ, దలఁపన్ ద్త్స్వాపాలుమాలిన్ బ్రతి
క్షణమున్ గాంతులఁ గ్రాలురీతి, నొకచోజన్మించి, వేఱొక్కచో
బ్రణుతిన్ గాంచి రహించుసత్కవికృతి గ్రంథం బమందంబుగన్

చ. హృదయసముద్రసీమను రహించెడు మామకబుద్ధిశుక్తియన్
సదనమునందు, వాణి యను స్వాతిసమాగమ మైనవేళ, ధీ
ప్రదనువిచారవర్షజలపాతమునన్ సుకవిత్వమౌక్తికం
బొదవదె? రామనామతరళోన్నతిఁ గాంచదె కావ్యమాలలన్.

ఉ. పుట్టను బుట్టినట్టి మునిపుంగవుఁ డాదిని రామగాథకుం
బట్టముఁ గట్టెఁ గాదె? సుగమంబుగు నాకిఁకఁ గష్టముండునే?
గట్టిగ భూధవుం డెలమిఁ గట్టగఁ గట్టిన యట్టిసేతువున్.
బట్టి పిపీలికంబు నదిపారముఁ జేరదె యశ్రమంబుగన్ 78

చ. కలిమిఁ గలట్టివారలకు గ్రంథము లిచ్చిన లాభ మేమి యి
య్యిలఁ గలయెల్లఱన్ విడిచి యాకృతి రాముని నాశ్రయించు, న
మ్మలయధరాశ్రయంబుఁ గల మ్రాఁకుల; వెండి, పసిండి వెండికొం
డలఁ గలమ్రాఁకులం గనిన నానుడిచందము తెల్లమయ్యెడిన్

ఉ. సత్యముఁ దప్పనట్టి యభిజాతుఁడు, సద్గుణవంతుఁ డంచుఁ బా
శ్చాత్యులు సైత మేఘునుని శాశ్వతసత్కథ లాలకింతు రా
సత్యుని, గీర్తిసాంద్రు, ధరణీరమణేంద్రుని, రామచంద్రునిన్
గృత్యధినాథుఁ జేసి వివరింతుఁ బటుత్వకవిత్వతత్త్వమున్. 80

చ. కవివరు లెల్లరుం గరస । కావ్యము లెన్ని రచింప, రిట్టివిం
గవిదితకావ్యముల్ ఖలము । లై నవియెన్నియొ, సూర్యరశ్మియుం
దవులని వెన్నియుండ వయి । నం భవతారక హేతు వంచు రా
ఘవునకు భక్తి నంకితము । గా విరచించెద నచ్చరిత్రముం. 81

గీ. వరకవిపోక్త సత్కావ్య । వైభవంబు
హేయ మగుఁ గాదె! రాముని । నెనయ కున్న;
సత్యలంకార భూషిత । యయ్యుఁ జంద్ర
వదన దూషిత యగును వి । వస్త్రయైన? 82

కృతి కన్యా దానము

ఉ. శ్రేష్ఠము నీకు నంకితముఁ । జెందినగ్రంథము; శబ్దసౌష్ఠవా
ధిష్ఠిత మై, పరిష్కమయి, । దీర్ఘసమాసవటిష్ఠ మై, రస
ప్రేష్ఠము నయ్యు నీదునుతి । పెంపు వహింపనియట్టిగ్రంథ మ
ల్పిష్ఠము, పండితుల్ భళిభ । ళీ యని మెచ్చరు జానకీపతీ. 83

ఉ. పండితు లైనవారలు ప్ర । బంధములోలి నరాంకితంబు గా
కుండ రచించి నీకొసఁగి । యుండిరి, వారల కుండునట్టిస
త్పాండితి లేకయుండిన, భ । వత్పదభక్తిసుధారసప్లుతా
త్ముండను గావునన్ పలుకఁ । బూనితి నీకృతి జానకీపతీ! 84

చ. సరళపదాన్వితన్, సుజన । సన్నుతవృత్త, సువర్ణవిగ్రహన్,
సరసగుణాలవాలఁ, గవి । సంఘనుతలక్షితలక్షణాఢ్య, సుం
దరగజయానఁ, జారుతర । నర్తన, భూషితచంపకోత్పలో
త్కరఁ, గృతికన్యకన్ గరుణఁ । గల్గి గ్రహింపుము జానకీపతీ!85

మిత్ర ప్రశంస

మ. గురువర్యుండు మదీయబాంధవుఁడు, నా । కుం జాలయిష్టుండు, భూ
సురలోకోన్నతుఁడార్యపూజితుఁడు, సు । శ్లోకుండు, దాంతుండు, స

చ్చరితుం డూర్జితధీవిశారదుఁడు, మ । స్వాంతుఁడు, శాంతుండునౌ
తదీయార్యున్ వినుతింపఁగాఁ దగదె, మ । గ్రంథార్థసాహాయ్యునిన్

గీ. ఆదిభట్ల జోగయ్య మ । హాశయుండు,
జ్యోతిషగ్రంథజలధిమ । థోద్భవుండు,
సకల వైదిక మార్గని । ష్ఠాగరిష్ఠుఁ
డతనిపుత్త్రుండు తరిణయ్య । యను ఘనుండు; 87

గీ. సంస్కృతాంధ్రభాషాక్షీర । జలధిజాత
దివ్య పీయూషముం గ్రోలి । తేజరిల్లు
పండితాఖండలుండు, మ । త్ప్రాణహితుఁడు,
సకలబుధసన్నుతాజాత । శాత్రవుండు. 88

గీ. అతని ప్రోత్సాహమునను సా । హాయ్యమునను
ఇమ్మహాగ్రంథరాజంబు । నెట్టులైన
నంతరింపఁ దలంచితి; । సంతసించి
పండితులు నన్ను మన్నింప । వలయుఁ గాదె! 89

రామనామమహిమాభివర్ణనము

గీ. అహహా!! రామాయణామ్నాయ । మనఁగ నేను
మెఱుఁగ శక్యంబె! వాల్మీకి । మెఱుఁగుఁ గాక;
జనులకుఁ గోమలం బగు । నక్షరమయ్యు
దూషణాన్వితమయ్యు ని । ర్దుష్ట మగును. 90

గీ. జలతరంగంబులంబోలి । కలసి మెలసి,
అతులవాగర్థముల భంగి । నుతికి నెక్కు,
జానకీరామచంద్రుల । సన్నుతించి,
వారి పదపద్మదాసుఁడఁ । బ్రస్తుతింతు. 91

చ. భరతునిఁ గొల్చి, లక్ష్మణుని । వానిసహోదరుఁ బ్రస్తుతించి, దా
శరథిని గన్న దంపతుల । సంపదలం గొనియాడి, జానకీ
పరిణయకర్త యాజనకు । పార్థివముఖ్యు వినుతించి, దైత్యవా
నరులను, జాంబవంతుఁ, గపి । నాథుఁ దదన్యుల సన్నుతించెదన్

చ. అనఘము, సూర్యచంద్రులకు । నగ్నికిఁ గారణభూత, మావిరిం
చనునకు, శూలికిన్, హరికి, । స్థానము; నిర్గుణ, మాగమాలయం
బనుపమ మాద్య, మచ్యుత మ । నంతశుభప్రదమంత్రరాజ మే
ననిశముఁ బ్రస్తుతింతు సుగు । ణామృతధామము, రామనామమున్

చ. సతతము మంత్రరాజ మని । శాశ్వతమంచు నమోఘమంచుఁ, బా
ర్వతిహృదయంబునం గొలుచు । రామునినామముఁ దత్త్వభావమున్
మతిని గ్రహించి శూలి తన । మైనగమున్ సతి కిచ్చె; లోకస
మ్మకముగ రామనామమహి । మం గొనియాడి భజించు భక్తుఁడై

గీ. హరి సహస్ర నామములకుఁ । బ్రాణ మైన
రామనామమంత్రంబును । బ్రస్తుతించి
ఆదికవి యైన వాల్మీకి । యనఘుఁ డయ్యెఁ;
దత్త్వభావంబు వర్ణింపఁ । దరమె మనకు. 95

గీ. భక్తులకు మోక్షకారుని । భావనములు
మొక్కి వినువారికిన్ గర్ణ । భూషణములు
అక్షరంబులు, రామనా । మాక్షరములు
తత్త్వభావంబు భావింపఁ । దరమె మనకు. 96

ఉ. ఆయతమోక్షవృక్ష కుసు । మావచయంబును గోరు పూరుషుల్
"రా" యని యుచ్చరించినఁ బు । రాకృతపాపము లేగు, నావయిన్
"మా" యనినంత నే తలుపు । మూఁదిరి పెరడియు రాక యుండఁగా
జేయును, రామనామము భ । జించినవారికి లోప ముండునే! 97

చ. కొలువఁగ నేర్చు భక్తులకుఁ । గొంగుపసిండిగ నుండు, మోక్షమున్
జెలువను దెచ్చి యిచ్చు; విభ । జించి భజింపఁగరాదు, శైత్యమున్
సలిలమునుండి యేర్పఱుప । శక్యమె? జీవముతోడి బ్రహ్మమ
ట్లల రెండు రామనామ మధు । రాక్షరముల్ విభజింపవచ్చునే?

గీ. అద్వయంబైన రామాక్ష । రద్వయంబు
మోక్షనామక పీయూష । మునకు, మధుర
తృప్తిసమములై, భూమి భ । రింపఁ జాలు
కమఠ శేషతుల్యంబులై । ఘనతఁ గాంచె. 99

చ. అరయఁగ నామరూపముల । యందు రవంతయు భేదమున్నె? స
త్పురుషులు భేదభావమును । బొందరు, తద్గుణమున్ గ్రహించు సు
స్థిరమతిమంతు; లాఖ్యకు న । ధీనము రూపము; నామ మొందు సం
స్మరణముఁ జేసినంతనె, ని । జంబగు నాకృతిదోఁచు, గంటికిన్.

చ. సుకరమె నామరూపముల । చొప్పిదియంచు నెఱుంగఁజేయ? రెం
టికి సగుణంబు నిర్గుణము । నిక్కువమైన ప్రమాణ, మెవ్వఁడే
సకలము రామశబ్దమున । సమ్మిళితంబని యాత్మ నెంచు, నా
యకలుషితాత్ముఁడే చతురుఁ । డంచు వచింపఁగ నొప్పు నిబ్భువిన్

మ. వదనద్వారము రామనామమణిదీ । పన్యస్తమై క్రాలు నేన్,
హృది, బాహ్యంబున, నంధకారమణఁగన్ । రేకెత్తు వ్యామోహా
భ్యుదయంబొందదు రామనామవరమం । త్రోచ్చారణన్ యోగి మో
హద కామాంధమునుండి మేలుకొని బ్ర । హ్మానందముం బొందెడున్.

గీ. జ్ఞాని, యార్తుఁడ, ర్థార్థి, జి । జ్ఞాసు వెలమి
నామజప వైభవంబునన్ । వఱలుచుండ్రు;
సంకటముఁ బాపి శాశ్వత । సౌఖ్య మిచ్చు
రామనామంబు కైవల్య । ధామ మరయ. 103

గీ. ఇట్లుఁ జతుర్విధ పురుషార్థ । హేతుఁ డయ్యె
జనులకు, రామనామ సుధాకర । నంబుఁ గోరి
పాపభూయిష్ఠ సంసార । వార్ధినుండి
పారముఁ జేరు నందురు । భక్తవరులు. 104

గీ. సగుణ నిర్గుణములు కష్ట । సాధ్యము లగు
రామనామంబుచే నవి । ప్రాప్తము లగు;
బ్రహ్మమును నిర్గుణం బని । ప్రస్తుతింతు
సగుణ మని రామనామమున్ । సన్నుతింతు. 105

చ. ఇల నల రాఘవుండు జని । యించెను లోకహితంబు పొందెఁ, దా
నెలమిని సంకటంబుల స । హించె దగ్గ, ద్యజించె సుఖంబుఁ, బేదసా
దుల సుఖయింపఁ జేసెఁ, గల । దుష్టుల నెల్లఁ సంహరించె, నే
యు రఘుఁడు రామనామమహి । మాతిశయంబు నుతింపకుండునో

ఉ. రాముఁడు దుష్టదానవుల । ప్రాణములన్ గొను టేమివింత? త
న్నామము దోషదుఃఖముల । గాంచి దురాశను సంహరించు; శ్రీ
రాముఁడు శూలివిల్లును క । ఠోరంబుగ ద్రుంచిన ద్రుంచుగాక, త
న్నామము సాధుభక్తసుజ । నంబుల పాపముఁ ద్రుంచు [illegible]

ఉ. రాముఁడు దండకాటవిఁ గ । ఠంబుఁ బవిత్రముఁ జేయుఁగాక, త
న్నామ మనేక భక్తుల మ । నఃపరిశుద్ధికి హేతు వయ్యె; శ్రీ
రాముఁడు లోకకంటకుని । రావణునిం దునుమాడుఁగాక, త
న్నామము లోకమందుఁ గలి । నాశనమున్ బొనరించు నెంతయున్

ఉ. రాముఁడు తన్నుఁ గొల్చు కపి । రాజుకిఁ బ్రాపకుఁ డైన నేమి? త
న్నామ మనేక దీనులకు । నంబుగఁ బ్రోచెఁ జగన్నుతంబుగన్
రాముఁడు సేతుబంధనము । నన్ గపిసేనఁ దరింపఁ జేసెఁ, ద
న్నామము భక్తసంఘము భవ । నారకవార్ధికి సేతు విభ్రమన్. 109

చ. ఎవఁడు హృదంతరాళమున । నత్తతి రాముని నామమున్
దివిరి స్మరించు వానికి న । ధీనము జ్ఞానము; భక్తియుక్తులై
శివ మని రామనామము భ । జింపుఁడు తత్ఫలమున్ భుజింపుఁ డీ
భవముఁ ద్యజింపుఁ డున్నతశు । భప్రదముక్తి సృజింపుఁ డెల్లఱున్

గీ. నిర్గుణంబగు బ్రహ్మంబు । నేఁ దలంతు,
సగుణ మగు రామచంద్రుని । సన్నుతింతు,
రామనామ మీరెంటికి । ధామ మనుచుఁ
బ్రస్తుతించెద మది నేక । భావమునను. 111

చ. సనక సనందనాదిముని । చంద్రులు, యోగులు, రామనామమున్
మనమున సంస్మరించు శత । సన్ భువి ధన్యతఁ గాంచి, రీశ్వరుం
డనయము రామనామ మహి । మాతిశయంబు భజించి రుద్రుఁడ
య్యును శివుఁడయ్యె, లోకమున । యోగివరుండన నొప్పె నంతయున్.

మ. భగవన్నామము నెంచి సంతతము సం । భావింపగా నేరికే
నగుఁ బో మేలు; గజేంద్రుఁడున్ ధ్రువుఁడుఁ బ్రహ్లాదుండ జామిళుఁడున్
జగతిన్ ఖ్యాతికి నెక్కి మోక్షపదమున్ । సాధించి రట్లుండె; న
న్నగ వీక్షింపగ రాని వేశ్యయుఁ గనెన్ । వైకుంఠముత్కంఠయై

గీ. ధ్యాన సవన పూజాది వి । ధానములను
మూఁడు యుగముల భక్తులు । ముక్తిఁ గనిరి;
అఘ మలీమస భూయిష్ఠ । మైనకలిని
నామ ముచ్చరించినఁ జాలు । క్షేమ మొదవు. 114

గీ. జ్ఞాన భక్తి కర్మములకు । స్థలము లేని
కలిని, రామనామంబునం । గలుగు ముక్తి;
కపట భూయిష్ఠ కలికాల । కాలనేమి
యంతమొందు దుర్బుద్ధియాన । హనుమ వలన. 115

గీ. రామనామ మమోఘము । ప్రతిహతంబు;
నారసింహంబు శ్రీరామ । నామమహిమ,
మరయఁ గలికాలమే దాన । వాధిపుఁడు,
భక్తవరుఁడు ప్రహ్లాదుఁడో । ప్రాజ్ఞులార 116

క. పగనేన్, వగనేన్, గలనె
వ్వగనేన్, బొగ రెక్కు యలస । భావంబుననే
భగవన్నామముఁ దలఁచిన
ఖగవాహనుఁ డోమునంద్రు । కలిఁ దత్వజ్ఞుల్. 117

గీ. శిలల సలిలంబులం దేల్చి । జలధి దాఁటె,
గపుల సుమతుల మంత్రుల । గా నొనర్చె,
నహహ! శ్రీరాము మహిమంబు । నరయవలదె?
కుమతిఁ గలనన్ను నుత్తమో । త్తమునిఁ జేయు. 118

మ. తొలుతన్ గాకభుశుండి చెప్ప విని, ని । ర్దుష్టంబుగా దేవికిన్
దెలిపెన్ శంకరుఁ డీ చరిత్రము సుభ । క్తిజ్ఞాన తేజోమహో
జ్జ్వలుఁడై; పిమ్మట యాజ్ఞవల్క్యముని సం । భాషింపనాలించెఁ జి
త్కళ దీపింప మునీశ్వరుం డగు భర । ద్వాజుండు మోక్షార్థియై

గీ. రామచరితంబు దేవని । ర్ఝరిణి సమము
అమలచిత్తంబు చిత్రకూ । టాచలంబు
భక్తి యనునది యుద్యాన । వనసమాన
మందు జానకీ రఘురాము । లలరుచుంద్రు. 120

సీ. విజ్ఞాన వైరాగ్య । విజ్ఞాపనంబున
శ్రోతకు లోకము । శ్లోక గురువు,
సంసార నామక । సంకటంబు లణంగ
వెరవు వంబోధింకు । సేతువజ్జ

శ్రీరామ పాదరా । జీవ భక్తిరసంబుఁ
దనివి దీరఁగ నిచ్చు । నను గుదల్లి
జపతపోనిష్ఠాది । సద్ధాన ధర్మంబు
లనావృష్టి దంతతి । కాదబీజ
గీ. మైహికాముష్మికములకు । నమరతరువు
అఘ భయార్తికాంతారదా । వానలంబు
కామమోహంబువిధుల క । గస్త్యమాని
అతిపవిత్రంబు రామనా । మామృతంబు. 121

సీ. జనమనః కాంతార । సంచర త్కామాది
సామజంబులకుఁ బర । చాననంబు
సత్కవీశ్వర మనః । శరదంబరమునకు
మండనం బగుచంద్ర । మండలంబు
మానవ లోకన । న్మానస మానస
సరసికి సొబఁగైన । పతమహంస
భక్తి వైరాగ్యదం । పద్యుక్త భక్తుల
కామితార్థములకుఁ । గామధేను 122

గీ. వుగ్రదారిద్ర్య వహ్నికి । వ్రోదయుంబు,
ఘోర విషయాహి వితతికి । గారుడంబు,
భక్తకోటికి నతుల జీ । వన ధనంబు,
అతి పవిత్రంబు రామనా । మామృతంబు. 123

గీ. సజ్జనుల మోసపుచ్చు పా । షండ కపట
కుజన కుత్సిత గిరులకుఁ । గులిశధార,
అహహ! రామనామం బను । నమృతధార;
ఇట్టి దని చెప్ప శక్యంబె । యెరిగి నా? 124

గీ. లోక సుఖదాయకంబు, సు । శ్లోకమయము
సూరి సజ్జన కుముద చ । కోరములకు
హితకరం బగు సత్కథా । మృత యుతంబు
చంద్రబింబంబు శ్రీరామ । చంద్రుగాథ. 125

గీ. రాము నవతారముల నెన్న । రాదు మనకు,
సతనికథలకు నూహింప । హద్దు లేదు,
అతఁ డనంతుఁ డనంత గు । ణాన్వితుండు;
విమల చిత్తు లెఱుఁగరే । విబుధవరులు ? 126

మానస ప్రారంభము

గీ. వసుధ దైహిక దైవిక । భౌతి కాది
దుఃఖము లణఁగ దారిద్ర్య । దోష మణఁగ
మహిత రామాయణామ్నాయ । మానసమును
శంకరుండు సృజించె నీ । జగతికొఱకు. 127

గీ. విబుధవరుల సద్బుద్ధి పృ । థ్వీస్థలంబు,
అఖిల వేదపురాణంబు । లంబునిధులు
సరసహృదయులు సజ్జనుల్ । సలిలధరులు
భర్గు మానస వరసరో । వరమునకును. 128

గీ. మహిత రామాయణామ్నాయ । మానసాంబు
వతిపవిత్రంబు రాము స । ద్యశోఘనమయము
శిష్టు లగు భక్తవరులకు । జీవనంబు,
పుణ్యరూపంబు, జపతపం । బులకు హితము. 129

గీ. మహిత రామాయణామ్నాయ । మానసంబు
సప్తకాండ సోపాన వి । స్తారితంబు;

నిష్ఠఁగలవారు విజ్ఞాన । నేత్రములను
తెఱచి చూచినఁ గనుపట్టుఁ । దెల్లముగను. 130

సీ. సుందర వృత్తార । విందసందోహ ని
ష్యందభావమరంద । సంయుతంబు
విద్వజ్జనవ్రాత । వినుతభవ్యకవిత్వ
సౌరభప్రావృ । తాశాతటంబు
లలితమనోహరా । లంకారభూయిష్ఠ
భూరిశబ్దపరాగ । భూషితంబు
ధ్వనిరీతి గుణగణ । వ్యంగ్యశయ్యారస
మత్స్యసందోహ సం । శ్రయగృహంబు.

గీ. పరమపావనభక్త బం । భరకులంబు
ఆర్యసన్నుతపరమ హం । సాన్వితంబు
జ్ఞాన వైరాగ్య జప తపో । జలచరంబు
మహిత రామాయణామ్నాయ । మానసంబు. 131

గీ. మానసము సమీపంబున । మల్లడించు
రమ్య సజ్జనసంచయా । రామసీమ;
శ్రద్ధ యనునట్టి యతుల వ । సంత వేళఁ
బుణ్యజన సత్కవిశ్రేణి । పొదలు మొదలు. 132

గీ. భక్తిరస పూరిత జ్ఞాన । ఫలముతోడ
యమ నియమ ధారణాది పు । ష్పములతోడ
సత్య శౌచ క్షమా దయా । శాంతభక్తి
కుజ లతాంత సంతతియందుఁ । గొమరుమిగులు. 133

గీ. రామసత్కథా కథనసం । శ్రవణమునను
పులకితాంగంబె యూహింపఁ । బుష్పవనము

నేత్రఘటములతో భక్తి । నీరమూని
హృదయవనపాలకుం డందు । మొదలుచుండు. 134

సీ. సంసార సంపర్క । సంఘర్షణంబుచే
నిమ్నోన్నతపథంబు । నెగడు కతన
దుర్జన దుర్వాక్య । దుష్ట సింహ వ్యాఘ్ర
దందశూక శ్రేణి । తనరు కతన
నీమణత్రయనామ । పృథ్వీధరవ్యాప్తి
ననిశంబు దుర్గమం । బయిన కతన
మద మోహ లోభ కా । మ క్రోధ మాత్సర్య
భీకరాటవులచే । వెలయు కతన

గీ. శ్రద్ధ యనుశంబలము లేక, । శుద్ధమైన
ఘనుల స్నేహంబు లేక, రా । ఘవునికరుణ
లేక యేరుఁ జేరగలేరు । లోకవినుత
మహిత రామాయ ణామ్నాయ । మానసమును. 135

గీ. క్రూర పాషండ కాముక । కుటిల కుజన
కాక బక ఘూక శంబూక । భేకములకు
మహిత రామాయణామ్నాయ । మానసమున
స్నానముం జేయనగునె యే । నాటికైన? 136

గీ. మాయ యను మంచు మెండుగ । మలయుకతన
మించి మార్ఘ్యశైత్యంబు బా । ధించుకతన
హీనుఁడగు పూరుషుండేగఁ । డేగుఁగాక
స్నాన మొనరింపఁ జాలఁ డి । మ్మానసమున. 137

గీ. రామ పాదారవిందము । రందపాన
మత్త చిత్తులు భక్తు లి । మ్మానసమున

స్నానముం జేసినంతన । క్షణములోన
భయద తాపత్రయానల । జ్వాలలణఁగు. 138

చ. అలరులఁ దేనె యూటినటు । లాశుగతిన్ వరశబ్దధాటితో
నులియుచు మత్కవిత్వసర । యూనది రామచరిత్రమానసో
జ్జ్వలసలిలంబులం బొడమి । సర్వదిగంతము లంటి పాఱుచున్
గలిమలమున్ హరించుచు జ । గన్నుతకీర్తి గణించు నిద్భువిన్

మ. త్రివిధశ్రోత్రలు మత్కవిత్వసరయూ । తీరస్థసద్గ్రామముల్
అవగాహాగతసత్సమాజమె యయో । ధ్యాపట్టణంబౌరయన్
భువి నీ యావగ పాపభూరుహము ని । ర్మూలంబుగాఁ జేసి, స
త్కవులన్ లోఁగొని భక్తకోటికొసఁగున్ । గైవల్యకళ్యాణమున్

గీ. రామ రావణ ఘోరసం । గ్రామమునను
సద్యశశ్శోణ నద మొండు । సంభవించె
రామభక్తియన్ దేవ ని । ర్ఘరిణియందు
సరసులుప్పొంగ నీరెండు । సంగమించు. 141

సీ. శిష్టుల రక్షించు । శ్రీరాముని విలాస
గాథలు వరతరం । గములు గాగ
భరతాది సోదర । వరుల పద్భావముల్
సచ్చరిత్రము లంబు । జములు గాగ
వరపురోహిత హిత । పరివారమాదిగాఁ
గలజనున్ జలచరం । బులును గాగ
శ్రీరామసముపేత । సీతా స్వయంవర
శోభ నదీనై జ । శోభ గాగ
గీ. ప్రశ్నలు తరింపఁ జేయు నా । వలనుగాగ
సకలముం జెప్పు బుధులునా నా । వికులుగాగ

బరఁగు రాముని కాదర్శంబు । వఱదగాఁగ
వసుధ నీసరయూనది । ప్రణుతి కెక్కు. 142

గీ. సృష్టిఁ గల దుష్టసంసార । తృష్ణఁ దీర్చు
నిన్నదీతోయములఁ గ్రోల । కున్న జీవి
ఎండమావులఁ వీక్షించి । యేగి, మరలి
తృష్ణచేఁ దల్లడిల్లెడు । మృగముఁబోలు. 143

## మునిసంవాదము

### రామాయణప్రశంస

మ. ప్రణుతింపందగువాల్మికీయమును శ్రీ । రామాయణామ్నాయమున్
ఘనవిద్యాసముదాయమున్ సకలలో । కశ్రేయమున్ జాంబవ
ద్ధనుమద్జ్ఞేయముఁ గీర్తనీయమును పా । పాపాయమున్ ధ్యేయమున్
దినపారాయణగేయమున్ విబుధపా । నీయామృతప్రాయమున్

### ప్రయాగక్షేత్రము

ఉ. రాగవిహీన యోగిజన । రంజితయాగము, భక్తలోకసం
యోగము, దుర్జనవ్రజని । యోగము, తైర్థికబృందకల్మష
త్యాగము, మోహనిర్ఝరని । దాఘము, సన్మునివేష్టితాష్టది
గ్భాగము, పుణ్యసంచయవి । భాగము పొల్చుఁ బ్రయాగ మిబ్భువిన్

మ. నిరతిం బూని త్రివేణిఁ గ్రుంకులిడి, వే । ణీమాధవుం గొల్చి, త
చ్ఛరణాబ్జంబుల నంబుజంబులను పూ । జం జేసి, ధ్యానించి, దు
స్తర పాపక్షయ హేతు వైవవటవృ । క్షచ్ఛాయఁ గైవల్యత
త్పరులై భక్తులు విశ్రమింతురు ప్రయా । గక్షేత్రరాజంబునన్

గీ. ఇట్టి తీర్థరాజంబున । నెల్ల మునులు
మాధవుని దివ్యపాదప । ద్మములఁ గొల్చి

జ్ఞాన వైరాగ్య దములైన । శాస్త్రములను
చదివి బోధించుచుందురు । సజ్జనులకు 147

గీ. అచటఁ గల భరద్వాజుని । యాశ్రమమున
సాంఖ్య కర్మ వేదాంతాది । శాస్త్రములను
శారికా కీర సమితియుఁ । జదువుచుండు
నితర మునిపుంగవుల చొప్ప । నెఱుఁగ వలెనె! 148

మ. ఒకనాఁ డంతట యాజ్ఞవల్క్యముని వ । ర్యుండాత్మశిష్యాళికిన్
సకలామ్నాయ రహస్యమున్ దెలుపుచున్ । సర్వజ్ఞుఁడై వేణిలో
నకలంకంబుగ స్నానమాడి, శుచియై । యమ్మాధవుం గొల్చి, యా
త్మకుటీరంబున కేగుచుండఁగ భర । ద్వాజుండు సచ్ఛాత్రుఁడై

చ. ఎదురుగ నేగి, మ్రొక్కి తన । యింటికిఁ దోడ్కొని యాదరించి త
త్పదకమలంబులన్ గడిగి । "ధన్యుఁడనైతిఁ బవిత్రమయ్యె మ
త్సదనము యాజ్ఞవల్క్యముని । సత్తమ' 'యంచు వచించి యాసనం
బిడె గొనుఁ డంచు నిచ్చి, మును । లెల్లఱు మేలని సన్నుతింపఁగన్.

చ. "రాజతశైలవాసమున । రాజిలు యోగివరుండు భర్గుఁడ
వ్యాజ కృపాకటాక్షమున । నారయు వేలుపు భక్తకల్పధా
త్రీజము రామచంద్రుని స్మ । రించు నటంచుఁ దలంచి యా భర
ద్వాజుఁడు యాజ్ఞవల్క్యముని । వర్యున కిట్లను సంశయాత్ముఁడై

చ. ధరణి సమస్తధర్మముల । తత్త్వమెఱింగి యెఱుంగఁ జేయు స
ద్గురువుల పాదసేవ యెదఁ । గూరిన మాయఁ దొలంగఁ జేయు నీ
చరణ సమాశ్రయంబునను । సంశయదోషము నణంగు నో మునీ
శ్వర! యెఱిఁగింపవే సకల । శాస్త్ర పురాణ రహస్యవేదివై.

ఉ. శ్రీరఘురామునిన్ మది భ । జించి తదీయపదాబ్జభూసుధా
ధారలఁ గ్రోలి క్రోలి భువి । ధన్యతఁ గాంచిన యోగివాఁడు వీ

వారసి చెప్పలేని యొక । యంశము లేదనినమ్మి నెమ్మదిన్
జేరిన సంశయాంశమును । జెప్పెదఁ గూరిమి నాలకింపవే!

గీ. అచ్యుతుండు శివుండు క । ళ్యాణమూర్తి
జ్ఞానగుణరాశి వ్యామోహ । హీనుఁ డజుఁడు
అతఁడు నివశించు కాశియం । దంతరించు
జీవి శాశ్వత మోక్షంబుఁ । జెందునండ్రు. 154

ఉ. దివ్యగుణాభి రాముఁడని । ధీరతముండని రామచంద్రునిన్
శ్రావ్యముగా నుతించెదరు । సన్మనులెల్లను; "బ్రాహ్మణో నహం
తవ్య" యనంగనొప్పెసఁగు । ధర్మముఁ దప్పి సతీవియోగియై
అవ్యయ మైన క్రోధమున । నా దశకంధరు సంహరింపఁడే! 155

మ. పణఁతిన్ గోల్పడి కామ మోహ ముద లో । భ క్రోధ మాత్సర్యదు
ర్గుణియై రావణు సంహరించె నమరుల్ । గొండాడి రాసేఁతకున్
బ్రణుతింపందగు నొక్క రాముని చరి । త్రంబున్? సతీనాయకుం
డణిమాద్యష్టగుణాన్వితుండు, కరుణా । స్వాంతుండు చర్చింపగన్

గీ. అలికనేత్రుఁ డా రాముని । నభినుతింప
నేమి హేతువో యొక్కింత । యెఱుఁగ వలదె?
ఈ వెఱుంగని యంశమెం । దేనిఁ గలదె?
యాజ్ఞవల్క్యమునీశ్వర । యానతిమ్మ. 157

చ. అనవుడు మౌనమౌని దర । హాసము మోమునఁ జెంగలింపగన్
గనుఁగవ మోడ్చి జ్ఞానదయ । నంబున రామునిఁ జూచియీశ్వరున్
మనమున సంస్మరించి సుర । మానవ దానవ సమ్మతంబుగా
ననఘుఁడు యాజ్ఞవల్క్యముని । యామునిసోమునిఁ జూచి యిట్లనున్

గీ. సాధు వత్స భరద్వాజ । శంకితాత్మ
ఈవె ఱుంగవె రాముని? । సేవచింప

వలెనౌ పామర కోటికిఁ । జెలియఁగోరి
ఆజ్ఞఁబలె నన్నుఁ బ్రశ్నించె । దైన వినుము. 159

గీ. కర్మ యుగమున రాముని । కథఁ దలంపఁ
గామ మోహాసురులఁ జంపు । కాళిచూవె;
తత్కథాసుధారసధారఁ । దనివిదీఱ
నాస్వదింపుము సందేహ । మంతరించు. 160

గీ. సరస రామాయణామృతా । స్వాదనమున
సజ్జ నామర సంతతి । సంతసించు
సతికిఁ బూర్వము కప్పుడీ । శంకదోఁచె
దానిఁ దొలఁగించెఁ జూవె యం । ధకవిరోధి. 161

గీ. అనఘ దాక్షాయణీదేవి । యనుసరింపఁ
గాలకంఠుఁడ గస్త్యుని । కడకు నేగె;
నమ్ముని యొసంగు రామాయ । ణామృతంబుఁ
గ్రోలి రాము ధ్యానించుచు । శూలి వెడలె. 162

చ. వినుము మునీంద్ర! పూర్వ మొక వేళ । మహేశుఁడు రామచంద్రుద
ర్శనమును గోరి, రావణునిఁ । జంపఁగ విష్ణువు మానవాకృతిన్
ఇనకుల మందుఁ బుట్టునని । యెంచి, విరించను పల్కు కల్లగా
దని తఱి వేచియుండ జల । జాక్షుఁడు పుట్టె ధరావనార్థమై. 163

చ. మునివరుఁడైన గాధిసుతుఁ । బ్రోచి, యహల్యకుఁ బ్రాణమిచ్చి యా
జనకజఁ బెండ్లియాడి బుధ । సంఘము మేలని సన్నుతింపఁగన్
జనకుని వాక్య మెంచి యను । జన్మునకుం గలరాజ్యమిచ్చి తా
వనమున కేగె రాఘవుఁడు । భార్యయుఁ దమ్ముఁడుఁ గొల్చియుండఁగన్

గీ. నీచు మారీచుఁ బంపి సం । కోచముడిగి
కపట వేషంబునన్ బంక్తి । కంధరుండు

అకట! సీత జగన్మాత । నపహరించి
లెంక వలె లంక కేగె ని । శ్శంకతోడ. 165

గీ. ఘనుఁడు రాముండు మాయామృ । గంబుఁ గూల్చి
సానుజుండయి యేతెంచి । యతివ లేని
పర్ణశాల విలోకించి । వనరి వనరి
నరుని చందాన విరహ సం । తాప మొందె. 166

గీ. రాఘవుని తత్త్వము గ్రహింప । రాదు చూడ
మునులకైనను బ్రహ్మాది । ఘనులకైనఁ
గామి యాలించె నేనిఁ బ్ర । కామి యగును
భక్తుఁ డాలించె నేనిఁ గై । వల్యమొందు. 167

ఉ. భార్యను దొంగిలించి చను । వాని నెఱుంగని యట్లు కానలో
ధైర్యమున్ ద్యజించి తన । తమ్మునితోఁ దిరుగాడు రాము గాం
భీర్యముఁ జూచి, మెచ్చి, తఱి । మించిన చిత్తతిఁ జేరఁ బోలదం
చార్యవరుండు శూలి ముద । మందుచుఁ బోయె సతీసమేతుఁడై.

ఉ. పాయనిభక్తి రామనర । పాలుని నాత్మ భజించు సన్మని
ధ్యేయుని శూలిఁ జూచి ‘‘జగ । దీశుఁ డనంతుఁ డితండు పావనా
మ్నాయ పథప్రవర్తి, యొక । మానవుఁ గొల్వఁగ నేటికంచు దా
క్షాయణి యేవగించి తన । స్వాంతము నందుఁ దలంచె నివ్విధిన్

గీ. ‘‘అజ మనంత పరబ్రహ్మ । మచ్యుతంబు
కాలమునఁ బట్టి చేష్టలఁ । గాంచునొక్కొ?
మాయచే నావృతంబయి । మనుజ రూప
ధారణంబున మెఱఁగునే । ధరణియందు? 170

ఉ. ధీరుఁడు విష్ణుమూర్తి హరి । దేవహితార్థము కోరి మానవా
కారముఁ దాల్చెఁగాక శితి । కంఠున కుద్ధయనంగ నొప్పు ల

శ్రీరమణుండు మూఢుఁడయి । స్త్రీవలె నేడ్చుచు దిక్కులేక యీ
తీరునఁ గాంతకై యడవిఁ । దిప్పలఁ దుప్పల సంచరించునే.

గీ. భర్గుఁ డజ్ఞాని యగునె? స । ర్వజ్ఞుఁ డండ్రి
అతని వాక్యమసత్యంబె । వ్యర్థ మగునె!
రాముఁ డూహింప నిందిరా । రమణుఁ డగునె?
జ్ఞాన మభివృద్ధిఁ బొందునే । సంశయమున 171

గీ. అనుచుఁ దలపోయు, నాథునిఁ । గని హసించు
నడుగ నుంకించు శంకించు । నాకళించు
నామె చిత్తంబు గ్రహియించి । యలికనేత్రుఁ
డిట్టు లనియె నుత్సాహంబు । నెట్టుకొనఁగ. 172

చ. వనితలు సంశయాత్ములు ధ్రు । వంబు గ్రహింపఁగ లేనిముగ్ధలే
ఘనుని కథా సుధాంబుధిన । గస్త్యుఁడు గ్రోలె మునుల్ నుతింప నే
యనఘుని నామమున్ దలఁచి । సంతన ముక్తి లభించు; నట్టి రా
ముని సుగుణాభిరామునిఁ బ్ర । బుద్ధుని నెంచితె కర్మబద్ధుఁగా?

ఉ. వ్యాస పరాశ రాది ముని । వర్యులు యోగులు సిద్ధులైన స
న్న్యాసులు నేమహాత్ముని స । హర్నిశమున్ భజియింతు రెవ్వనిన్
వేసర కెల్ల శాస్త్రములు । వేదములున్ వినుతించు వాని మా
యా నముదంచితాత్మునిగ । నాత్మఁ దలంచితివే తలోదరీ.

శా. మాయాతీతము, నిష్కళంకమును రా । మబ్రహ్మమున్ సన్ముని
ధ్యేయంబున్ భజియింపు మాత్మఁగలనం । దేహంబు నిశ్శేషమున్
జేయం గోరెద వేని నెమ్మయిఁ బరీ । క్షింపందగున్; సృష్టికిన్
శ్రేయంబుల్ ఘటియింప నచ్యుతుఁడు ధా । త్రింబుట్టెనిం తేటికిన్

మ. భగవన్మాయ నెఱుంగఁ జాల వకటా । బ్రహ్మాదులుం జాల, రా
జగతీనాథుని రామచంద్రుఁ గనినన్ । సర్వంబు వ్యక్తంబగున్;

శ్రీగురుం బోశీ! తొలంగు మచ్చటికి, నీ । వేతెంచు నందాక నా
సగుణున్ గొల్చుచు నీసమీప వటవృ । క్షచ్ఛాయఁ గూర్చుండెదన్

చ. అనవుడు లెస్స యంచు దర । హాసము మోమున నంకురింప న
వ్వనిత "మహేశ! రాముని స్వ । భావము నేఁ బరికించుదాన నె
మ్మనమున సంశయంబణఁగు । మార్గముఁ జూపితి" వంచుతత్క్షణం
బునఁ జనియెన్ రఘూద్వహుఁడు । పొక్కుచు సంచరియించు కానకున్

ఉ. దండక కాననాంతమునఁ । దమ్మునితో విహరించు దివ్యకో
దండుని రామచంద్రుఁ గని । తన్మహిమన్ బరికింప నెంచి య
య్యండజయాన యజ్జనక । జాకృతిఁ దాల్చి సమీపమార్గమం
దుండఁగఁ జూచి రాముని స । హోదరుఁ డెంతయు సంభ్రమించుచున్

ఉ. "ఈవనిఁ గాంతుఁ బాసి । చరియించునె జానకి! యెంతవింతయం
చావనితాకృతిం గని మ । హాత్ముని రామునిఁ జూచి యెంతయున్
భావనఁ జేసి యాతని ప్ర । భావ మెఱింగిన లక్ష్మణుండు లోఁ
జేవఁ దొలంగక య్యువిద । చెయ్వులఁ జూచుచునుండె నత్తఱిన్

మ. అహహా! సృష్టి సమస్తజీవములలో । వ్యాపించి శ్రీవిష్ణువై,
మహి జన్మించిన రామచంద్రుఁడకటా । మర్త్యుండె? యజ్ఞుండె? త
న్మహిమంబున్ బరికింప దేవతలకున్ । శక్యంబె? సర్వజ్ఞుఁ డ
క్కుహనాసీతను జూచి డీల్పడునె? సం । కోచంబునన్ దుర్భ్రమన్.

ఉ. మోస మెఱింగి రాఘవుఁడు । మోమున లేనగ వంకురింపఁ గా
నాసతిఁ జూచి "యొంటిమెయి । నక్కట వచ్చితివో వృషధ్వజుం
బాసి! రఘూద్వహుండ నిదె । వందనముం గొను" మన్న దీర్ఘని
శ్వాసముఁ బుచ్చి యాతని ప్ర । భావము మెచ్చుచు లోన నొచ్చుచున్

ఉ. కోమలి యారఘూద్వహుని । కోమలవాక్కుల నాలకించి నె
మ్మోము వెలంబాంచి దైన్యమునఁ । బొక్కి వివేకముఁ దక్కి, భీతిచే

స్థేమము లేక సంకుచిత । చిత్తమునం గడు స్రుక్కి వెక్కి, యో
ర్మిమనుదాన; శంకరున । కేమని చెప్పెడిదాన నింతకున్''. 183

మ. అని చింతించుచు శంకరుం దెగడి మా । యాతీతు శ్రీరామునిన్
గని వంచింపఁ దలంచి బేల నయితిన్ । జ్ఞానంబు న్యూనంబుగా;
ననపాయంబుగనుండ కిట్లయితి నా । హా ''యంచు దుఃఖించుచున్
జనుచుండెన్ గలహంసయానమునఁ బ । శ్చాత్తాప సంతప్తయై.

గీ. సతిమతి గ్రహించి రామభూ । పతియు నంతఁ
దనప్రతాపంబు దీపింపఁ । దరుణితోడ
సోదరునితోడఁ గనుపట్టెఁ । జోద్యముగను;
దృష్టి నిగిడించి యాసతి । తెలివిఁ దప్పి; 185

గీ. అంతకంతకు మునులతో । హరునితోడ
వనజభవుతోడ దిక్పాల । వరులతోడఁ
బృథ్వితోడఁ జరాచర । వితతితోడ
నలరు శ్రీరాము వీక్షించె । నఘవిరాము. 186

క. గడగడ వడఁకుచుఁ గాళ్ళుం
దడఁబడఁ బుడమిం బడంతి । దబ్బున పడియెన్
వడివడిఁ గనుఁగవ మోడ్చెన్
బుడబుడ నుప్పొంగు వనటఁ । బొక్కుచు నేడ్చెన్. 187

గీ. కడకు లజ్జించి మది వివే । కంబుఁ గాంచి,
ఆత్మ దుఃఖించి మఱియు స్థై । ర్యము వహించి,
మగని ధ్యానించి యెలమి న । మస్కరించి,
రాఘవుని దివ్యమహిమంబుఁ । బ్రస్తుతించి. 188

శా. రామా! కీర్త్యభిరామ!యర్కకులపా । రావారసోమా! బలో
ద్దామా! సంగరభీమ! భూధవసుధా । ధామా! నవాంభోధర

శ్యామా! నిర్జితరామ! దివ్యగుణపు । ష్పారామ! దైత్యాద్రిసు
త్రామా! దుఃఖవిరామ! భక్తినతభ । క్తస్తోమ! రక్షింపుమా!

గీ. అనుచు దాక్షాయణీదేవి । కనుల విచ్చి
దిక్కులం జూచి సంతస । యక్కజముగఁ
గాంచినది కానరాకుండెఁ । గానలోన
మాఱినువడి డీలుపడి యేగె । మగనికడకు. 190

మ. తరుణీరాజమరాళమందగమనన్ । దాక్షాయణిం జూచి యా
హరుఁ డజ్ఞానతమోహరుండు "వనితా । యా రాము విజ్ఞానమున్
బరికింపం జని యేమిచూచితి" వనన్ । "స్వామీ పరీక్షింపఁగాఁ
దరమా" యంచు వచించి యిట్లనియె ను । ద్యద్ధైర్యగాంభీర్య యై

గీ. "చెప్పుటకు నేమియున్నది । చిత్తగింపు
మనఘ! నిను నమ్మి రామచం । ద్రునకు మ్రొక్కి,
సన్నుతించితి" ననవుడు । జ్ఞానదృష్టి
జరిగిన యుదంత మంతయు । సంగ్రహించి. 192

గీ. వనిత యొనరించి నట్టి వం । చన నెఱింగి,
హరుఁడు పరితాపముం బొంది! । యాగ్రహించి,
"మోహావశమున నూఁకొన్న । మోస" మనుచు
వెలఁది నీక్షింప నోపక । విముఖుఁ డగుచు. 193

ఉ. "ప్రేమకు మేర యున్నదె! వరిం । చిన యట్టిలతాంగిఁ బాసినన్
క్షేమమె" యంచుఁ గ్రేళ్ళుఱుకు । కింకకు నల్లము తల్లడిల్ల శ్రీ
రాముని సంస్మరించి "యప । రాధ మొనర్చిన కాంత నక్కటా
కాముకుఁ డేలుఁగాక" యని । గాసిలి కన్నులు జేవుఱింపఁగన్.

గీ. "ఈశరీరంబుతో నింక । నీలతాంగి
నెనయ నిది నిశ్చయం బం"చు । నేవగించి

శంకరుం డేగుచుండంగ । "జయము జయము
భక్తవర" యంచు నాకాశ । వాణి పలికె. 195

గీ. చదలుపలుకుల నాలించి । సంభ్రమించి,
ఉమ్మలించుచు నించుక । సొమ్మసిల్లి
సొక్కి, తాలిమిఁ దక్కి, యు । ప్పొంగి పొరలు
దుఃఖమును మ్రింగి, క్రుంగియు । త్రోయుజాక్షి. 196

ఉ. "హా"యని "నన్నుఁబాయఁదగు । నా"యనినిన్విడనాడఁజాలనా
థా"యని "భక్తలోకవర । దా"యని "తప్పిదముక్షమింపరా
దా"యని"శాంతముండవల । దా"యని "మోహమెుకించుకంతలే
దా"యని"యింతవింతగల । దా"యనివెక్కుచుసొక్కిసోలుచున్.

ఉ. "సార విచార ధీర గుణ । శాలి, ప్రసిద్ధ విశుద్ధ భావకం
భీరుఁ డెటింగె నాదు నవి । వేకము సర్వము; ఘోరదుష్కృతం
బేరికి నైన నోర్వఁ దగు । నే? విభుఁ డక్కట నన్నుఁ బాయునే?
నారులు మోసముం గవట । నైజముఁ బాయని వార లక్కటా!

గీ. చెలిమి దీపించు దుగ్ధాంబు । వులను బోలి
కపట తక్ర సంపర్కంబు । గలిగె. నేని
భిన్న మగుఁగాదె? యక్కటా । వెరవు గలదె
మగుడఁ జెలికారముం గూర్చ । మానసములఁ?" 199

మ. అవిచింతించుచువెక్కిరేఁటుకొనుచున్ । "హాయంచు,రక్షింపుమా
అనఘా" యంచుఁ దలంచు నాత్మసతి దీ । నాలాపమాలించియున్
గనఁ డొక్కించుక త్రాళ్ళఁబూనఁ దకటా । కైలాస నామాద్రికిన్
జని శంభుం డనయాయునిం గవి మతి । స్థైర్యంబు దీపింపగన్

గీ. మగిడి మానినిమై తొలుతటి । మర్త్రి భీడ
సుస్థిరుండయి పద్మాస । నస్థుఁ డగుచు

నెలమిఁ బవనంబు బంధించి । చలన ముడిగి
ధీరుఁడై యోగపద్ధతిఁ । గూరుచుండె. 201

చ. హరుఁడు దొసంగు సైపఁ డిసు । మంతయు నింతకు వాని నమ్మినం
బెరియఁగ నే వగింపు జని । యింపఁగఁ జేసితి నన్నుఁ గాంచియు
గ్గిరి విడనాడెఁగా; యతని । క్రేవకు నేగిన లాభముండునే!
విరహిణిఁ బోలి నే ననుభ । వించెదఁ గాక కృతాపరాధమున్.

మ. అవమానించితి నిన్నుఁ గల్మషవిరా । మా! రామ! నిష్కామ! ఘో
రవియోగంబు సహింప నోపుదునె భ । ర్తం బాసి! సీతావియో
గ విచారంబున నున్న నిన్ను వికలుం । గావింప భావింప, న
య్యవివేకంబున కక్కటా ఫలముప్రా । ప్యంబయ్యె సాదృశ్యమై.

మ. వనజాక్షా! రఘురామ! యీశ్వరు మనో । వాక్కాయ కర్మంబులన్
గని సేవించెడుదాననేని వినుమీ । కాయంబు హేయంబు, నా
శనముం బొందును గాక యశ్రమముగన్; । సైరింపగానౌనె! యి
వ్వనటం దూలితి బైసిమాలితిని దే । వా! దేవచూడామణీ!

ఉ. కాయ మపాయముం బొరయుఁ । గాక; యనాథ యనంగ నాథునిం
బాయఁగ నౌనె యీకనవు । భారము నాకు భరింపశక్యమే!
హేయము గాదె! మత్కపట । వృత్తికి శిక్ష ఘటించితీవు; నీ
మాయ లహో! యెఱుంగఁ దర । మా సుర మానవ దానవాళికిన్.

చ. ఇటులు వియోగ సాగరము । నీఁదుచు రాముని సంస్మరించుచున్
“కటకట జాలి దూలి నిజ । కాంతుని కింకరుఁ జిక్కి కంటిఁ బో
అటమటకున్ ఫలంబ”నుచు । నాత్మఁ గడుంగడు నమ్మలించుచున్
కుటిల శిరోజ యవ్వవిత । కొండెన యుండె ననేక వర్షముల్.

గీ. ఒగ్గిఁ జెక్కెండ్లు వెచ్చించి । యోప లేక
ఒక్కనాడు మగండుండు । చక్కి కేగి

మేలుకొను దాకఁ దఱివేచి । మెలఁత నిలువ
నాసన మొసంగి కూర్చుండ । నానతిచ్చె. 207

గీ. హరుఁడు శ్రీరాము గుణధాము । నభినుతించి
మగువ నీక్షించి, "రాముని । మాయ తెలియఁగ
నగునె? నీబోటి కాలింపు" । మనుచుఁ జెప్పెఁ
బెక్కుకతలను భక్తిపెం । పెక్కునట్లు. 208

గీ. ఆగ్రహముఁ బాసి యెంతయు । నాదరించి,
అలికనేత్రుండు సర్వజ్ఞుఁ । డాహరుండు
శ్రీరఘూద్వహు మహిమంబుఁ । జెప్పుచుండ
నువిద వినుచుండె; నంతట । నొక్కనాఁడు. 209

ఉ. సారససంభవుండు ముని । సంఘముతో సభఁ దీర్చి సార వి
స్తార తపోధనాఢ్యుఁ బ్ర । జాపతులన్ గుణరత్నసంచయం
బేరిచి యాధిపత్యము వ । హింపఁగ దక్షుఁడు దక్షుఁడంచు లో
నారసి పెద్దఁ జేసె సుర । లందఱు నౌనని సమ్మతింపఁగన్. 210

గీ. దక్షుఁడాలించె నెంతయు । ధన్యతముఁడ
నంచుఁ జింతించె గర్వించె । నతిశయించెఁ
జిత్త మిగురొత్తెఁ గన్నులు । నెత్తికెక్కె
నౌర! యధికార మొకరోగ । మనినఁ గదె? 211

గీ. కల ప్రజాపతిసమితికి । ఘనుఁడననుచుఁ
జెలఁగి దక్షప్రజాపతి । సిద్ధసాధ్య
గరుడ గంధర్వ యక్ష రా । క్షసుల నమర
కిన్నరులఁ బిల్చి గావించె । జన్నమొండు. 212

గీ. అతిశయించిన దక్షుని । యజ్ఞమునకు
విష్ణువు హసించె, శంభుండు । వెడలకుండె;

నఖిల జనకోటి యుచ్చోటి । కరిగి రమరు
తెలిమి యజ్ఞ హవిర్భాగ । ములనుగొసిరి. 213

చ. జనకుని యాగవార్త విని, । సన్మునిసంఘము వోవుచుండఁగన్
మనమునఁ బొంగి, సుందరవి । మాన వితానము నంబరంబునన్
గని సురకామినీ మధుర । గానముల్ విని సంతసించి ద
క్షునిసుతయమ్మహోత్సవము । సొంపుఁగనుంగొననిచ్చగించుచున్

గీ. "దక్ష కల్పిత యజ్ఞ సం । దర్శనార్థ
మాత్మ క్రేళ్ళు దాటుచు నున్న । దతిశయించి,
అలికనేత్రుని విడనాడి । యరుగ గాదు
మనము నరికట్టి యిచ్చోట । మసలరాదు." 215

గీ. అనుచుఁ జింతించి జనకుని । గవఁదలంచి,
నిలుకడం దక్కి పతి క్రేప । నిలిచి మ్రొక్కి
"ఓకృపానిధి! దక్షాధ్వ । రోత్సవమున
కరిగి వచ్చెద నీవాన । తిచ్చెదేని. 216

గీ. తల్లిదండ్రుల నఖిల బాం । ధవుల సఖులఁ
దోడఁబుట్టుల నెల్లఁ జూ । డవలదె!
సన్మునీంద్రుల దర్శింప । సమయమిదియ
ఆనతిమ్మ కృపానిధి" । యనినహరుఁడు. 217

శా. ఆ నారీమణి సంభ్రమంబును బ్రియా । నాపేక్ష వీక్షించి, త
ద్దీనాలాపము లాలకించి "హృదయో । త్సేకంబు వారింపఁగా
నానే!యంచుఁ దలంచిరాఁగలదొసం । గాత్మన్ విచారించుచున్
లేనవ్వాననసీమఁ దోప ననియెన్ । గ్రహార్థవాగ్ధోరణిన్. 218

ఉ. "ఓలలనామతల్లి! విన । వో యొకనాడు విరించనందను పే
రోలగముండెఁ గిన్నరులుం । యోగులు,సిద్ధులుసాధ్యులున్ మునుల్

వేలుపులున్ దనుంగొలువ; విష్ణువు నేనును బోయియుంటిమ
వ్వేళఁ బానంగఁ జూచె యొక వింత;భవజ్జనకుండు దక్షుఁడున్

గీ. ఇంచుక విలంబముగ వచ్చి నెల్ల మునులు
వేలుపులు లేచి మ్రొక్కిరి; విష్ణు వేను
మిన్నకుంటిమి నవ్వుచు; నన్నుఁ జూచి
మొగముఁ జిట్లించుకొనెఁ జూచె మ్రొక్కకునికి. 220

గీ. అంతతోఁ బోవునే వాని యాగ్రహంబు?
అల్లుఁడవె యంచు రోషించి యాడు కఱచి
పటపటధ్వనిఁ జేయుచుఁ బండ్లు కొఱకి
చిఱ్ఱు తుదిఁ దాకె ననఁగఁ గ న్నెఱ్ఱఁ జేసి. 221

గీ. యాగముల హవిర్భాగము లనుభవింప
కుండ శపియించె నెల్లఱు నుస్సురనఁగ;
నంతతోఁ బోక తఱుణ మి య్యదియ యంచు
జన్నమొండు కల్పించె నేఁ జిన్నఁబోవ. 222

గీ. ఘనుల నెల్లఱ రావించి గౌరవించి
మనల నొప్పరికించునే మగువ చెపుమ?
నిన్ను నవమానితఁ జేయ నిశ్చయించు
చెనఁటి పజ్జకు నేగుదే? సిగ్గులేక. 223

క. పిలువని పేరంట్రిం బని
కలకల నినుఁ జేరటాండ్రు గని హాసింపన్,
జెలుల్ జుట్టములం గన
వెలఁదీ మర్యాద యేద వెడలం దగునే? 224

ఉ. ఏ నెఱవాది యైనను, మృగేక్షణ! యుత్సవదర్శనార్థమా
హ్వానము లేక యేగిన ధ్రువంబుగఁ బొందు నగౌరవంబు; స్వ

స్థానముఁ బాసిపిల్వనిదె । తల్లినిఁ దండ్రినిఁ దోడఁబుట్టులన్
చానలుచూడఁబోఁదగదు; । చాన! యెఱుంగవె యీరహస్యమున్

గీ. ఇయ్యదిట్లుండె; నేచాయ । కేగినంతఁ
బోరు ప్రాప్తించు నను శంక । బుద్ధిఁ దోచు
నచటి కేగిన నెవ్వాని । కైనఁ గాని
హాని చేకూరు నని యందు । రార్యవరులు. 226

ఉ. నావుడు విన్నఁబోయి లల । నామణి కన్నుల నీరమూఱి, "నే
బోవక నిల్వనోపుదునె! । పుట్టిన యిండ్లకుఁ గాంత లేగరో?
ఏవిధి గౌరవంబు నశి । యించు? నశించిన హానియేమి? సం
భావన కేను లాఁతినె! స్వ । భావవిరుద్ధము లీవిచారముల్. 227

మ. అకటా, తండ్రికి బిడ్డ వ్రేఁగగునె! నా । థా! ముద్దుఁ జెల్లింపుమీ
వికటాలాపము లేటికన్న విని ని । ర్వేదంబునన్ రోసి "మా
మకవాక్కుల్ వికటంబులే" యనుచు నం । భావించి సర్వజ్ఞు "డిం
తకు రానున్నది రాకమాన" దని కాం । తం బుచ్చెఁ బుట్టింటికిన్

మ. చని వీక్షించె సతీమతల్లి జ్వలన । జ్వాలా ప్రజా వేగమున్,
జనకోత్పాదిత హోమ ధూమ లతికా । సంఛన్న భూభాగమున్
మనుజాశ్వాస్య సురాసుర ప్రముఖ నా । నా సేవకాభోగమున్
వనజాతోద్భవ మంత్రితంత్రి హత స । ర్వచ్ఛాగమున్ యాగమున్

మ. తనయన్, సద్గుణరత్నభారవినయన్ । దక్షుండు లక్షింపఁడా
నన మొక్కించుక యెత్తి "వచ్చితివె నీ । నాథుండు రాఁడాయెఁగా
అని మర్యాదకు నైనఁ బల్కఁడకటా । యక్కాంత కన్నీరుక
న్గొనఁ గ్రుక్కుచుఁ జిన్నఁబోయి నిలిచెన్ । గోపంబు దీపింపఁగన్

క. గుస గుసలు వోవు వారిని
విన వినఁ దనుఁ జూచి నవ్వ । వెడలెడు వారిన్

విసువుచు మసలెడు వారిఁ
“గని దీనత తండ్రి” కంచుఁ । గామినిచూచెన్ 231

గీ. పలుకరింపని దక్షుని । వరుసఁ జూచి
ఈశ్వరుని యజ్ఞభాగ మం । దాదు లేమి
హృదయ మెరియఁగఁ గోపించి, । యనుమడించి
పొంగి పొరలెను దుఃఖంబు । మ్రింగి మ్రింగి. 232

గీ. “వెఱ్ఱిబాగులదాన యీ । వేదు రేటి”
కనుచుఁ దల్లి తోఁబుట్టువు । లనునయింప
నిందుకయు బుద్ధిఁ జొరనీక । యేవగించి,
అరుణ దృక్కులు దిక్కుల । నావరింప. 233

ఉ. జ్ఞానముఁ దక్కి యీశ్వరుఁడొ । నర్చిన బోధ నిరాకరించి యా
హ్వానము లేని స్థానమున । కక్కట వచ్చితి సిగ్గులేక స
న్మానములేక, న్యూనతకు । మానస మోర్చునె” యంచు నేడ్చిన
మ్మానిని; హీనమైన యవ । మానము మించిన హానియున్నదే!

ఉ. హీనులు మానులంచు వది । యించి నిరీశ్వరులంచుఁ దిట్టియా
చానల నెల్లఁ గసరి, । సారస సంభవు నీరసించి, యి
ట్లానతి యిచ్చె దేవి, “త్రిపు । రారిని శౌరిని ధిక్కరించినన్
హాని ఘటిల్లకుండునె? య । హంకృతి చెల్లునె? యెట్టి వానికిన్

గీ. వినుఁడు మునులార ఘనులార । వేల్పులార
లోకవందితు విశ్వేశుఁ । గాకు సేసి
అక్కటక్కట నాతండ్రి । యతిశయించె
నిద్దురాత్ముని కూతునై । మెట్లు మనెద. 236

మ. అనుచున్ గ్రోధమురూపుఁదాల్చినటులా । యజ్ఞార్తి యత్యుగ్రయై
తన కందోయి యకాల నగజనిత సం । ధ్యాకాలముంబోల, నా

వనమాఖిల లయార్క బింబ మనఁగన్ । రాజిల్ల, నొక్కుమ్మడిన్
దనువుం బాయఁదలంచె; సేవమును కాం । తల్ సైపరొక్కింతయున్

గీ. “తండ్రి వెల్లాదు వారార । దక్ష” యనుచు
దశదిశలఁ గాంచి తనదు దు । ర్దశఁ దలంచి,
అవయవంబుల భేదించి । యాలతాంగి
యోగ మార్గానుపద్ధతి । నుసుఱు విడిచె. 238

గీ. తనదు నిల్లాలు మరణించె । ననెడు వార్త
విన్న యంతనె రుద్రుండు । వీరభద్రుఁ
గాంచి దక్షాధ్వరధ్వంస । కార్యమునకు
నరుగు మని యానతిచ్చిన । యంతనతఁడు. 239

ఉ. దక్షుని, యాగ కర్మ చయ । దక్షుని, వందిత సర్వదేవతా
ధ్యక్షునిఁ, గల్పితోరుసవ । నాగ్ని సముద్గత ధూమ శోణితో
గ్రాక్షుని, యక్ష కిన్నర సు । రాసుర గర్హితవాక్య దూషిత
త్ర్యక్షునిఁ, ధిక్కృతాంబుజ ద । ళాక్షునిఁ, బీన విశాల వక్షునిన్.

మ. కని కల్పాంతమహాగ్నిహోత్రుఁడన నా । గ్రిజ్వాలలం గ్రక్కుచున్
గనులన్ నిప్పుక లుప్పతిల్ల బుధులం । గారించి యయ్యధ్వరం
బును విధ్వంసముఁ జేయుచుండఁ గని యం । భోజాననుండున్ ఋషుల్
మునులున్ బాఱిరి దక్షుఁడున్ బరువిడెన్ । బుద్ధిన్ విచారించుచున్

గీ. అధ్వరంబును సర్వశూ । న్యముగఁ జేసి
వీరభద్రుండు శూలికి । విన్నవించె;
సతివ మరణించినంతఁ ద । దంతరాత్మ
అఖిల గిరికాంతు హిమవంతు । నాశ్రయించె. 242

మ. జనియించెన్ గిరిసార్వభౌమునకు యోషారత్న మొక్కర్తు తా
ర్పునఁ జంద్రోదయమైన చొప్పున సుధాం । భోరాశికిన్ లక్ష్మిరీ

తిని శుక్తిన్వరమౌక్తికంబుకరణిన్, । దేశంబు వ్యాపింప, శ్రీ
లను వర్ణింపఁగ సర్వలోకములకున్ । లావణ్యమేపారఁగన్. 243

మ. నగరాజున్ ఫణధార్యమాణవిలస । న్మాణిక్య దీపాగ్ర వ
న్నగరాజున్ మృగశోణితారుణితనా । నాకందరాసంచర
న్మృగరాజున్ గరుడాహతాఖిలకుజో । న్నిద్రాహిసంఘోత్పతత్
ఖగరాజున్ వినుతింపరే సురలు లో । కఖ్యాతి వర్ధిల్లఁగన్. 244

సీ. కుంభవృష్టిగ వాన । కురిసిన పిమ్మట
జలజలఁ బుష్పవ । ర్షంబుఁగురిసె
నజ్ఞాన మనునది । తుణఁగినట్టుల నింగిఁ
బ్రిబ్బిన మబ్బుల । యుబ్బణంగె
మునుల సుజ్ఞానాస్య । ములఁబోలి యఖిలది
క్తటములు విమల శా । ంతమునఁ గ్రాలెఁ
దమ్మికొత్తమ్మిల । కమ్మతావిం బూని
కమ్మని తెమ్మెరల్ । కడల వీచె

గీ. నఖిల దివ్యాంగనామణు । లాడిపాడ
నంబరస్థలి దివ్యవా । ద్యములు మ్రోఁగ
మ్రోడులై యున్న మ్రాఁకులు । మొగ్గ తొడిగె
నాసతీదేవి పార్వతి । యై జనింప. 245

మ. సతి జన్మించిన యంత నద్రిపతి కై । శ్వర్యంబు లుప్పొంగ భా
రతిసంగీతము మేరమీఱె మునులున్ । రంజిల్లి దివ్యాశ్రమ
ప్రతతిన్ దద్గిరిసార్వభౌముని సమీ । పంబందు నిర్మించి రు
న్నతవృక్షంబుల రాజిలెన్ ఫలములున్ । నానా ప్రసూనంబులున్

గీ. పావనంబయ్యె నదనదీ । జీవనంబు
జంతు పక్షినికాయంబు । సంతసించె

నాత్మ వైరంబులను బాసి । యఖిల జీవ
రాశి యలరె నన్యోన్యాను । రాగమునను. 247

గీ. మునులతోడను నవరత్న । ఖనులతోడ
హారులతోడను గిరులఁబోల్ । కరుల తోడ
నదులతోడను నగల నం । పదలతోడఁ
బొదలె మలతేని వాడ పూఁ । బొదలతోడ. 248

ఉ. అప్పుడు మేనకానహితుఁ । డప్పతి యప్పతి ధిక్కరించుచున్
గుప్పలుగా నొసంగె ముని । కోటికి గోవుల నంబరంబులన్
దెప్పలుగా నొసంగె నవ । నీసురకోటికి రత్నసంచయం
బెప్పుడు నెవ్వరుఁ జనుల । కివ్విధి నీయ రనంగ దేవతల్. 249

ఉ. ఆలలనామణిం గనిన । యంతనె యేమనవచ్చు నారా! యా
శైలవిభుం డెనంగె నని । శంభుడు మర్త్యుఁడు రామభక్తిఁ జేఁ
గాలినమాడ్కి; నాశ్రమని । కాయము చూడఁగ సర్వమంగళా
వాల మనంగనొప్పె ముని । వర్యులకుం బ్రిమదంబు నిండగన్.

ఉ. భార మణంగ భూపతికిఁ । బార్వతిఁ గాంచె గిరీంద్రుఁడఁ నవా
చారము నాలకించి మెద । సంతన మొందుచు సంభ్రమించి యా
నారదుఁ డేగుదెంచి గిరి । నాథునపర్యలఁ గాంచి; నీదుసం
సారము సారవంతమని । సన్నుతులీయఁగ నాశఁడత్తఱిన్.

ఉ. దారయుఁ దాను సంతసమిప । దంబులకున్ బ్రిణమిల్లి పుత్త్రికన్
గూరిమిఁ దెచ్చి చూపి “కనుఁ । గొంటి వెపుత్త్రిఁ త్రికాలవేదివో
సారవిచార! యీవెఱుఁగఁ । జాలని యంశములెందు లేవు, నీ
తోరపుదృష్టి యెట్టిగుణ । దోషములన్ బరికింపఁజాలుఁగా.

చ. అరసి మునీంద్ర! నాదు తన । యంగల దోషములన్ గుణంబులన్
గరుణ వచింపవే” యనిన । నవ్వుచు నారదుఁ డప్పుడిట్లనుఁ

"గిరివర ! నీకుమారి బరి । కింపఁగశక్యమె? లోకమాత, భూ
భరము సణంచు నంబిక భ । వాని యుమాసతి, యింతయేటికిన్

గీ. సర్వమంగళ, సర్వల । క్షణగుణాఢ్య
పితృయశోదాయిని యనంగ । వెలయు వనిత
ఈమె సేవించు సర్వ ము । నీందుప్రతతికి
సర్వ కామసంధాయయౌ । శైలధరేంద్ర. 254

ఉ. మానము లేని భిక్షుకుఁడ । మంగళుఁడైన దిగంబరుండుగా
నీనుఁ డకామదేహి జటి । చిన్మయుఁడైనవిరాగి యోగి యీ
చానకు భర్తయౌ నిదిని । జంబు ధరాధర సార్వభౌమ! యీ
వైనము జ్ఞానదృష్టిఁ గని । పల్కెతి దేవరహాస్యమారయన్. 255

చ. అన విని డెల్లఁబోయి హృద । యంబున బెంగ జనింప నాతఁడో
"వనజభవాత్మసంభవ ! య । పాయములేని యుపాయమున్నదే"
అనవుడు "ఫాలభాగలిఖి । తాక్షరముల్ తొలఁగింపఁజాలునే
వనరుహ నేత్రుఁడైన గిరి । వర్య వచించెద నీకుపాయమున్.256

గీ. ఏను బలికిన వన్నియు । నీశునందుఁ
దోచు చున్నవి చూచె వి । దుష్టచరిత !
ఈ కుమారిక విశ్వేశు । నెనయు నేని
దోషములు దివ్య గుణరత్న । భూషలగును. 257

గీ. రవికి నగ్నికి గంగకు । శివున కహహా
దోష మనునది యున్నదే! । తుహినధామ!
జీవ మీశ్వరు నెనసినఁ । బావనమగు
నేకముగ నున్న దోషభూ । యిష్ఠమగును. 258

గీ. మలము విమలమౌ గంగతోఁ । గలసె నేని
అగ్నిచే గఁగ నిర్దుష్ట మై । రహించు

భాస్కరునిఁ గూడి యయ్యగ్ని । ప్రజ్వలించు
భర్గునకు జ్ఞాననేత్రంబు । భాస్కరుండు. 259

గీ. తనకు జ్ఞానంబు గలదని । తలఁచి యెవఁడు
దేవతల లోపముల నెంచి । ధిక్కరించు
వాఁడు నరక కూపంబునఁ । బడును జూవె
ఎన్నటికిఁ గాని మోక్షంబు । నెనయలేఁడు. 260

గీ. క్లేశముల కోర్చి జపతపో । లీలఁ బేర్చి
సతముఁ గొలిచినఁ గరుణించి । శంకరుండు
నీకుమారికిఁ బెండ్లాడు; । లోకములకు
నీవివాహంబు నిత్యంబు । భావుకంబు. 261

మ. వరదుం డార్తివినాశకుం డురుకృపా । పాథోధి విశ్వేశ్వరుం
డరయన్ భక్తులకున్ బ్రసన్నుఁడయి యి । ష్టార్థంబులం గూర్చు శం
కరుఁ బూజింపక కోటియోగములచేఁ । గైవల్యముం బొందఁ జా
లరు యోగీశ్వరులున్ మునీశ్వరులు శ్రీ । లంగ్రాలు కోటీశులున్.

గీ. వార్థి వేష్టిత బ్రహ్మాండ । భాండమునను
వరులు లేరనఁ బోల దో । గిరికులేంద్ర
తలఁప నీమెకు నాతండ । తగినవరుఁడు;
శంకరుఁడు శంకరుఁడు భక్త । కింకరుండు. 263

గీ. అనుచు వచియించి లేచి సం । యమివరుండు
"తనయ శర్వాణి" యగు నిద్ది । తథ్యమనుచు
పార్వతిం జూచి యెలమి నా । శీర్వదించి
వీణ మ్రోఁగించి హరినెంచి । వీడుకొనియె. 264

ఉ. మేనక యాలకించి కను । మెల్లఁగ నాథునిఁ జేరి "నాథయా
మౌని మహానుభావుం డితని । మాటల నూఁకొనవచ్చుఁ గాకయా

నా సనరాదు కట్టుకొన । నక్కట బట్టయు లేనివానికిన్
జ్ఞానికి మానికిన్ గుసుమ । సాయకవైరికిఁ బెండ్లియేటికిన్. 265

ఆ.వె. ఉండఁ గొంప లేక । పండ మంచము లేక
వండఁ గుండ లేక । వలువ లేక
ఎండ వాన యనక । మొండికెత్తి మెలంగు
బండవాని కెవఁడు । బాలనిచ్చు? 266

గీ. తగినవరుఁ జూచి ముద్దారఁ । దనయనిమ్ము
వెడఁగు బైరాగి పలుకుల । విశ్వసించి
అకట బైరాగి కీనాన? । యంతకంటెఁ
గన్యకాత్వంబె యూహింప । ఘనతరంబు. 267

గీ. అనిన సతిఁ జూచి హిమవంతుఁ । డనియె నిట్లు
లతివ! రాకానిశాకరు । నందు వహ్ని
పుట్టినం బుట్టుఁగాని యీ । పుట్టుతపసి
ఆనతిచ్చిన యుపదేశ । మన్యత మగునె? 268

శా. కాంతా! యింతకు నింతవంత తగునే! । కానున్న కార్యంబు లే
వొంత న్డాఁగినఁ గాకయున్నె? యకటా! । మోహాంధకారావృత
స్వాంతం బన్యముఁ జూడనిచ్చునె? మదిన్ । భావించి సేవింపు మ
శ్రాంతంబుం బరమాత్ము; నాతనికృపన్ । సంకల్పమీడేఱెడున్

గీ. నారదునిపల్కుఁ గల్ల య । నంగరాదు
ఎలమి దేవరహస్యంబుఁ । దెలియఁ జేసె
శంకరు నెఱుంగఁ దరమె? క । శంకరహితుఁ
డింక శంక నీ కేటికిఁ । బంకజాక్షి! 270

గీ. జప తపో ధ్యాన నిరతిని । సంస్మరించు
ననఘులకు శంకరుండు ప్ర । త్యక్ష మగును;

తపముఁ గావించి నీకన్య । ధన్యయగును
ఇంక నీ కన్యసంతాప । మేల బేల! 271

చ. పతి యనురాగ మేర్పడఁగఁ । బల్కిన పల్కుల నాలకించి యా
సతి తనముద్దుపట్టిఁ గని । సంతస మొందుచుఁ గౌఁగిలించి య
ప్రతిహత మంబుజాసనుఁడు । వ్రాసినవ్రాఁ లని ముద్దులాడఁ బా
ర్వతి జనయిత్రిఁ జూచి మృదు । భాషలఁ దేనియలూఱ నిట్లనన్

మ. "కలఁ గంటిన్ గలఁ గంటి రేయి జననీ! । గౌరాంగుఁ డొక్కండు భూ
తలదేవుం డుపదేష్ట యై యొసరించెన్ । సత్త్వోపదేశంబు" స
త్ఫలమున్ గోరినదాన వేన్ జపతపో । ధ్యానంబులన్ జేకురున్
నెలఁతా స్థైర్యమునన్ దపింపు మడవిన్ । నిష్ఠాగరిష్ఠాత్మవై.

చ. తపమున సృష్టికర్తయయి । ధాత సృజించె సమస్తలోకముల్
దపమున సర్వభూస్థితికిఁ । దాత్రి యనంగ రహించె శౌరియున్
దపమున శూలి సృష్టికుని । దత్స్థితికిన్ విలయంబుఁ గూర్చె, స
త్తపమునఁ గాని దొండు గల । దా? గిరిరాజతనూజ! చెప్పుమా

గీ. తపమునకు సర్వసృష్టియుఁ । దల్లడిల్లుఁ;
దపముఁ గావింపు మబల స । త్ఫలముఁ బడయు"
మనుచు నంతలో నవ్విప్రుఁ । డంతరించె;"
ననిన విని తల్లియుం దండ్రి । యులరి రపుడు.

గీ. తల్లిదండ్రు లామోదించి । వల్లె యనఁగఁ
దపముఁ గావింప నెంచి కాం । తారమునకుఁ
జనియె నక్కాంత; తపియింపఁ । జాలునొక్కొ?
మోదుగుం బూవుఁ బోలిన । ముగుదమేను. 276

చ. ఫలములఁ గందమూలములఁ । బల్లవసంతతిఁ బండుటాకులన్,
అలములఁ గమ్మతెమ్మెరల । నంబువులం గొని, యాతపంబునన్,

బలవలవేఁగివేఁగి యుప । వాసములన్ గృశియించి, వానలన్
బొలుపఱి నానినాని హిమ । భూధరపుత్త్రి తపించెఁ గానలన్.

గీ. పృథ్వీధరసార్వభౌము పు । త్త్రిక తపింప
ఘనతపోవహ్ని సకలలో । కములఁ బ్రాకె;
నల్లముల నల్లుకొను భీతిఁ । దల్లడిల్లి
యెల్లమునులును యోగులుఁ । బల్లటిల్లి. 278

ఉ. "పర్వతరాజపుత్త్రి! భ । వత్తపముం గని సంతసించు నా
శర్వుఁ డనుగ్రహించి; ముని । చంద్రులు యోగులు నెల్లవేల్పులున్
బూర్వము చూచియుండ ని య । మోఘతపంబని మెచ్చి రమ్మ! దృ
క్పర్వముగా సుపర్వులు వి । వాహ మొనర్చెద రింత యేటికిన్

గీ. అనుచుఁ జదలాడుపలుకుల । నాలకించి
పార్వతి రహించెఁ దేజంబు । ప్రజ్వరిల్లె,
నంతకంతకు నుత్సాహ । మాక్రమించె
వదన ముత్ఫుల్ల మయ్యె శ్రీ । సదన మనఁగ. 280

మ. తనయర్థాంగి సతీమతల్లి యకటా । దాక్షాయణీదేవి జీ
వనముం బాసినయంత శూలి జటియై । వైరాగ్యముం బూని రా
మునినామంబు జపించుచున్ మునులకున్ । బోధించుచున్ సత్తపో
ఘనియై చూడ దిగంబరుం డయి మెలం । గంజొచ్చె ఘోరాటవిన్

మ. అరిషడ్వర్గమహాగ్నికీలలను శాం । తాంభోధిఁ జల్లార్చి, దు
స్తరసంతాపముఁ బాసి సన్మునులకున్ । జ్ఞానప్రదుండై, రమే
శ్వరు రామున్ గుణధాము లోఁ గొలుచుచున్ । జైతన్యరూపంబునన్
స్థిరచిత్తంబునఁ గానలన్ మెలఁగుచుం । డెన్ శూలి వైరాగియై

గీ. దినముదినమును దనరారు । దివ్యమహిమ
విస్తులరఁ బంచు భర్గుండు । ప్రస్తుతింప

నతనిభక్తికి మెచ్చి యే । కాంతముగను
ఆరఘురామద్విజుండు డిట్లని । యానతిచ్చె. 283

చ. ''సతి మరణించినన్ విరహ । సంకట మొందక యోగి వైతివో
వ్రతనియమంబునందు ముని । వర్యులు నీసరి గారు; నాదు నా
సతి వినువాఁడ వేని, గిరి । నాథునిపజ్జకు నిర్గమించి పా
ర్వతి నిఁకఁ బెండ్లియాడుము భ । వత్తప మంతయు సార్థకంబగున్''

చ. అనవిని రాముఁ జూచి యలి । కాక్షుఁడు చిన్నగ నంకురింప నో
యనఘ! సునామ! రామ! భవ । దాజ్ఞకు బద్ధుఁడ, నీవు చెప్పిన
ట్లొనరుచువాఁడఁ జూవెవిను । మొజ్జయుఁ దండ్రియుఁ దల్లియున్ వచిం
చిన విధి నెట్టివాఁ డయిన । జేయక మానునె మూఢచిత్తుఁడై.

గీ. విమల విజ్ఞాన భక్తి ధ । ర్మముల తోడ
నలరు నాతనివాక్కుల । నాలకించి
సంతసించుచు మిగులఁ బ్రి । సన్నుఁ డగుచు
క్షేమ మగుఁగాక యని పల్కి । రాముఁ డరిఁగె॥ 286

చ. పిదప మహర్షు లేడ్వురు వి । వేకనిధుల్ తనుఁ జూడరాఁగ స
మ్ముదమునఁ బాద్యమిచ్చి వర । పూజల నెంతయు గౌరవించి యిం
పొదవగ శూలి యిట్లనియె ; । ''నోసురవందితులారా! పార్వతీ
హృదిఁ గలరాగ మెట్టిదో మొ । తెంగిగిరీంద్రుని జూడఁబొ''ండనన్.

చ. వడివడి నమ్మహర్షు లల । పార్వతిపజ్జకు నేగి ''తల్లి! యి
వ్వడువున స్రుక్కి దుర్భరత । పం బొనరింపఁగ హేతు వేమి? యి
య్యెడ విమనోజ్ఞపుష్పవన । మంచుఁ దలంచితొ? చన్న బాలుఁ ద్రా
వెను పసికూన వోర్వఁగల । వే? తలిదండ్రులు సమ్మతించిరే?"

చ. అనవిని యామె పెయిట్లనె; ''మ । హాత్ములు మీరలెఱుంగరొక్కొ? యే
మనివచియించు దాన? నక । టా! వచియించిననాదు మూర్ఖ్యమున్

విని హసియింతురేమొ? యవి । వేకిని యంచు; మదీయబుద్ధి యొ
య్యనఁ దపియింప నియ్యకొనె । నన్యులబోధకు సమ్మతించునే?

గీ. బ్రహ్మమానసపుత్త్రుండు । పలికినట్టి
పలుకులను విశ్వసించి,త । పం బొనర్ప
నియ్యకొంటిని ముక్కంటి । నెయ్యమునకు
నాదు నజ్ఞానమునకీరు । నవ్వవచ్చు. 290

గీ. అనిన విని యమ్మహర్షు లా । వనితఁ గాంచి
మందహాసంబుఁ గావించి । "కుందరదన!
పర్వతోద్భూతనిజదేహ । వల్లి యిట్టి
ఉగ్రతపమున కోర్చిన । నోర్చుఁగాక! 291

గీ. బ్రహ్మమానసపుత్త్రుండు । వలికినట్టి
వాక్యములకును బయ లాడు । పలుకులకును
భేద మావంతయును లేదు । వెలఁది వినుము
వాని విశ్వసించి నవారు । బాగుపడిరె! 292

ఉ. మానవు లైన, వెండియు న । మర్త్యులు నైనఁ దదీయదంభ వి
జ్ఞానహితోపదేశము ని । జం బని నమ్మినఁ గీడు మూడు నో
మానిని! మున్ను వానిచెడ । మాటల నూఁకొని యెందఱెందఱో
దానవు లుక్కుఁ దక్కి తుది । దాక నశించిరి చెప్ప నేటికిన్ 293

క. జడదారి యాడుమాటకు
బెడదారిం బట్టి తీవు । వెర వెఱుఁగక యో
వడఁతీ! కపటం బుడుగని
యెడఁదంగలవాని నమ్మి । యేటికిఁ జెడఁగన్ 294

క. తనవలె నెల్లలు జోగులఁ
బొనరువ నూహించుఁ గపట । భూయిష్ఠుఁ డహో

వనితా నీవాతని తి,
య్యనివాకున కియ్యకొంటి । వనివార్యముగాన్॥ 295

క. కులహీను, హీనవిహీనున్
స్థలహీనున్ వస్త్రహీను, । సద్గుణ హీనున్;
బలహీను, నుదాసీనున్
భళిభళి!! కాంక్షించి తీవు । పశుపతిఁ బతిఁ గా॥ 296

ఉ. పాడిఁ దలంపఁజాలని క । పాలిఁ దిగంబరు, బిచ్చగానిఁ బెం
డ్లాడి సుఖంపవచ్చు నని । యాత్మఁ దలంచితె? దక్షుపుత్రిఁ బెం
డ్లాడఁడొ? యాపె చావుఁ గను । లారఁగఁ జూడఁడొ యట్టివానినీ
వోడక యిచ్చగించితివ । యో భవసాగర మెట్టు లీఁదెదో? 297

గీ. కట్టుకొన బట్ట లేకుండు । ట ట్టులుండె;
నెలమి నాలింపఁ దియ్యని । పలుకు లేదు,
చూచి ముద మొంద జల్లని । చూపు లేదు
ఉల్ల మొల్లునె? వానిల్లు । వల్ల కాడు॥ 298

ఉ. శౌచము లేనివాఁడు బుధ । సంఘవిగర్హితవర్తనుండు, పై
శాచగుణానుభావుఁడు, శ్మ । శానవిహారరతుండు, సాత్త్వికా
లోచన లేనివాఁ డలిక । లోచను నెవ్విధిఁ బెండ్లియాడ నం
కోచముఁ దక్కి బేలవయి । ఘోరతపంబున కియ్యకొంటివో? 299

ఉ. కోపముసంహరింపు;సుమ । కోమలి వయ్యుమహాతపంబునం
దోపిక నీ వొనర్చిన మ । హోగ్రతపం బొకబిచ్చగానితోఁ
గాపుర ముండఁగాదె? యుల । కాపురనాథుని మిత్రుఁ డంచునే
లోపము నుండ రా దనుచు । లోలవిలోచన లోఁ దలంచితో? 300

ఉ. చెప్పెద నొక్కమాట, నన । సీరుహపత్రవిశాలనేత్ర! నీ
విప్పగిదిన్ దపింపఁ దగు । నే వనిలో, నొకపాటివానికై;

ఒప్పరికింప వేని వరుఁ । డొక్కఁడు నీ కనుకూలుఁడైనవాఁ
డప్పరమాత్ముఁ డందమున । కందమొనంగెడువాఁడు లేఁడుకో! 301

గీ. అఖిలసద్గుణరత్న ర । త్నాకరుండు
దోషరహితుండు, కేయూర । భూషణుండు
శ్రీమనోహరుండు, వికుంఠ । ధాముఁ డుండ
బోఁడి వలచు టేపాడి పూ । బోఁడి చెపుము. 302

చ. అనవిని మందహాసకలి । తాననబింబము వంచి యూపె యి
ట్లనియె "మహర్షులార! తమ । రానతి యిచ్చినరీతి నామనం
బనిశము మేలుకీల్ల రయు । దద్విజ మైనకతంబునం గదా
కనకము నగ్నికుండమునఁ । గాల్చిన నైజగుణంబుఁ బాయునే?.

ఉ. నారదుఁ డానతిచ్చినది । నచ్చిన దెంతయు నామనంబు; కాం
తారములందుఁగాక, గగ । నంబునుమూర్కొనుకొండలందుఁ గా
కీరములందుఁ గాక, మఱి । యెందుమెలంగిన నెట్టికేడు లే
దారసి యొజ్జ పల్కినది । యా నని నమ్మిన వారి కెన్నఁడున్.

ఉ. పోఁకుడుమూకతో । మెుఁగు శూలధరుం డొకయూరి జోగియౌఁ
గాక, వికుంఠధాముఁ డల । కాపురనాథుని ధిక్కరించుఁగా
కేఁకటఁ దూలి యీహృదయ । మేహృదయంబునసంగమించిలో
కైకసుఖంబుఁ గాంచునది । యే పరమామృత మింత యేటికిన్.

చ. మునివరులార! నారదుని । మూఁదలిక౦ గొని విశ్వసించి యా
తని గురువర్యుఁగా దలఁచి । ధ్యానమొనర్చి తపించుచుంటి, నా
మనమున రమించు శంకరుని । మానసమం దెవ రెన్నిచెప్పినన్
దునియదు; నిక్క మింకగుణ । దోషవివాదవినోద మేటికిన్.

ఉ. మాటికిమాటి కక్కఱకు । మాలినవాఁ డని శూలిఁ దిట్టగా
నేటికి? నన్ని చెప్పిన ని । వేగదమాటలు మానులార! నేఁ

గోటిభవంబు లెత్తియుఁ ౹ గూలిన, నెన్నటికేని శూలి నా
మేటిమగండు ; గానియెడ ౹ మేలని కన్యక నై తపించెదన్.

చ. అలయక మీర లిందనుక ౹ నానతియిచ్చిన దెల్ల లెస్సగాఁ
దెలిసెను; చాలదవ్వరుగు ౹ దెంచిరి మ్రుక్షులఁగొండు మీగృహం
బులకిఁకఁ బొండు, లెండుఁ శివ ౹ పూజకుఁ బోఁదఱి తప్పెనన్న వా
రలు వచియించిరిట్లుగిరి ౹ రాజతనూజకు దృక్సరోజకున్॥ 308

గీ. సద్గుణకదంబ జగదంబ! ౹ జయము, జయము,
ఈవు మాయా స్వరూపిణి ౹ వీశ్వరుండు
తలఁప భగవంతు డీరలు ౹ తల్లిదండ్రు
లింటి కేఁగుము కోర్కె లీ ౹ డేఱునమ్మ॥ 309

చ. అని వినుతించి పిమ్మట మ ౹ హర్షులు శంభునిపాలి కేగి, యు
వ్వనిత సతీమతల్లి యని ౹ పల్కి తదీయమనోనురాగముఁ
ఘనముగఁ జెప్పినంత శితి ౹ కంధరుఁ డెంతయు మెచ్చి వారలం
జనుఁడనిపల్కి రాఘవునిఁ ౹ జాలనుతించుచునుండె నెమ్మదిన్ 310

తారకాసురవృత్తాంతము

ఉ. అత్తఱిఁ దారకాసురుఁ డ ౹ హంకృతిఁ బేరిచి బాహువిక్రమో
ద్వృత్తి సురేంద్రునిం గెలిచి ౹ వేల్పుల నెల్లఱఁ గాకుసేసి, త
న్మత్తగజేంద్రగాములను ౹ మానధనంబులఁ గొల్లలాడె లో
కోత్తరవీరుఁడై వరబ ౹ లోన్నతిఁ గైకొనె నాకలోకమున్ 311

గీ, దర్పితారాతి హృదయవి ౹ దారకుండు,
ఘోర దోర్బల భీత బృం ౹ దారకుండు,
మారకుఁడు జగద్విప్లవ ౹ కారకుండు,
తారకుఁడు సౌఖ్యవారాశి ౹ తారకుండు. 312

గీ. జరయు మృతియును లేనట్టి । సత్వశాలిఁ
దారకుని నెమ్మియింద్రుంవఁ । దలఁచి తలఁచి!
ఎల్లఱుం గూడి పోరాడి । వల్లటిలిరి
వేలుపులు జీవముల రోసి । పెంపు బాసి. 313

గీ. సారవంతంబు లైనయా । పథము లెల్ల
సన్నిపాతంబు పైఁ బోలె । జంభవైరి
కెరలి యాక్రూరు పైఁ బ్రయో । గించినట్టి
సారశస్త్రాస్త్రసమితి ని స్సార మయ్యె. 314

గీ. పాశుపతమును మించిన । శ్రీశుచక్ర
ధారను సహించి చావని । వారు గలరె?
అక్కటకట యట్టి చ । క్రాయుధంబు
వానియురమున దీపించెఁ । బతక మనఁగ. 315

ఉ. అంతట నొక్కనాడు సుర । లందఱు నింద్రుఁ బురస్కరించి, దు
ర్దాంతవరప్రసాదమున । దైత్యులతోడఁ బరాక్రమించు దు
స్స్వాంతునిఁ దారకున్ దునుము । నట్టియుపాయ మెఱుంగ భారతీ
కాంతుని కాళ్ళ పైఁ బడిరి । కన్నుల నశ్రులు జాలువాఱఁగన్.

చ. వనజభవుండు వేల్పుల య । వస్థకు మిక్కిలి తల్లడిల్లి యి
ట్లనియెను:-"వేల్పులార సమ । యంబు లభించినయంత దాఁక నో
పిన శుభ మా, మహేశ్వరుని । వీర్యమునన్ జనియించు వీరుఁ డొ
క్కరుఁడ వలంతి యియ్యసుర । గర్వ మణంపఁగ సంహరింపఁగన్.

చ. వలికెద నాలకింపుఁ డన । పాయముగాఁగ నుపాయ మొండు, నా
డలసతి దక్షయాగసమ । యంబున దేహముఁ బాసి, వెంటనే
చలిమలకున్ జనించెఁ గద । శంకరుఁ బెండిలియాడఁ గోరి, య
వ్వాలఁది యొకర్తు కేశివుని । వీర్యభరంబు భరింప నోపెడున్.

ఉ. ఆలలనాశిరోమణి, య । హర్నిశమున్ దప మాచరించు నో
వేలుపులార! శంకరునిఁ । బెండిలియాడఁగ నిశ్చయించి; యా
శూలి విరాగి యై జగముఁ । జూడఁగ లేక సమాధినుండె, నే
లీలల వానిచిత్తము చ । లించు,? స్మరున్ స్మరియింపుఁ డెల్లరున్.

గీ. రుద్రు డీనిద్రనుండి యు । న్నిద్రుఁ డైన
క్షేమ మగుమీకు వెండియు । హైమవతికి;''
ననిన విని వేల్పు లెల్లరు । నంగభవుని
నపుడు ధ్యానించి రతఁడుఁ బ్ర । త్యక్ష మయ్యె. 320

గీ. అతఁడు ప్రత్యక్ష మైనంత । నమరు లెల్లఁ
గెవ్వ మని యార్చి పేర్చిరి । నవ్వి నవ్వి;
వేయికన్నులఁ గన్నీరు । వెడల నింద్రుఁ
డతని దరి కేగి చేసాచి । యాదరించి. 321

ఉ. ఔర కుమార! నీవెఱుఁగ । వా? సురలోకము పెం పడంగె; నా
తారకు సంహరింపఁ గల । దక్షుఁ డెవండొ యెఱుంగఁ జేసె నీ
సారససంభవుండు; నిను । సాయముఁ జేయఁగఁ గోరువార మే
తీరున మమ్ముఁ బ్రోచెదవొ? । తియ్యనివింటను పోటుబంట వై

గీ. అనిన విని పుష్పసాయకుఁ । డనియె నిట్టు
"లున్నది నశింపఁ జేయుట । కున్నవారు
వీరవరు లెంద ఱేనియు, । వృద్ధిఁ గొలుపఁ
బాటుపడు పోటుబంటు క । న్పట్టఁ డెందు. 323

ఉ. ఖండనకార్యపద్ధతి జ । గల్లయ హేతువు చెప్ప కేమి? యా
ఖండల! యోగి యైనశితి । కంధరునేని మదీయ పుష్పకో
దండవిముక్త పుష్పశర । తండమునన్ గరఁగించెదన్ శిర
స్సుండఁగఁ బాదపూజ యను । నోజఁ దదన్యుల నెన్న నేటికిన్?

గీ. ఇంత యేటికి దేవతా । హితముకొఱకు
దేహముఁ ద్యజించువాఁడ సం । దేహ మేటి"
కనిన నాఁగాక యనుచు న । య్యమరవిభుఁడు
నలువ పలికినపలుకులఁ । దెలియఁ జేసె. 325

శా. "ఏమేమీ శివు నే జయింపవలెనో! । యేపాటి యీ మేటి? ని
ష్కామిన్ భర్గునిఁ గామినీసహచరుం । గావించెదం గాక; యో
స్వామీ! యన్యహితార్థమే ఘనుఁడు స్వ । ప్రాణంబు లర్పించు న
ద్ధీమంతుండు యశశ్శరీరియయి ధా । త్రిం గ్రాలు నెక్కాలమున్

చ. "మునివరు లాశ్రితావనన । మోనహిధర్మ" యనంగ వింటినో
అనఘ! పరోపకారమున । కై తన కాయముఁ బాయు టొప్పదే!
తనప్రజ సౌఖ్య మొందఁ బర । దాస్యమునుండి విముక్తిఁ జెందఁగాఁ
దనువుఁ ద్యజించు సజ్జనుఁడు । ధన్యుఁడు మాన్యుఁ డగణ్యపుణ్యుఁడున్

ఉ. వేఁడినవార లల్పులొకొ? । వేల్పులు; వేడిన కార్యమల్పమే?
మూఁడు జగంబులన్ మలఁగు । ప్రోడలఁ బ్రోచెడునట్టి దింతకుం
బాడిఁ దలంప నెంతయు శు । భప్రద; మియ్యది సాధ్యమానె; నా
వాఁడికిఁ బూవుఁదూపులకుఁ । బచ్చనివింటి కసాధ్యమున్నదే?

చ. తెలియక యుండునే" యని య । ధిజ్య శరాసనుఁడై మరుండు నె
చ్చెలియగు మాధవుండు తన । చెంగట నుండఁగఁ జూచి లేచి తా
"సెలవని" యింద్రుతోఁ బలికి । చిల్కలు నంచలు గోరువంకలున్
కలకలరావముల్ సలుపఁ । గాఁ జనెఁ గమ్మని తావి క్రమ్మఁగన్.

చ. ఎఱుఁగఁడె మారుఁడా హరుని । యొజ్జని చూడ్కికి నగ్గమైన బెం
పెఱ మరణంబు వచ్చునని । యక్కట! యయ్యమరావనార్థమై
అటిమూటఁ బచ్చవిల్తుఁడయి । యుద్భటికిం జనె; నాగ్రహించి తా
నఱపఱ సేయునేని జగ । మంతయు నెంతయుఁ దల్లడిల్లదే. 330

గీ. ఆర్య సన్నుత బ్రహ్మచ । ర్య వ్రతంబు
నిష్ఠ విరతియు నింద్రియ । నిగ్రహంబు
వైదికంబు సదాచార । వర్తనంబు
స్మరుని నిరసించి యెదిరింపఁ । జాలు నొక్కొ? 331

శా. కుంఠీభూత మనస్కులై మునులు యో । గుల్ రాగులై వేఁగ, వై
కుంఠుండిందిరఁ గౌఁగిలింప జలధుల్ । ఘోషించి యుప్పొంగగా
ఠంఠంనాదము మారుమ్రోఁగగ ధను । ష్టంకారమున్ మారుఁడు
త్కంఠం జేసె నకుంఠితాత్ముఁడగు శ్రీ । కంఠుండు కుంఠుండుగాన్

వసంతఋతు వర్ణనము

గీ. ఉత్తరాయణ మేతెంచె । నో యనంగ
సకల వల్లీమతల్లులు । భూమిరుహంబు
లలరి యలరుల వలవులఁ । బొలుపుఁ గాంచె
గంధములఁ దెచ్చి వెదఁజల్లె । గంధవహుఁడు. 333

గీ. సుందరీ పాదతాడన । మొందకుండ
భువి నశోకంబు రాజిల్లెఁ । బుష్పములను
ఉవిద తన్నవలోకింప । కున్న నేమి?
వకుళము రహించె నత్యంత । వైభవమున. 334

గీ. సరస సంపదలం బొందె । జడ పదార్థ
సంచయం బెంతయుఁ జలించె । జగతియందు;
గామవాంఛకులౌఁగి వి । కారమొందు
చేతనంబుల చొప్పు నేఁ । జెప్పవలెనె?. 335

చ. సమయముఁ జూడకుండ సర । సంబు లభించినఁ జాలునంచు సా
యమియు లతాంగికై తహత । హం దిరుగాడుచు వేఁగుచుండెఁ నే

కమలముఖంగనుంగొనినఁ । గాంతునిఁ బాయని ఛాయఁబోలె లో
కము విచలించె; నమ్మృగ ఖ । గంబుల చందముఁ జెప్పనేటికిన్

గీ. సిద్ధులెల్లను సురత ప్ర । సిద్ధులైరి
సాధ్యులెల్లను స్త్రీలకా । రాధ్యులైరి
భక్తులెల్లనుఁ గాంతాను । రక్తులైరి
యోగు లనురాగులై విప్ర । యోగులైరి. 337

గీ. బ్రహ్మమయమైన సకల ప్ర । పంచ సృష్టి
స్త్రీ మయంబని పురుషులు । కాములైరి;
సతులు పురుష మయంబని । జారలైరి;
మీనకేతను మహిమంబు । మేర మీఱె. 338

గీ. ప్రమదవనములు వనములుఁ । బర్వతములుఁ
బల్వలంబులు సరసులు । వాపికలును
ఎట్లులుండునో? యూహింపు । డింతయేటి
కథమ మరుభూమి యలరె రా । గాంకురమున. 339

గీ. చెలువలు నటించి రెలమిఁ జెం । గలువచెలువుఁ
బొదల నలరించెఁ బొదలుతు । మ్మెదలు రొదల
మారుతమ్ములు తమ్ముల । మహిమఁ బొగడె
స్థాణువు చలించె నింకనా । శ్చర్యమేల? 340

గీ. పద్మినీ సక్త సరసుల । వైభవమును
మధుప సంతతి కొనియాడె । మగువలలర;
మలయమారుత సందీప్త । మన్మథాగ్ని
భాతిరాజిల్లెఁ గింశుక । ప్రసవచయము! 341

గీ. కీర శారికా హంస కో । కిల రవంబు
దేవ గానంబు దిక్కుల । నావరించె;

నంబరంబున దివ్యవా । ద్యములు మోఁగెఁ
బంచబాణుండు చెలరేఁగె । భర్గుఁ జూచి. 342

ఉ. చచ్చిననేమి? యీ తనువ । శాశ్వత మంచుఁ దెగించి యేపుమై
వచ్చినవాఁడు మన్మథుఁడు । పచ్చనివిల్తుఁడు; పూవుటమ్ములం
దిచ్చినవాఁడు మాధవుఁ డ । హీనబలుండగు నింద్రుఁ డెంతయున్
మెచ్చినవాఁడు; భర్గుఁడిఁక । మేల్కొని యేల్కొనకున్న పార్వతిన్

మన్మథదహనము

మ. అలికాక్షున్ వరసంయమీంద్రుఁగని యీ । ర్ష్యాపీడితుండై మరుం
డలవేపారఁగఁ జూతశాఖపయిఁ బ్ర । త్యాలీఢుఁడై నిల్చి, చేఁ
గలవిల్లెక్కిడి ముల్కిఁగూర్చి గుణమా । కర్ణాంతమున్ లాఁగి దృ
క్కుల లక్ష్యంబున మేళవించి విడిచెన్ । గొండాడఁగన్ వేలుపుల్.

గీ. చావ నిర్ముక్త బాణసం । జాత వాత
నిహత వృషరాజ మప్పుడ । నిర్గమించి
స్వర్గవిం గూడఁ బరువిడె । స్వర్గమునకు;
నచ్చరలఁ జూచి ప్రమథులు । ఱిచ్చవడిరి.

గీ. కమ్మతావుల దిక్కులఁ । గుమ్మరించి,
రివ్వుమని కాముబాణంబు । హృదయవీథిఁ
జొచ్చినంతనె కలఁగి సం । క్షోభ మొంది
కడలఁ బరికించి ముక్కంటి । కనులఁ దెఱచి; 346

గీ. పాదపమునఁ బ్రత్యాలీఢ । పాదుఁడైన
యోధ వరుఁజూచి హుమ్మని । హుంకరించి
ధిక్కరించి ఫాలాక్షంబుఁ । దెఱచినంత
మరుఁడు మసియయ్యె మాడె న । మ్మాధవుండు. 347

ఉ. అత్తటి నాగ్రిహాగ్రి నిట । లాక్షు సముద్గత ధూమవల్లి ది
గ్భిత్తుల నాక్రమించెఁ బృథి । వింగల శోభయు నస్తమించె వి
ద్యుత్తతిఁబోలి దీపము మ । హోజ్జ్వల కాంతులఁ బ్రజ్వలించియు
న్వ్యత్తుగ నంతరించుగతి । వృత్రిహుఁ డెంతయుఁదల్లడిల్లఁగన్.

ఉ. చిచ్చులకంటి మంటలకుఁ । జేడ్పడి కీడ్పడి రూపుఁదక్కు మా
నచ్చినవాఁడు చచ్చెనని । నచ్చికదుంగడు హెచ్చవంచు న
య్యచ్చర లెల్ల తిచ్చవడి । యచ్చోటు వాసిరి వెచ్చనూర్చి; 'మా
యిచ్చకువచ్చె' నంచు మది । నెంతయు మెచ్చిరిదైత్యు లెల్లరున్

ఉ. అంగజు భస్మముంగని య । నంగుని యంగన శోకమిట్టి రూ
పుంగొనెనో యనంగ నెదఁ । బొంగిన యంగద మ్రింగలేక చ
న్నుంగవ ధూళిబ్రుంగఁగఁ, గ । నంగవ నశ్రులు జాలువాఱ త్కా
లింగనమాచరించె నను । లీల భువిం బొరలాడె నేడ్చుచున్. 349

ఆ. ఏడ్చి, యేడ్చి, యేడ్చి, । యెల్లదిక్కులఁ జూచి,
దిక్కు లేద యనుచు । వెక్కి, వెక్కి,
శివుని మ్రోల నిల్చి । చేతుల జోడించి,
వెన్ను వంచి, యబల । సన్నుతించె. 351

ఉ. ఆ కరుణామయుండు శివుఁ । డత్తటి నత్తరళాయతాక్షితో
"శోకముఁ బాయు మీవ విభు । జూచెదనంగుఁ డనంగవాఁడుము
ల్లోకములన్ మెలంగు; భువి । లోన నతండు జనించు నప్పుడే
వేకట వానిఁ గూడఁగల । వింతకు నింతటి వంత యేటికిన్. 352

మ. యదువంశంబునఁ గృష్ణనాముఁడవ దై । త్యధ్వంసియుమ్మాధవుం
డుదయించుంగద, వాని యాత్మజుఁడు ప్ర । ద్యుమ్నుండనునీభర్తయై
ముదమేపార సుఖింపఁజేయు నబలా! । పొద్యుమ్నస్న" డక్కాంత న
మ్మదినా మోదముఁ బొందుచున్ వెడలె స । న్మానింపనాకౌకసుల్

ఉ. అంతటసంతసించి, జల । జాక్షునిఁ గాంచి పురస్కరించి వా
క్కాంతుఁడు నింద్రుఁడున్సురలున్ । గాలగళున్ దిలకించి, పార్వతీ
కాంతుఁడవై సుఖింపుము జ । గత్త్రయ మొంతయు సన్నుతించు లో
కాంతక మన్మథాంతక మ । ఖాంతక యోత్రిపురాసురాంతకా

గీ. పుష్పశరుఁ జంపి వెండియుఁ । బ్రోచి తీవు
హరహరా! నీక తగుఁగాక । యాగ్రహించి
నిగ్రహింపఁగ మఱియు న । నుగ్రహింపఁ;
బాడిఁ దలపెట్టి మమ్ముఁగా । పాడు మింక. 355

గీ. అనిన నౌఁగాక యని, వారి । నాదరించి
లోకనాథుఁడు పెండ్లికం । గీకరించె
నెల్లఱును సంతసించిరి; । ఋషులు మునులు
నేగి పార్వతిఁ దిలకించి । యిట్టులనిరి. 356

గీ. "నారదుని విశ్వసించి యీ । ఘోరతపముఁ
జేసి మన్మథుని దహింపఁ । జేసి తీవు,
అతివ! నీదు నుద్దేశంబు । వ్యర్థ మయ్యె
బూడిదం బోయు పన్నీరు । పోల్కి నకట." 357

ఉ. నావుడు వారిఁజూచి నగ । నాథకుమారిక యిట్లనున్ "మహా
దేవునిఁ దక్క నన్యుల మ । దిందలపెట్టను, కంటఁజూడ; నా
భావమొసంగితిన్ ద్రిపుర । వైరికి సన్నుత చక్రధారికిన్
దేవమునీంద్రులార! గురు । దేవుని నారదు విశ్వసించితిన్. 358

ఉ. శైత్యము వహ్నికీలలకుఁ । జాలునె; యావిరియై నశించు, నా
దిత్యుని నేపుమై ఖగమె । దిర్చిన భస్మము గాకయున్నె? యా
నిత్యుని వేదవేద్యునిఁ గ । నిష్ఠుని గాఁ దలపెట్టి మారుఁడౌ
న్నత్యముఁ జూపఁబోయె, మరణంబును బొందిన వింతయున్న దే

గీ. సప్త ఋషులామె బుద్ధికి । సంతసించి,
ప్రీతి విశ్వాసములఁ గాంచి, । వినుతులిచ్చి,
సత్వరంబుగ మలతేని । సరస కేగి
తెలియఁ జేసి రుదంతంబుఁ । దెల్లముగను. 360

సీ. దేవ కార్యార్థము । ధృతిఁ బూని మన్మథుం
డరిగె నంచాలించి । యభినుతించి,
వహ్నిలో శలభంబు । వలె మారుఁ డభవుచే
భస్మ మయ్యె ననంగఁ । బరితపించి,
భర్గుండు కరుణించి । వరమిచ్చెఁ గంతుని
కాంతకన్నంతనే । సంతసించి,
తనకూతు రొనరించు । తపమున కీశ్వరుం
డల్లుఁడౌ నని వల్క । నతిశయించి,
గీ. ఘనుల సప్త మహర్షుల । గౌరవించి,
దివ్య నక్షత్ర భూషిత । దినము నందు
నెలఁత పెండ్లికి లగ్నంబు । నిశ్చయించి
నలువ మొదలగు నెల్లరఁ । బిలువఁ బంచె. 361

శివోద్వాహ మహోత్సవము

గీ. పులక లంగంబునఁ జెలంగి । పొంగలింప
ఉన్మథరేంద్రుండు పార్వతిం । గౌఁగిలించి,
ప్రోత్సహించె నుద్వాహ మ । హోత్సవమున
కోషధిప్రస్థ మెంతయు । నొప్పమీఱె. 362

ఉ. మోహము మేరమీఱె హిమ । భూధరపుత్రిక, కాత్మలందునం
దేహము దోఁప దానవులు । దిక్కుల నక్కిరి, చూచినంతనే

దేహము పుల్కరింప గడి । దేఱిన యచ్చర లాడి పాడి రు
త్సాహమురూపుఁదాల్చెనను । చందమెసంగవివాహమెంతయున్

ఉ. ధీజను లెంతయుంబొగడఁ । దేజ మెసంగ మనోహరాననాం
భోజకు, భక్తలోకసుర । భూజకుఁ, బాదనమద్బిడౌజకున్,
రాజిత రత్నయుక్కుధర । రాజతనూజకుఁ, బర్వతోన్నతో
రోజకు, నీలనీరదశి । రోజకు నాయత దృక్సరోజకున్. 364

సీ. వర జటాజూటస్థ । సురవాహినీజల
క్షాళితశశికళా । మాళితోడ,
ఫణిఫణా మణిగణో । ద్భాసిత రుద్రాక్ష
కుండలభార శ । ష్కులులతోడ
నురగ యజ్ఞోపవీ । తోపేత గరళకం
ఠాలంబ కంకాళ । మాలతోడ
ఆభోగ భోగ స । హస్రమణీ ఘృణీ
కలి తాహివాధకం । కణముతోడ

గీ. జ్ఞానతేజో విరాజిత । నయనకాంతి
డంబుమీఱిన ఫాలభా । గంబుతోడ
డమరు శూలముల్ కరములఁ । గొమరుమిగుల
మృడుఁడు వృషవాహనుం డయి । వెడలె నపుడు. 365

గీ. అంబరస్థలి దివ్యవా । ద్యములు మ్రోఁగ
నచ్చరలు వియచ్చరులతో । నాడిపాడి
రపుడు బ్రహ్మాదిదేవత । లనుగమించి
రెలమి నబ్జాతనేత్రుఁడు । పలుకరించె. 366

చ. ప్రమథులు వెంబడింప, ముని । వర్యుల సామము మిన్నుదాక,ద
య్యములు వికారరూపముల । నాటల నాడుచుఁ బాడుచుండ,ను

షముపయి వచ్చు నీశ్వరునిఁ । గాంచి కడుంగడు సంతసించియా
హిమగిరి యేఁగుదెంచి, యపు । డెల్లఱ మెల్లఁగ గౌరవించుచున్

గీ. హరిహర బ్రహ్మ లగు మునీ । శ్వరులఁ జూచి
మ్రొక్కు లర్పించి, ప్రమథులఁ । దక్కువారి
వలుకులం దేన లొల్కంగఁ । బలుకరించి
పెండ్లివిడిదిని జూపించి । విడియఁ జేసె. 368

గీ. ప్రమథులం జూచి దయ్యాల । వరుసఁ జూచి
భర్గుఁ బరికించి వానిరూ । పంబుఁ గాంచి
"ఔర! పాములవాఁడు ద । య్యాల ఱేఁడు
పెండ్లికొడు" కంచు నవ్వి ర । వ్వాటివారు. 369

ఉ. "ఎక్కడనుండి వచ్చె జల । జేక్షణ కిట్టిమగండు? నారదుం
డక్కట కొంపఁదీసెఁ,దప । మంతయుఁ బాములవానికొక్కొ?యీ
చక్కనిచుక్క యెక్కడ? శ్మ । శానమునందు మెలంగు జోగి వీఁ
డెక్కడ! కొంపలేక చరి । యించెడు వానికిఁ బెండ్లి యేటికిన్.

గీ. ధనము లే దిల్లు లే దెట్టి । ఘనత లేదు
మాయయున్ మర్మమున్ లేక । మలయువాఁడు
దాపరించునె నీ కిట్టి । కాపురంబు!
ఎవ్విధి సహింపవచ్చునే । పువ్వుబోఁడి. 371

ఆ. వె. బూచుల కెకిమీఁడు । త్రాచుపాములవాఁడు
వల్లకాటిఱేఁడు । వల్లభుండె?
ఊరజోగి యనఁగ । నూరూరఁ దిరుగాడు
వెంగలీఁడు వీఁడు । సంగడీఁడె? 372

ఉ. పాడియుఁ బంట లే దనెడు । వా డటులుండఁగ నిల్లు లేక న
ట్టాడెడు బిచ్చగాని కెవ । రైనఁ గుమారిక నిచ్చువారె? యి

ట్లాడిక లాడ నేటి కని ౹ యుండుదువు తేలవు గాన, వీనిఁ జెం
డ్లాడినఁ బూవుబోండ్లు నగ ౹ రా? నగరాజకుమారి చెప్పుమా?"

చ. అని తనతల్లి యివ్విధి మ ౹ హాపద పైఁబడినట్లు లెంతయున్
ఘనతర దుఃఖవేదనకుఁ ౹ గ్రాఁగి కడుంగడు వ్రేఁగి యేడ్చినన్
గని గిరిరాజపుత్త్రిక, ము ౹ ఖంబున లేనగ వంకురింపఁగా
జననినిఁ గౌఁగిలించుకొని ౹ సాంత్వనవాక్కుల నాపె కిట్లనున్.

మ. "మునునేఁ జేసినచేఁతకుం దగుఫలం ౹ బున్ గాక యన్యంబుఁ గో
రినఁ జేకూరునె? నామగం డకట వె ౹ ఱ్ఱిం బోలియుం బేద యై
వనిలోఁ గాపుర ముండుఁగాక, విను నా ౹ ప్రారబ్ధకర్మంబు ద
ప్పునె? తప్పింపఁగ నేరికైనఁ దరమే? ౹ మోహంబు నీ కేటికిన్?

ఉ. చక్కఁదనంబుఁ గోరు నెఱ ౹ జాణలఁ బోలినదానఁ గాను; పెన్
మక్కువఁ గాంత యెవ్వనికి ౹ మానస మిచ్చు నతండె నాథుఁ డ
మ్మక్కరో! యిట్టిచింత తగు ౹ నా మగనాలికి? నట్టివానికిన్
జిక్కనివాఁడు కౌఁగిటికిఁ ౹ జిక్కినఁ జాలదె యింత యేటికిన్.

ఆ. వె. కాళ్ళ కేమి చేటు? ౹ కనుల కేమిట లోటు?
సొట్టగావు మఱియు ౹ లొట్ట వోవు;
అతనుఁ డంతవాఁడు ౹ నతని చక్కఁదనంబుఁ
జూడలేక చచ్చి ౹ సున్న మయ్యొ." 377

క. అని సాంత్వనవాక్కుల న
వ్వనితామణి శైలపుత్త్రి ౹ పలుకుచు నుండన్
విని సప్తఋషులతో సుర
ముని నారదుఁ డేఁగుదెంచెఁ ౹ బొంతకు నెలమిన్ 378

గీ. అట్టు లేతెంచి నారదుం ౹ డపహసించి
మేనకం జూచి విను మని ౹ యానతిచ్చె;

‘‘మగువ! నీదుపుత్త్రిక జగ । న్మాత మఱియు
నాది మ ధ్యాంత రహిత, య । య్యాది శక్తి. 379

గీ. శివుని నెవనిగ నెంచి దూ । షించె దీవు?
విశ్వనాథుండు ఘనుఁడు ము । వ్వేల్పులందు,
అతని యర్ధాంగలక్ష్మి యి । య్యాది శక్తి;
కాంత! యింక నీ కేటికి । నింత వంత? 380

చ. అసదృశయోగమార్గ మహి । మాతిశయంబునఁ బొల్చువాఁడు సొం
పెసఁగిన మేనివాఁడు భువి । నెరికిఁ జిక్కనివాఁడు మాయతో
మసలెడువాఁడు చూడ నణి । మా మహిమాదులనొప్పువాఁడ యో
దిసమొలవానిఁ గాఁ దలఁచి । తేఁకువఁ దప్పకుమమ్మ యిత్తఱిన్

సీ. దక్షప్రజాపతి । తనుజ యై నాఁడు నీ
యాత్మజ శివునిఁ బెం । డ్లాడ లేదా?
జానకీరాముల । సన్నుతించి భజించు
నలికాక్షు తోడ వా । దాడ లేదా?
సీతాకృతిం దాల్చి । శ్రీరాము వంచింప
నడవికి నొంటి మై । వెడల లేదా?
భర్తృవియోగంబు । బాధింప దుఃఖించి
పెక్కేండ్లు తపముఁ గా । వింప లేదా?
గీ. పరిభవాగ్నికి దేహంబుఁ । బాయ లేదా?
నీదుకూఁతురై జన్మించి । నెగడ లేదా?
వెండి శివునిఁ బెండ్లాడఁ ద । లంప లేదా?
అతివ! నీ వెఱుంగనియట్టి । యంశ మేదో? 382

చ. అన విని మేనకాది లలి । తాంగులు మిక్కిలి సంతసించి ‘యో
మునివర! నీదువాక్యముల । పొందికఁ బొందికఁ బెంపునింపు; మా

మనములనుండు సందియము । మాసె మహార్ఘము మించకుండ నా
సనములఁ గొండు లెండనుచు । శైలసుతం గడు మెచ్చిరంతటన్.

చ. వలువలతోడఁ, గప్పురము । భాతి నొసంగు విభూతితోడ మేఁగ్
చిలువలతోడ సాలువలెఁ । జెల్వలరారెడు తోలుతోడ నా
దల నెలవంకతోడఁ దెలి । దమ్ములఁ గ్రాల్ విను వాఁకతోడ, న
న్నలువకు మ్రొక్కి యానసము । నన్ శివుఁ డాదటి వేచియుండఁగన్

ఉ. అంతట నమ్మునీశ్వరు । లానతి దేహ మలంకరించి, శ్రీ
కాంతయు వెంబడింపఁగ । కాంతుఁ దనూజను దెచ్చి రెల్లరున్;
"గంతుని మత్తదంతి" యని । కానుక లిచ్చిరి వేల్పు లంత, వా
క్కాంతను గూడి యచ్యుమర । కాంతలు పాటలఁ బాడి రాఘుచున్ 385

గీ. "రామభక్తియె యతులసా । మ్రాజ్య" మనుచు
మహతిఁ గొని నారదుఁడు పాడె । మాను లలర;
వైదిక ప్రక్రియారంభ । వైభవమునఁ
బెండ్లి దీపించె వెన్నుండు । వినుతు లిచ్చె. 386

గీ. పార్వతీపరమేశ్వరో । ద్వాహవైభ
వంబుఁ గాంచి మోదించిరి । ప్రమథవరులు;
దేవతాజయధ్వని మ్రోఁగె । దిక్తటముల!
జనులు హర్షింపఁ బుష్పవ । ర్షంబు గురిసె. 387

గీ. అంత హిమవంతుఁ డామోద । మతిశయిల్ల,
నమరు లానని వినుతింప । హైమవతికిఁ
జిత్త మిగుల రొత్త, దాసదా । సీ జనంబు,
హస్తి రథ వాజి సంచయం । బరణ మిచ్చె. 388

చ. ఇలఁ గలజీవకోటి నల । యించిన దైత్యులు తల్లడిల్ల, వే
ల్పులు గడు నుల్లసిల్ల, గిరి । పుత్త్రికఁ గూడి సుఖంపు మంచు? ని

ర్మలవ్యాదయుల్ తపోనిధులు । మానులుదీవనలిచ్చి మెచ్చి రా
చలిమలయల్లునిన్ మరునిఁ । జంపినమల్లుని వ్రదిభిల్లునిన్. 389

ఉ. పిమ్మట శైలరాజసతి । పెండ్లికొమారునిఁ జూచి "దేవ యీ
కొమ్మ నుమాగ్దుకమ్మనిఁక । గొమ్మ, శుభంబగుఁగాక, మాకు జ్ఞా
నమ్మొదయించుఁగ క"యని "నాయపరాధముఁబో్రవు"మంచుఁది
య్యమ్మగఁబల్కు, చెంతఁగల । హైమవతిందిలకించియిట్లనున్ 390

ఉ. తల్లి! సతీమతల్లి! విబు । ధ్రవక రావనకల్పవల్లి! ని
న్నెల్లలు సన్నుతింపఁ దపి । యించితివమ్మ, సమస్త దేవతా
తల్లజుఁ గొంటివమ్మ, నినుఁ । దక్క పరాంగనఁ జూడఁడమ్మ, నీ
వుల్లమునందు నీమగని । నొప్పరికింపకుమమ్మ యెన్నఁడున్. 391

గీ. అంతఁ జెలికత్తె లయ్యింతి । నభినుతించి,
పార్వతిం దెచ్చి ముక్కంటి । పజ్జ నిలిపి
రెల్లలున్ మెచ్చి దీవన । లిచ్చి రెలమిఁ;
బార్వతింగూడి వెడలె న । వ్వరుఁడు హరుఁడు. 392

ఉ. తోసము మేరమీఱ, నవ । తోయజపత్రవిశాలనేత్ర యు
ల్లాసముఁ జూప, మన్మథవి । లాసములన్ గరఁగించి శూలి కై
లాసమునన్ దదీయువను । లన్ విహరించి సుఖంచి, సంగర
శ్రీసము పేతు, నిత్యజ యు । శీలునిఁ గాంచెఁ గుమారు నొక్కనిన్

గీ. అక్కుమారుండు బల్లిదుం । డుక్కుముండు
తారకుని సంహరించి బృం । దారకులను
బ్రోచె, నెల్లలు రంజిల్లి । మొ్రక్కు లిడిరి;
జగము నిమ్ముంటటెం బయి । సంతసించె. 394

గీ. అనుచు నీరీతిఁ బల్కెవ । యాజ్ఞవల్క్య
నాభరద్వాజుఁ డా నని । యభినుతించె;

నంత నయ్యాజ్ఞవల్క్యుండు । సంతసించి
“అనఘ! యాలింపు” మని యుట్టు । లానతిచ్చె. 395

చ. హరునిచరిత్రమంబుధి, త । దంతముఁ జూడఁగలేవు వేదముల్;
నరుఁడు నుతింపఁ జాలునె? మ । నంబున నీవు సతంబు నమ్మహే
శ్వరువినుతింతు వక్కతన । జన్మము సార్థక మయ్యె నీకు; ధీ
వరుఁ డయి యీశ్వరుం గొలుచు । వానికిఁ జేకురు రామభక్తియున్

ఉ. శూలికిఁ దుల్యుఁ డెవ్వఁడు? వ । సుంధరఁ బుట్టినరాము నెన్నఁగాఁ
జాలిన వాఁ డతండ యని । చాటెద, రామచరిత్రతీర్థమున్
గ్రోలెద నెల్లభక్తులకుఁ । గ్రోలఁగ నిచ్చెద నాలకింపవో
మే లని సన్నుతింపవో య । మేయతపోధన మోక్షసాధనా.

గీ. కిన్నరులు పాడ దేవతల్ । సన్నుతింప
సిద్ధసాధ్యులు తనదు ప్ర । సిద్ధిఁ బొగడఁ
బార్వతిం గూడి కైలాస । పర్వతమునఁ
గాపురం బుండె నక్కాల । కంధరుండు. 398

గీ. ఎవఁడు హరిహరవిముఖుఁడో । యెవఁ డధర్మ
పరుఁడొ వాఁడు కైలాసప । ర్వతముఁ జూడఁ
జాలఁ డేనాటి కైన ని । స్సంశయముగ
సన్నుతాగణ్యపుణ్యా! ధీ । జనవరేణ్యా! 399

గీ. ఘనుఁడు కుందేందునీహార । గౌరదేహి,
నిర్మలాత్ముఁడు కరకంక । ణీకృతాహి
పీనవక్షస్స్థలుండు కౌ । పీనధారి;
విబుధవందితత్రిపురారి । వినుత శౌరి. 400

క. తరుణారుణాం । బురుహానిభ
చరణనఖద్యుతి వితతిని । సద్భక్తుల దు

స్త్ర మాయాతమసంబును
హరియించెడు జ్ఞానమూర్తి । హరుఁడు తలంపన్. 401

గీ. చంద్రమౌళి శరత్కాల । చంద్రముఖుఁడు
నీలకంఠుండు కైలాస । శైలవీధి
మలయమారుత మనిశంబు । మలయుచుండ,
వృక్షములనీడఁ దపముఁ గా । వించుచుండు. 402

పార్వతి యీశ్వరునితో రామునిఁగూర్చి ప్రసంగించుట.

గీ. అతని యనురాగముం గాంచి । యభినుతించి
మందహాసావృతాస్య యై । మందగమన
గిరిజ యొక్కనా డాతని । కేవనిల్చి
మధురవాక్కుల నిట్లనె । మానులలర. 403

ఉ. స్వామి! జగత్త్రయంబున భ । వన్మహిమంబు ప్రసిద్ధిఁగాంచె లో
కామయహ ర్త వౌదువు చ । రాచరముల్ వినుతించు చిత్కళా
ధాముఁడ వెల్లవేల్పులకుఁ । దండివి, జ్ఞానివి, యోగి వీవు, నీ
నామము కల్పభూరుహ మ । నందగు భక్తుల కాశ్రితావనా.

ఉ. వాసిఁ గలట్టివేలు పని । భవ్యతముం డని మానులెల్ల నీ
తాసముపేతుఁ డైనగుణ । ధాముని రాముని నెన్నుచుంద్రు; నీ
దాసిని, మూఢచిత్తను స । దాశివ! పామరకోటి ముక్తికిన్
గాసిలకుండ రాఘవుని । గాధ యగాధ మెఱుంగఁ జేయవే.

గీ. కల్పవృక్షంబు తనయింటఁ । గ్రాలుచుండ
ఘోరదారిద్ర్యబాధకుఁ । గుందినట్లు
బ్రహ్మమయుఁడు సర్వజ్ఞుండు । భర్త యయ్యు
జ్ఞానహీననై దురపిల్లఁ । జనునె నాకు. 406

గీ. రామునుగుణంబులఁ దలంచి । బ్రహ్మమనుచు
జ్ఞాను లగు మౌను లెల్లఱు । సన్నుతింతురు,
వేదశాస్త్రపురాణముల్ । వినతులిచ్చు
నలువ కీర్తించు వేనోళ్ళ । చిలువ పొగడు. 407

గీ. అయ్య దట్లుండె ననఘ కా । మారి నీవు
అనిశమున్ రామునామంబు । నాత్మయందుఁ
బ్రస్తుతించెద వారయ । రాఘవుండు
నిర్గుణబ్రహ్మ మన నౌనె? । నిటలనేత్ర ! 408

గీ. నిర్గుణబ్రహ్మ మెట్లగు । నృపసుతుండు?
స్త్రీవియోగంబు సహియింపఁ । జేవలేని
యతని మహిమాతిశయము నే । నరయఁ జాల
స్వాంతము మునింగె సందేహ । సాగరమున. 409

సీ. అంతట వ్యాపించి । నట్టి యీనిర్గుణ
బ్రహ్మంబు రామభూ । వరునికంటె
భిన్నంబుగా నున్నఁ । గ్రన్నన నెఱుఁగఁ జె
ప్పుము నాకు వినియెద । భుజగభూష!
అవివేకినికి నేటి । కని మిన్నకున్న నా
యజ్ఞాన మేరీతి । నంతరించు?
ఆనాడు వనమున । నారాఘవునిఁ జూచి
మిక్కిలి భీతిచే । మేను మఱచి

గీ. వచ్చితిని నొచ్చితిని, నిన్ను । మెచ్చుకొంటి;
దబ్బఱ వచించి నిక్కంబు । దాచిపుచ్చి
అనుభవించితిఁ దత్ఫలం । బాత్మయందు
జ్ఞాన ముదయింప కున్నది । జ్ఞానమూర్తి. 410

క. ఉన్నవి సందేహము లె
న్నెన్నో! సదసద్వివేక । హీనను దేవా!
సన్నుతిఁ గావించెద, నన్
మన్నించి వచింపు మతని । మహిమను విందున్. 411

సీ. అఘనిరాముని రాము । ధ్యానింప వాంఛింతు
నెన్నాళ్ళనుండియో । యిందుమౌళి!
పాపాత్మురాలను । నీపాదదాసినిఁ
ద్రికరణశుద్ధిగఁ । దెలుపవలయుఁ
దత్త్వవేదులు గూఢ । తత్త్వంబు నన్యుల
కుపదేశముం జేయ । కున్నవారె?
బ్రహ్మజ్ఞ నిర్గుణ । బ్రహ్మంబు సగుణమై
యవనిపై నేరీతి । నవతరించు?
గీ. నఖిల భువనంబులకు నొజ్జ । వగుదు వనఘ!
ఈ వెలుంగనియంత యిం । కెందుఁ గలదు?
మాయఁ దొలఁగింపఁ జేయురా । మాయణంబు
నానతిచ్చిన వినియెద । నీనులార! 412

గీ. జ్ఞాన వైరాగ్య భక్తుల । సంగ్రహించి
రాముని భజించు భక్తుఁడ । వోమహాత్మ!
వేదములయందు నీకీర్తి । విస్తరించె
నిన్ను వినుతింపఁ జాలునె । నీచజీవి! 413

చ. అనవుడు నాలకించి నిట । లాక్షుఁడు మిక్కిలి సంతసించె; నా
తనిహృదయంబు రామచరి । తం బను నంబుధి నీఁదులాడఁగన్
గనుఁగవ బాష్పజాలమున । గ్రాలె మెయిన్ బులకల్ రహించె నె
మ్మనమున రాముర్యాపు విను । మానముగన్ గనుపట్టె నత్తఱిన్

గీ. స్వాంతమున సంతసించుచుఁ । గొంతదనుక
నుపన్యసన్నుఁ డై రాముని । సుప్రసిద్ధ
మహిమ ధ్యానించి రమ్యరా । మాయణంబు
నింపు నింపుచు నిట్లు వ । ర్ణింపఁ దొడఁగె. 415

శివోపదేశము.

గీ. సత్త్వసత్త్వగ నెంచు న । జ్ఞాని యకట!
త్రాడు పామనువిభ్రాంతిఁ । దల్లడిల్లు
జ్ఞాని కీప్రపంచము మిథ్య; । జాగరితకు
స్వప్న విభ్రాంతి యుండునే । జలరుహాక్షి? 416

గీ. పార్వతీ! నిన్నుఁ బోలిన । వారు గలరె?
అఖిలలోకోపకారార్థ । మడిగె దీవు;
రమ్యగంగానదింబోలు । రాముగాథ
మూడు జగములవారికి । మోక్ష మిచ్చు. 417

సీ. దనుజారిచరితంబు । విన లేని వీనులు
వీనులే? యవి సర్ప । బిలము లతివ!
సజ్జనులం జూడఁ । జాలని కన్నులు
కన్నులే! యవి నెమ్మి । కన్ను లువిద!
భక్తులకున్ మ్రొక్కఁ । బడని శిరంబు శి
రం బౌనె? తుంభీఫ । లంబ వనిత!
శౌరిని ధ్యానింపఁ । జాలని భావంబు
భావంబె! జీవచ్ఛ । వంబ మగువ!

గీ. జానకీరాము వినుతింప । రాని జిహ్వ
జిహ్వయే? యది మండూక । జిహ్వ గిరిజ!

దేవతలఁ బ్రోచు దనుజుల । నేవగించు,
నతని యవతారము నుతింప । నలవి యగునె? 418

గీ. రాము సత్కథా కరతాళ । రావములను
వినినఁ బరువిడు సందేహ । మను ఖగంబు,
రామసత్కథా పరశుధా । రలకు నకట
నిలువఁ జాలునె యెంతైనఁ । గలికుజంబు. 419

ఉ. రామ! సతీలలామ! విను । రాముఁ డనంతుఁ డనంగ నొప్పుఁ, ద
న్నామ చరిత్ర, జన్మ, సుగు । ణంబుల నెన్నఁగ లేవు వేదముల్
నామది నున్న రామజన । నాథుని గాథఁ గథించువాఁడ, మ
ర్త్యామర మౌని చంద్రులకు । నైన నెఱుంగఁగ రాని దారయన్

క. శ్రుతులకుఁ బొగడం దగినది
యతులకు ధ్యానింపఁ దగిన । దనఘుం బాద్యం
బతులం బప్పరతత్వం
బతివా! శ్రీరాముకంటె । నన్యం బగునే? 421

క. పలుకం దగ దన్యం బని
పలికిన వినరాదు, విన్నఁ । బాపండుఁ డగున్;
గలికీ! హరిపదవిముఖుఁడు
తెలియునె సదసద్వివేక । దివ్యపథంబున్. 422

ఉ. జ్ఞానము లేనివాఁడు సద । సత్తు లెఱుంగనివాఁడు, శాస్త్రదృక్
హీనుఁడు గాన నంధుఁ డగు । నెంతయు, దుర్విషయాగ్నితప్తత
న్మానసదర్పణంబునను । నైల్యము నెక్కొని మంచిచెడ్డలన్
గానఁగ నీదు, మత్తగజ । గామిని! నీకు నెఱుంగఁ, జెప్పితిన్. 423

క. కుటిలుఁడు, గపటియు, స్త్రీలం
పటుఁడును, శ్రుతిగర్హితపథ । వర్తను లైరో

కుటిలాలక! సత్సభలన్
కటకట వీక్షింపలేరు । కలలో నైనన్. 424

గీ. వేదమును విశ్వసింపరు । వీస మైన,
నాత్మలాభనష్టంబుల । నరయఁ బోరు,
పండితుల మైత్రి నుంతయుఁ । బడయ లేరు,
వారు శ్రీరాము వీక్షించు । వారె? యబల! 425

గీ. సగుణ నిర్గుణములఁ గూర్చి । చర్చ లేక,
వివిధ హేతులఁ గల్పించి । ప్రేలుచుంద్రు,
విష్ణు మాయావశంబున । వెలయు సృష్టి
ఎంత చెప్పిన వారు గ్ర । హింప లేరు. 426

గీ. సన్నిపాతవశుం డైన । జనుఁడు లోన
మంచిచెడ్డల నరయక । మాటలాడు;
మోహమదిరను గ్రోలిన । మూఢమతికిఁ
దెలివి యిట్టిద యంచు బో । ధింపనగునె? 427

క. హృదయంబున శ్రీరాముని
సదయుని భావింపు మిఁక । సంశయ మణఁగున్;
ముదితా! శంకాతమమును
విదళించెద నాదువాక్య । విమలార్కఘృణిన్. 428

ఉ. ఆదరణ వొంది యీసగుణ । మాకృతిఁ గైకొను భక్తకోటి పై
నాదటఁ బూని; నిర్గుణ మ । నాకృతిఁ గ్రాలుఁ దలంప రెంటికిన్
భేదము గానరా దని, వి । వేకుల మానుల వాద ముండఁగా
వేదములున్ బురాణములు । విశ్రుతశాస్త్రములున్ వచించెడున్.

క. తగ నిర్గుణ మొగి సగుణం
బగునా యను వాద మేటి । కంబువు మంచో

పగిది నెఱుంగరో? యోహో!
మగువా! మోహంబుడిగిన । మానస మెఱుఁగున్. 430

క. ఎవ్వని నామము రవియై
దవ్వుగ వ్యామోహనామ । తమసముఁ దోలున్,
బువ్వారుబోఁణి నమ్మిక
నవ్వానిని బ్రహ్మ మంచు । నరయుము మదిలో. 431

గీ. సచ్చిదానందరూపంబు । సహజకాంతిఁ
గలది, యయ్యది శ్రీరాముఁ । గలసెఁ జూవె;
అతనిఁ గొలిచిన నేనాటి । కైనఁ గాని
జ్ఞాన మావిర్భవించు, మో । క్షము లభించు. 432

గీ. శైలతనయ! యజ్ఞాన వి । జ్ఞానములును,
కామ మోహ లోభా ద్యహం । కారములును
సహజములు జీవకోటికి; । సకలమునను
రాముఁడు రహించుఁ బో పర । బ్రహ్మ మనఁగ. 433

గీ. సాంఖ్య మను నుప్రసిద్ధ శా । స్త్రమునఁ బొల్చు
పురుషుఁడే, నిర్మలజ్ఞాన । మూర్తి యైన
రామచంద్రుం డ, తండె మా । యామయుండు,
జీవనాధారుఁ డఖిల లో । కావనుండు. 434

ఉ. జ్ఞానము లేని పూరుషుని । స్వాంతము భ్రాంతికిఁ దల్లడిల్లుఁ, బ్ర
జ్ఞానిధి కానివాఁడు ప్రభు । నంగతికిన్ విముఖత్వ మొందు నో
మానిని! మానవుం డెఱుక । మాలి, దివిన్, జలదాంతరస్థునిన్
భానుని, లోఁ దలంచుఁ గద । పశ్చిమవారిధిఁ గ్రుంకినట్లుగన్.

ఉ. బాలుఁడు కంటితెప్పవయి । బాగుగ ద్రోలిడి నొక్కి చూచినన్
హాళిగఁ జంద్రుఁ డొక్కఁడుఁడ । యుండియు రెండుగఁ దోచు కైవడిన్

ధూళినిఁ జీకటిన్ మఱియు । ధూమమునన్ దివి, పెక్కురూపులన్
గ్రాలినరీతి, బ్రహ్మమయ । రాముఁడు దోఁచు ననేక లీలలన్.

గీ. అధిక తాపత్రయావృతుఁ । డైనయట్లు
పైకిఁ గన్పట్టుఁ గాక, సు । శ్లోకుఁ డతఁడు
శుద్ధబుద్ధుండు విజ్ఞాన । బద్ధుఁ డతుల
సచ్చిదానందమయమూర్తి । స్వచ్ఛకీర్తి. 437

గీ. విషయదశకంబు, శబ్దాది । విషయములును,
జీవరాశులు, వెండియు । దేవతలును,
చెలఁగిఁ మెలఁగి చైతన్య వి । శిష్టములగు,
రామచంద్రుని కరుణచే । రమణి! వినుము. 438

క. రజతంబు శుక్తియందు, స
హజముగ నున్నట్లు దోఁచు । నట్లాతపమం
దు జలము భాసిలు, నయ్యది
నిజ మగునే భ్రాంతిగాక । నీరజ నేత్రా! 439

క. భగవంతుని ప్రాపున నీ
జగమంతయుఁ దోఁచుఁగాక । సత్యం బగునే?
మగువా! విను మీ మిథ్యా
జగతిని దుఃఖంబు దోఁచు । శాశ్వత మనఁగన్. 440

క. తల తునిసిన చందంబునఁ
గల కని దుఃఖించి మేలు । కాంచి నిజంబున్
దెలిసిన గతి, నీజగతిన్
గల కల్ల నెఱుంగవచ్చు । జ్ఞానమువలనన్ 441

క. ఆద్యంతశూన్యుఁ డనుచును
హృద్యంబుగ వేదబుక్కు । లెవని నుతించున్

సద్యంబ వానిఁ గొలిచిన
వేద్యం బగు సృష్టిలోని । విషయములబలా! 442

సీ. అడుగులు లేకయే । పడఁతిరో! యెవ్వాఁడు
పుడమిపై వడివడి । నడువఁ జాలు,
వీనులు లేకయే । వెలఁదిరో! యెవ్వాఁడు
తెన్నగా సకల మా । లింపఁ జాలుఁ
జేతులు లేకయే । నాఁతిరో! యెవ్వాఁడు
వివిధ కర్మములఁ గా । వింపఁ జాలు
నాస్యంబు లేకయే । యతివరో! యెవ్వాఁడు
చెలఁగి సర్వంబు భ । క్షింపఁ జాలు

గీ. నాల్క లేకున్న నెవ్వాఁడు । పల్కఁ జాలుఁ
జూడ్కి లేకున్న నెవ్వాఁడు । చూడఁ జాలు
మేను లేకున్న నెవ్వాఁడు । మెదలఁ జాలు
నట్టి శ్రీరాము నెవ్వాఁడు । నరయ లేడు. 443

క. ధ్యేయుఁడు బుధులకు, శ్రుతులకు
జ్ఞేయుఁడు, యోగులకుఁ గీర్త । నీయుఁడు, మునిరా
డ్గేయుఁడు సర్వనుపర్వా
మేయుఁడు, రాముండు, వేల్పు । మేటరి; మెలఁతా! 444

గీ. ఎవని నామబలంబున । నేను, వార
ణాసిలో శరీరంబును । బాసినట్టి
జీవికిఁ మోక్షముం జెందఁ । జేయుచుంటి
నతఁడు నాస్వామి శ్రీరాముఁ । డంబుజాక్షి ! 445

క. ఎఱుఁగక స్పృశించినంతనె
చుఱచుఱ ననలంబు కాల్చు । చొప్పున మనుజుం

డఱమరికనేని రాముఁ
దెఱవా! తలఁచిన నఘంబు । ద్రెళ్ళక యున్నే? 446

క. సందేహ భంజనుం డగు,
నిందుధరుం డాడు పలుకు । లెల్లను విని య
య్యిందీవరాక్షి మదిలో
నిందీవరగాత్రుఁ గొల్చి । యిట్లను నెలమిన్. 447

క. "నాథా! కరుణను నీ వు
ద్బోధించినయంత నాదు । మోహము తొలఁగెన్;
శ్రీధవుని రాముఁ దెలిసితి
బాధం దొలఁగించుకొంటిఁ । బ్రజ్ఞం గంటిన్. 448

గీ. నన్ను నీపాదదాసిగ । నెన్నుకొనుము,
స్త్రీస్వభావంబు జడ మని । తెలియవచ్చెఁ;
జిన్న సందియం బున్నది । చిన్మయాత్మ!
శాంతము వహించి యెఱిఁగింప । సన్నుతింతు. 449

క. సర్వవ్యాపకుఁ డనఁగను
సర్వాంతర్యామి యనఁగ । సర్వజ్ఞుఁ డనన్
శర్వా! నుతిఁగొను రాముం
డుర్విన్ నరుఁబోలి పుట్ట । నొప్పున చెపుమా!" 450

క. అనవుడు శివుఁ డాపెం గని
"వనితా నీసందియంబు । వారింపఁగ లే
రనఘాత్ము లైన మునులున్
ఘనులున్ బ్రహ్మాదిపుణ్య । ఖనులున్, వినుమా! 451

ఉ. రామచరిత్ర మానసము । రమ్యతరంబు, పవిత్రవంత మా
కామిని! తచ్చరిత్రమును । కాకభుశుండి వచింప, మోక్షుల

త్స్వమహిమాశయుండు ఖగ । శేఖరుఁ డాదట నాలకించె; శ్రీ
రాముఁ డనంగఁ గేవలము । రాజని యెంచకు మిన్నిభంగులన్

గీ. వారలిరువురి సంవాద । వైభవంబుఁ
దరుణ మిదిగాదు నిగదింపఁ । దరుణి! మున్ను
దాశరథ్యవతార క । థావిధాన
మాలకింపుము సందేహ । మంతరించు. 453

గీ. "భగవదవతార మేల సం । ప్రాప్త మయ్యె;"
ననిన నాబోటి కోబోటి । యరయరాదు;
నే నెఱింగినయంత వ । ర్ణించువాఁడ;
నెట్టిదో హేతు వీవ యూ । హింపఁ దగును. 454

చ. దనుజు లధర్మకర్మపర । తంత్రులు; ధర్మముఁ గప్పిపుచ్చి, స
జ్జనులను సాధులన్ మునుల । భూసురులన్ సురలన్ నిరంతరం
బును నిరసించి దుఃఖములఁ । బొందఁగఁ జేసెద రట్టివేళఁ బా
వనుఁడు ధరావనుండు భగ । వంతుఁడు వారల సంహరింపఁగన్.

గీ. అవని నరరూపముం దాల్చి । యవతరించి
ఆశ్రితులఁ బ్రోచి, వేదమ । ర్యాద నిల్పి
మోద మిగురొత్త ధర్మంబుఁ । బాదుకొల్పుఁ,
దరుణి! యిట్టిదే రామావ । తార మనఁగ. 456

చ. జయ విజయుల్ హరింగొలువఁ । జాలిన భక్తులు, ద్వారపాలకుల్
ప్రయతులు దారమానసులు; । బ్రాహ్మణశాపము కారణంబునన్
భయద తమోవికార గుణ । భార నికృష్టశరీరు లై, కుశే
శయనయనా! ధరిత్రి దను । జత్వముఁ గాంచి తపించి రెంతయున్.

గీ. కనకకశిపువు, కనకాక్షుఁ, । డనఁగ నిరువు
రింద్రపదమును దొలఁగించి । యేపుఁ గాంచి,

మెల్లమెల్లఁగ, నుల్లముల్ । తల్లడిల్ల
నెల్లఱ జయించి, జగములఁ । గొల్లఁ గొనిరి. 458

గీ. ధర వరాహ నృసింహావ । తారములను
దాల్చి శ్రీహరి వారలఁ । గూల్చి, చీల్చి,
ఘనునిఁ బ్రహ్లాదు నాహ్లాదుఁ । గా నొనర్చె;
వారు వెండియు నొండుక । ల్పమునఁ జెలఁగి. 459

క. జగ మెంతయు భీతిం జెం
దఁగ రావణ కుంభకర్ణ । నామంబులతోఁ
బగఁ బూని సురలఁ గెలిచిరి;
భగవంతుం డవతరించి । వారలఁ దునిమెన్. 460

ఉ. "మూఁడవపుట్టుకన్ దనుజ । పుంగవు లిర్వురు శ్రీనివాసుచే
నోడిన మోక్షముం బడయ । నోపుదురన్ మునివాక్య మెంచి పో
రాడి వధించి వారలకు । నాదట మోక్ష మొసంగి భూస్థలిన్
బాడఱు పాడిఁ బాదుకొలు । పన్ హరి వెండియు రూపుఁ గైకొనన్

క. ఇది యిట్లుండఁగఁ దెలిపెద
విదితంబుగ రాముగాథ । విబుధులు జ్ఞానా
భ్యుదయప్రద మని యందురు
ముదితా! విను వీనులార । ముచ్చట దీఱన్. 462

క. శ్రీసహితుఁ డదితికశ్యపు
లాసింపఁగఁ బుత్త్రుఁ డయ్యె; । నా దంపతులే
కౌసల్యా దశరథు లై
శాసించిరి ధర్మపథము । సాకేతమునన్. 463

క. మును పొకయుగమున భీకర
దనుజుండు జలంధరుండు । దైత్యాధిపుఁ డై

తనదోర్బలమున నమరుల
ననిలోన జయించి యింద్రు । వడలం గొట్టెన్. 464

గీ. కంధర సమాన దేహుండు, । క్ష్మాధ్రిశిఖర
కంధరుండు, భూరమణీ భ । గందరుండు,
రణకలా పరిభూత పు । రందరుండు,
అల జలంధరుఁ డరిహంస । జలధరుండు. 465

గీ. అతివ! యతిపతివ్రత చూవె । యతనిభార్య
అకృతకంబునఁ ద్రిపురాసు । రారి నయ్యు
వానితోఁ బోరి యోడితి । భండనమున;
గాండిశీకుఁ డై పఱచెఁ బు । రందరుండు. 466

శా. ఏతన్మాత్రుఁడె రాక్షసుండు? తరుణీ! । యిందీవరశ్యాముఁ డే
రీతిన్ వీని వధింపవచ్చు నని లో । దృష్టించి తన్మానినీ
పాతివ్రత్యముఁ గొల్లలాడి యతనిన్ । వంచించి ఖండించె; నీ
చేఁతం గాంచి ముకుందు నానతి శపిం । చెన్ దైత్యు లగ్గింపఁగన్

గీ. బృంద శపియించి నంతనే । కుందకుండ
మంచి దని శౌరి యంగీక । రించెఁ జూవె;
ఉవిద! యాదైత్యుఁ డింకొక । యుగమునందు
నసురవిభుఁ డయి జన్మించి । యతిశయించె. 468

గీ. అంబుజాక్షుండు పృథ్విపై । నవతరించి
వాని వధియించి యపవర్గ । ఫల మొసంగెఁ;
బూర్వ మొకనాడు నారద । మునివరుండు
నలిగి శపియింప వెండియు । నవతరించె". 469

చ. అనవుడు శైలపుత్త్రి యలి । కాక్షునిఁ జూచి "మహానుభావ యు
మ్మునివరుఁ డైన నారదుఁడు । మూర్ఖుఁడె? భక్తవరుండు జ్ఞానిపా

వనుఁడు పరిశాంతమూర్తి భగవంతుఁడొనర్చినదోసమేమియా
తని మునివర్యుఁ డేటికి వృథా శపియించె? నెఱుంగఁజెప్పవే!

గీ. అనిన నించుక హసియించి యభవుఁ డనియె;
"జ్ఞాని లేఁడు మూర్ఖుం డెందుఁ గానరాఁడు
అనఘుఁ డా రాముఁ డేరీతి నాత్మఁ దలఁచు
నట్లు ఘటియిల్లు నంభోరుహాయతాక్షి. 471

మ. హిమికాహార్య గుహాసమీపతలమం దేపారు గంగన్ దదా
శ్రమసౌందర్యముఁ జూచి లో నలరి విజ్ఞానంబు దీపింప సం
యమివర్యుం డగు నారదుండు భగవద్ధ్యానంబునం దుండ దు
ర్భ్రమచే నింద్రుఁడు పంచెఁ గామునిఁ దపోభంగంబుఁ గావింపగన్

క. ఇంద్రుఁడు తనపదవిని ముని
చంద్రుఁడు హరియించు నంచు సందేహించెన్;
ఇంద్రియసుఖలాలసుఁ డో
చంద్రానన! కాకమట్లు జంకుచు నుండున్. 473

క. తనకుం జిక్కిన యెమ్ముక
గనినంతనె బొబ్బ మెకము గైకొను నంచున్
శునకము పరువిడు వడువున,
ననఘున్ మునిఁ జూచి యింద్రుఁ డనుమానించెన్. 474

చ. అలరులఁ బూని వృక్షనిచయంబు కడుం గడుఁ గ్రాలె, బంభరం
బులు మధుపంబులై సకల పుష్పరసంబులఁ గ్రోలి సోలెఁ, గో
కిలముల పంచమధ్వనులు కీరరవంబుల మేళవించె; వే
ల్పులయెకిమీఁడు నారదుని పొంతకుఁ గంతునిఁ బంచినంతనే.

గీ. అచ్చరల యాటపాటల నాలకించి
మెచ్చుకొని శారికలు వెండి యుచ్చరించె;

రాగ మిగురొత్తఁ గామాగ్ని । ప్రజ్వలింప
మలయమారుత మేతెంచె । మందగతిని. 476

గీ. సమపదుం డయినిల్చి, సం । యమిని బిల్చి
కొక్కు పెంపెక్కఁ జెలఁగు ది । క్కెక్కు వెట్టి
అలరుటమ్మెసె నాలీఢుఁ । డై మరుండు;
జాతిప్రతిమకు గిలిగింత । రీతిఁ దోఁప. 477

గీ. కొక్కు చెమరదు, నెమ్మను । చొక్కసోల
దక్కటక్కట! జడదారి । యట్ల యుండె;
నంగజుఁడు వ్యర్థ మని, శృంగ । భంగ మయ్యె
నఘుచు నమ్మానికిన్ మ్రొక్కి । యభినుతించె. 478

గీ. స్మరుని వినుతికి మాని ప్ర । సన్నుఁ డగుచు
నల్పముగ నవ్వి పొమ్మని । యానతిచ్చె
బ్రదుకుజీవుఁడ యంచు న । ప్పంచశరుఁడు
హారికి నెఱిఁగించె నెల్లఱు । నభినుతింప. 479

ఉ. మాయ నతిక్రమించితి ని । మన్మథు గెల్చితి ధిక్కరించితిన్
నాయది గాక ప్రజ్ఞయని । నారదుఁ డాత్మ నహంకరించి, యో
హో యని లేచి చిత్త మిగు । రొత్తఁగ వీణియ మేళవించి నా
రాయణ శ్రీనివాస యని । యాడుచుఁ బాడుచుఁ బోయె నత్తఱిన్

గీ. త్రోవ ననుఁ జూచి యమ్మౌని । తోయజాక్షు
నతిశయ మణంచితి మహాత్మ! । యని వచించి
నంత మేలుమే లని వాని । నభినుతించి
"వెన్నునకుఁ జెప్పు" మని యంటి । వికటముగను. 481

క. అకటా వికటంబుగ నే
నకటా! వచియింప మాసి । యా నని వడి నా

టక్కటాంకరి వెన్నుఁడు గల
నికటంబున కేగఁ జూవె । నీరజనేత్రా ! 482

మ. చని వైకుంఠునిఁ జూచి కాముని కడన్ । సర్వంబు వాక్రుచ్చినన్
విని యాతం డిసుమంత నవ్వి యిటులన్ । విభ్రాంతులన్ లోఁగొనన్
దనకుం జెల్లినఁ జెల్లుఁ గాక మునిచం । ద్రా! నిన్ను ధర్షింపఁగా
మానకున్ శక్యమె ! బ్రహ్మచారి వనుచున్ । బొంగించె నగ్గించుచున్

గీ. ఆశ్రితున కంకురించిన । యతిశయంబు
సంహరింప సంకల్పించె । జలజనేత్రుఁ
డాత్మ నుప్పొంగి భగవంతు । నభినుతించి
ఎలమి జడదారి తనదారి । నేగుచుండె. 484

గీ. వీణియం బూని జలజాక్షు । వీడుకొల్పి
మౌనివరుఁ డేగుచుండంగ । మార్గమునను
నయనపర్వంబుగాఁ బత్తె । నం బొకండు
గోచరించె భూలోక వై । కుంఠ మనఁగ. 485

విశ్వమోహిని స్వయంవరము

ఉ. అత్తఱి నారదుండు నయ । నాంబుజముల్ వికసింపఁజేసి త
త్పత్తనభర్మహర్మ్యముల । వైఖరిఁ గాంచి రతిన్‌జయించు న
న్మత్తగజేంద్రగామినుల । మాటికి మాటికిఁ జూచి రూపునన్
చిత్తజులైన తత్పురుష । సింహములన్ బరికించి మ్రాన్పడెన్.

చ. బలమున వాయువై యతుల । వైభవయుక్తి సురేంద్రుఁడై తనూ
విలసనమందు మారుఁడయి । విద్యలకున్ విధియై కళోన్నతిన్
నెలయయి కాంతినర్కుఁడయి । నీతి బృహస్పతియై యశస్వియై
అలరెడువాఁడు శీలనిధి ' యన్ నృపశేఖరుఁ డేలుఁ దత్పురిన్. 487

క. విశ్వవిమోహిని నంగజు
నశ్వమునా నొప్పు కన్నె । నాతఁడు గనియెన్
విశ్వేశ్వరి! చూపెకునై
విశ్వమున స్వయంవరంబు । వెల్లడిఁ జేసెన్. 488

గీ. నేల యీనిన యట్లు భూ । పాలవరులు
వచ్చి యవై్వభవముఁ జూచి । మెచ్చుకొనిరి
అంత మునివర్యుఁ డవ్వార్త । నాలకించి
రాజవరుఁ జూచి యాతని । పూజలందె. 489

ఉ. ఆ నృపుఁడంత "నాదుగృహ।మంతయు, బావనమయ్యె దేవ ప్ర
జ్ఞానిధి పీవెఱుంగని పని । సంగము లుండవు నాదుకూతురీ
మానిని యబ్జసంభవుని । మానస పుత్రిఁడ పీమెఁజూచి మా
కానతి యీయు నోవవె గు । ణావగుణంబుల నెల్లభంగులన్.

చ. అన విని రాజుఁ జూచి యజు । నాత్మజుఁడా లలితాంగి యందమున్
గనులఁజెదర్పనీయక యె । గాదిగఁగాంచి మనోహరాంగి యు
వ్వనరుహావతినేత్రయని । పల్కి యెదన్ విచలించి "యీమెన
న్నెనయకయున్న నాదు తను । వేటికి భూమికి భారమౌఁగదా.

క. స్నానంబ! యేటికరుగుము
ధ్యానంబా! యటవి కేగు । మకటా చాలున్
మానంబ! మూకుఁ జేకుము
జ్ఞానంబా! యీపెఁ గూడ । శంకింపకుమా. 492

గీ. నృపకుమారిక నన్ను వ । రించుఁ గాక;
చాలు జపమేల! తపమేల! । జ్ఞానమేల!
కాంత ననుఁగూడ కున్న నీ । కాయమేల!
నరవరతి నేలఁ జాలిన । స్వర్గ మేల! 493

క. బాలన్, హారినీలాలక
జాలన్, సుకనాలవాల, సన్నుతశీలన్,
లీలన్, నవమృగమదజం
బాలన్, రతినేలకున్న బ్రిదుకం జాలన్. 494

ఉ. చక్కనిచుక్కలైన నెఱజాణలకున్ దలమానికంబుగా
నక్కట ఖ్యాతికెక్కిన లతాంగిని రంభను జూచియుండనా?
ఇక్కనకాంగిఁ బోలఁగల దే? భళిరా ధృతిఁదక్క ఢిక్కితిన్
గ్రుక్కన మచ్చికంటి కడకంటికి నావెడవింటి కిత్తితిన్. 495

క. అని యివ్విధిఁ బొక్కుచున
మ్మునివర్యుఁడు నారదుండు భూపాలుని వీ
డ్కొని తత్స్వయంవరమునకు
జనపాలురు రాకమున్నె చయ్యనఁ జనియెన్. 496

క. ఇలఁ గల భూవరు లెల్లను
జలజాక్షినిఁ బెండ్లియాడఁ జనుదెంచిరి, క
ల్వలరాజులో, వలరాజులో
తలపోయఁగఁ జాలమంచుఁ దురుణులు వొగడన్. 497

క. తిలకంబుఁ దీర్చెనొక్కఁడు
కలకాలము యౌవనంబు కాలు ననంగన్;
దిలకిని తిలకింపఁగఁ దా
వలపింపఁగ సాటిలేని వలపులు నిగుడన్. 498

క. కొమ్మల్ తిరిగిన వీరుఁడఁ
గొమ్మా! నను గూడి ముద్దుఁ గొమ్మా ముద్దుం
గుమ్మా! యనునట్టుల మీ
సమ్ముల నొకభూవరుండు చక్కఁగఁ ద్రిప్పెన్. 499

క. ఈరీతి రాజులెల్లఱు
గారాబము మోములందుఁ । గన్పట్టఁగ శృం
గారములం బ్రకటించిరి;
నారదు వీక్షింప వచ్చె । నారాయణుఁడున్. 500

గీ. కపట నృపవేష ధారియై । కమలనాభుఁ
డచ్చటికి వచ్చెఁ దనుమెచ్చ । మచ్చికంటి;
అతని మాయా వశంబున । నమ్మునీంద్రు
మోము వానర ముఖమును । బోలి యుండె. 501

గీ. నారదుండాత్మఁ జక్కఁద । నంబుఁ గలిగి
యున్నరీతిని భావించుఁ; । గన్నెమిన్న
తన్ను వరియించు నని పజ్జ । నున్న భూమి
వరునితోఁ గానముంగూర్చి । పలుకుచుండు. 502

క. ఒకపరి వీణెం జేకొను,
నొకపరి సంగీత శాస్త్ర । మొప్పగఁ జెప్పున్,
ఒకపరి కన్నెం గనుఁగొను,
బకపక మని తన్నుఁ జూచి । వనితలు నవ్వన్. 503

క. తనచక్కఁ దనముఁ గనుఁగొని
వనితామణి మెచ్చుననుచు । భావించుమదిన్,
దనమోము చొప్పెఱుంగడు;
వనజాక్షుని మాయ నెఱుఁగ । వచ్చునె చెపుమా? 504

క. కాంతామణి, రతికాంతుని
చింతామణి యేఁగుదెంచె । క్షితిపులఁ గాంచెన్,
వంతఁగొన మునిఁగని, శ్రీ
కాంతుని వరియించి మాలఁ । గ్రక్కున వైచెన్. 505

నారదుఁడు ప్రమథుల శపియించుట

గీ. ప్రమథులిరువురు నారదు । పజ్జ కరిగి
అద్దమును దెచ్చి తిలకింపుఁ । డనుచు నవ్వ
రంత మునివర్యుఁ డీక్షించె । నాగ్రహించెఁ
గనుల రేకెత్తెఁ గెంజాయ । యనల మనఁగ. 506

చ. "ఇరువురుఁ గ్రూరులార! కప । టేంగితు లెంతకులేరు? సన్మునీ
శ్వరులపహాసపాత్రులె? ని । శాచరులై భువిఁ బుట్టు డంచుని
ష్ఠురుణ శపించి వెండియు మొ । గంబు జలంబునఁ జూచి నారదుం
డరమర లో జనింపఁగమ । లాక్షుని సన్నిధి కేగ నత్తఱిన్. 507

ఉ. "శ్రీపతి యిట్లు మాయఁబచ । రింపఁగ హేతువెఱుంగరాదె! సం
తాపము మేరమీరె; నిఁకఁ । దాళుదునొక్కొ? శపించువాఁడ, లే
దాపడిచచ్చువాఁడ, నక । టా యవమానము నోర్వవచ్చునే?
కోపము హెచ్చె నంచు ముని । గొబ్బునఁబోయె వికుంఠసీమకున్.

ఉ. విచ్చిన తమ్మిపూవులన । విశ్వవిమోహినితోడ, లచ్చితో
నచ్చటఁ గొల్చియున్న జల । జాక్షుఁడు మచ్చరమూని చెచ్చెరన్
వచ్చినమౌనిఁజూచి, "ముని । వర్య! కలంగిన చిత్తవృత్తితో
నెచ్చటికేగెదీ"వనిన । హెచ్చిన కిన్క మునీంద్రుఁడిట్లనున్.

నారదుండు శ్రీవిష్ణువును దూషించుట

ఉ. "హాలహాలంబు శంభునకు । స్వార్థపరుండ వొసంగితీవు, తో
ల్వేలుపుమూకకున్ మదిరఁ । బెట్టితి వెంతటివాఁడవౌర! ల
క్ష్మీలలితాంగిఁ, గౌస్తుభముఁ । జేకొనివచ్చి, నటించెదీజగం
బేలుచునున్నయట్లు, కప । టేంగితమున్ విడనాడ వెన్నఁడున్.

క. గడిదేఱిన గడిదొంగవు,
జడదారులు నిన్నుఁ గొల్చి । జడులైరి గదా;

గడుసరి వెంతయుఁ గూటిలుఁడ
వెడఁదన్ నిను విశ్వసించి । మొసఁడు రహించున్. 511

క. చేతోవీధిం దలఁచిన
చేఁతల వెనుదీయకీవు । చేసెద వెటులేన్;
స్వాతంత్ర్యముఁ గలవాఁడవు
నీతలఁ పెవ్వాఁడెఱుంగ । నేర్చును శౌరీ! 512

క. శొంకవు జంకవు భళిరా
శంకాతంకములు లేక । చరియించెదవో!
రంకాలకున్ బొంకులకున్
బొంకంబుగ నూఁదు నీదు । బుద్ధి తలంపన్. 513

క. సాధ్యుండవు గావెరికి,
బాధ్యుండవు గావు కర్మ । పక్కికి, లోకా
రాధ్యుండవె! శాపాయుధ
వధ్యుండవు గాక నీవు । పంకజనేత్రా! 514

మ. నను వంచించిన యట్టిరూపమున జ । న్మంబొందు, మేనాత్మఁగో
రిన కాంతన్ హరియించితీవు, వినుమా । రీతిన్ మఱొక్కండు నీ
కనకాంగింగొను; నన్ను వానరముఖుం । గావించితీవున్ భువిన్
వనిలో వానరసఖ్యముం బడయుమో । పద్మాక్షు! యింతేటికిన్.

మ. సరసీజోద్భవపుత్త్రుఁడిట్లు కినుకన్ । శాపింపఁ, గోపింపకా
హరి యానావనిశాపముంగొని, ప్రస । న్నాంభోజవక్త్రంబునన్
దరహాసాంకురముల్ నటింప, "మునిచం । ద్రా! యింక శాంతింపు, మ
త్పరిహాసంబున" కంచు మాయఁ దొలఁగిం । పం జేసె నొక్కుమ్మడిన్

గీ. మాయ తొలఁగిన యంతనే । మౌనివరుఁడు
మబ్బుఁ బాసిన భానుని । పోడ్కిఁ గ్రాలె;

నంత నక్కాంత లిరువురు । నంతరింప
నక్కజముఁ బొంది శ్రీహరి । నభినుతించె. 517

క. "రక్షింపుము మాధుఁడ, నను
శిక్షింపుము, నీదు మాయఁ । జిక్కితిఁ, గరుణన్
వీక్షింపుము, శ్రీనరహ
ర్యక్షా! ఘణదక్ష! భక్త । రక్షాదీక్షా! 518

క. కోపించితి, నెంతయు సం
తాపించితి, నేఁడు నీదు । తల నిందల నా
రోపించితి, మాయాంధుఁడ
శాపించితి నిన్ను, నన్ను । సాఁకం దగునే!" 519

క. అని ముని వినుతించుచుఁ బ
ల్కినపల్కుల నాలకించి, । క్లేశము తొలఁగన్
వనజాక్షుఁడు, దరహాసము
తన మోమునఁ జిందులాడ । దయనిట్లనియెన్ 520

గీ. "ఈశ్వరునికంటెఁ బ్రియుఁడు నా । కెందు లేఁడు
శివునిఁ గొలువుము నీమన । శ్చింతతొలఁగు
శివుని ద్వేషించి నన్నుభ । జించువాఁడు
మాయ నెపఁబాయఁ జాలఁడో । మౌనివర్య." 521

గీ. అనుచు వచియించి యంతలో । నంతరించి
నట్టి భగవంతు ధ్యానించి । యాత్మయందుఁ
గాలగళునెంచి సత్యలో । కమున కేగ
మహతి మోగించుకొనుచు న । మ్మౌనివరుఁడు 522

గీ. శాపహతులైన వ్రిమథులా । సమయమునను
తపసి వీక్షించి, వాని పా । దముల కెఱఁగి,

"మునివతంసము! కరుణింపు" మని నుతింప
వారలం జూచి యిట్లనె నారదుండు. 523

గీ. "నాదుశాపంబు పరివర్తనంబు గనదు;
అధికబలవంతులై దైత్యులై జనింపుఁ
డంబుజాక్షుండు శ్రీరాముఁ డవతరించి
మిమ్ము వధియించు నపుడు మోక్షమ్ముఁ గొనుఁడు." 524

చ. అనవుడు వారలిర్వురు "మహాత్ముల వాక్యము రిత్తవోవునే?"
యనుచుఁ దలంచి దైత్యవరులై భువిఁబుట్టిరిచూవె; దేవతా
వనుఁడగు మాధవుండమిత పావభయంకరులన్ వధింపఁగన్
ఘనులను బ్రోవనొక్కొకయుగంబునఁ బుట్టుచునుండుమౌనిసీ

క. అవతారమొంది నంతనె
అవనీస్థలిఁ దచ్చరిత్ర మలరుచు నుండున్,
భవతారక మని యన్యుల
కవబోధముగా నుతింతు రతివ! మునీంద్రుల్ 526

క. వేదములకు నమ్మని సం
వాదములకు భవ్యకావ్య వర్గంబులకున్
మూదలలై తత్కథ ని
ర్వేదము మోదము నొసంగు విమలేందుముఖీ! 527

క. అంతము లేనిదియని, వే
దాంతము, ఖేదాంత మంచు ననఘులు మునులే
కాంతముగా భగవత్కథ
స్వాంతములన్ సంస్మరింతు రంబుజనేత్రా! 528

గీ. మాయఁ దొలఁగింపఁ జాలు రామాయణంబు
కోటి కల్పాంతములకైనఁ గొఱఁతఁ గనదు;

విబుధవర్యుల నేని శ్రీ । విష్ణుమాయ
మోహితులఁ జేయుఁ జూవె స । మ్మోహనాంగి! 529

కం. భగవంతుఁడు భువి జన్మిం
పఁగ రెండవకారణంబుఁ । బలికెదఁ జిత్రం
బుగ వర్ణించెద వినుమా
మనవా! మాయాంధకార । మార్తాండమగున్. 530

ఉ. నిర్గుణుఁడై యెవండు సగు । ణీకృతవేషముఁ దాల్చి మర్త్యసం
సర్గముఁ బొంది, సోదరుఁడు । జాయయుఁ దన్గొలువన్, మహాటవీ
దుర్గమవీథులన్ మెలఁగి । దుష్టుల నెల్లఁ సంహరించె నో
దుర్గ! తదీయగాథ భవ । తోయధి నుండి తరింపఁ జేయదే! 531

మనుచరిత్రము

సీ. స్వాయంభువమనువు । శతరూపఁ బెండ్లాడి
మానవసృష్టి ని । మ్మహి సృజించె,
వానికి నుత్తాన । పాదుండు పుత్త్రుఁడై
జన్మించి శాసించె । సకలభూమి;
నతనికి ధ్రువుఁడను । హరిభక్తుఁ డుదయించె;
నతని పుత్త్రుండు ప్రి । యంవ్రతుండు;
దేవహూతి యనంగఁ । దేజరిల్లిన కాంత,
యాతని పుత్త్రిక । యై రహించెఁ;

గీ. కర్దమప్రజాపతికి న । క్కాంత భార్య;
ఆమె గర్భంబునందు నా । రాయణుండు
కపిలుఁ డనుపేర జన్మించి । విపులముగను
సాంఖ్యశాస్త్రంబుఁ బ్రకటించె । జలజగంధి! 532

కం. మనుభూపతి రాజ్యంబును
ఘనముగఁ బాలించి యంత్య కాలంబునకున్
దనరాజ్యముఁ దనసుతునకుఁ
గొనుమని యర్పించి యరిగె ఘోరాటవికిన్ 533

కం. వైరాగ్యం బభయంబని
శ్రీరామ పదారవింద సేవాపరుఁడై
ఆ రాజమౌళి సతితోఁ
గారాకుల మెసఁగి మెలఁగెఁ గల తీర్థములన్. 534

గీ. ముక్తి సాధింప నెంచి, సన్న్యాసులఁ గొలిచి
సిద్ధులం జూచి, యోగుల సేవఁ జేసి,
భక్తి విజ్ఞాన వైరాగ్య వైభవమునఁ
దీర్థముల సంచరించి కృతార్థుఁడయ్యె. 535

గీ. మేను శుష్కింపఁ జేసి, కాపీనమూని
గోమతీ నదీ జలములలో మునింగి,
ద్వాదశాక్షర మంత్రంబుఁ దలఁచుకొనుచు
మునుల సేవించుచుఁ బురాణములను వినుచు. 536

గీ. సచ్చిదానందమూర్తికి స్వాంత మొసఁగి,
కందమూలాదులందిని, కాంక్షవిడిచి,
జలములం గ్రోలి, తుదకుఁ దజ్జలముఁ బాసి,
గాలిఁ బీల్చుచు, జపతపోలీలఁ బేర్చె. 537

గీ. ఎవని యంశంబునఁ ద్రిమూర్తు లవతరించి,
రెవని వేదరాశియు వచియింపఁ జాల
దెవఁ డనంతుండు, భగవంతుఁ డెవ్వఁ డట్టి
సచ్చిదానందమూర్తి దర్శనముఁ గోరి; 538

గీ. ఆరు వేలేండ్లు తపియించి । నీరు గ్రోలె;
నేను వేలేండ్లు తపియించి । యాఁదఁ బీల్చె;
నంత నాతని మువ్వేల్పు । లరయవచ్చి
“వరములం గోరుకొమ్మ” ని । వలుకుటయును. 539

గీ. సుస్థిరాత్ముఁడై నుంతయు । నాస్థ లేక
అస్థిమాత్రుఁడై సిశ్చలుఁ । డై, తపించుఁ
గాని యాలింప, దంత నా । కాశవాణి
ఎలమిఁ గర్ణంబులం జొచ్చి । యెఱుకపరచె; 540

చ. పులకితగాత్రుఁడై, వినయ । భూషితుఁడై, కనుదోయి విచ్చి, వే
ల్పులు భవదీయపాదముల । పొంక మెఱుంగుదురన్యులెన్నఁడున్
దలఁపఁగ లేరు దేవ! సుఖ । దాయక! వందితదేవనాయకా!
బలినుత! భక్తలోకపరి । పాలక! పాలితదైత్యబాలకా! 541

గీ. యతికులాంభోజదినరాజ! । నతబిడౌజ!
ఆశ్రితామరవృక్ష! భ । క్తాంగరక్ష!
వరము లొసఁగఁగ దయఁగల । వాఁడ వేని
నాదుకోరిక నీడేర్ప । రాదె దేవ!. 542

గీ. ఏ స్వరూపంబు భర్గుని । హృదయమందు
సంతతము రాజిలుచు నుండు । సగుణమనఁగ
నిర్గుణమనంగ నెయ్యది । నెగడుచుండు
వేదసన్నుత మెయ్యది । వేదవేద్య. 543

గీ. అనఘ మానస మానస । హంసమెద్ది
అవ్యయంబెద్ది చూడ న । నంత మెద్ది
దేని మానులు దర్శింప । దేవులాడు
చుందు రాదూపుఁ జూపు మా । నందమూర్తి. 544

చ. అనవుఁడు భూపతింగని ద । యానిధి విష్ణువు భక్తవత్సలుం
డనఘుఁడు నీలనీరద శు । భాంగుఁడు శారదచంద్రమండలా
ననుఁడు విశాల నేత్రుఁడు జ । నార్దనుఁ డంబుజనాభుఁ డచ్యుతుం
డనుపమమై యనంత మగు । నవ్యయరూపముఁ జూపె నత్తఱిన్

గీ. మకరకుండల భూషు నా । మ్నాయభాషుఁ
జిత్కళోల్లాసుఁ బీతకౌ । శేయవాసుఁ
గుందకోరకరదనుఁ బూ । ర్ణేందువదను
శ్రీశు నవినాశు ననుపము । కేశపాశు. 546

గీ. దంపతులు చూచి యాశ్చర్య । తరళితాత్మ
లై "నమోవాసుదేవాయ" । యనుచు మ్రొక్కి
రతివ! వారల హృదయంబు । లళులఁబోలి
అతని చరణాబ్జమకరంద । మాస్వదించె. 547

గీ. వాణి, కల్మిపూఁబోణి శ । ర్వాణి నీవు
నేమహాశక్తిచే సృజి । యింపఁబడిరి?
ఏసతీ దృష్టికిన్ సర్వ । సృష్టి యలరు
నమ్మహామాయ యాతని । యండ నుండె. 548

క. ఇరువురు దద్రూపముఁ గని
పరవశులై మ్రొక్కిరతని । పాదద్వయికిన్
గరుణాభరణుండగు న
ప్పరమేశుఁడు లేవనెత్తె । వారల నెలమిన్. 549

క. "వరములఁ గోరుఁ డొసంగెద
నరుదా! మీకీయకుండ । నరుగం గలనా?
నరవర!" యని పలికిన య
న్నరహరికి నమస్కరించి । నరపతి యనియెన్. 550

సీ. "భవదీయ వరపాద । పద్మంబులం జూచు
కంటెను భాగ్యంబు। గలదె మాకు?
అవధరింపుము దేవ! । యభిలషింపఁగ నొండు
వాంఛ యుండుంగాక । ప్రాప్తమగునె;
శరణాగతత్రాణ! । కరుణింపఁ గలవాఁడ
వింక మాకోర్కె లీ । డేఱకున్నె?
వరదానవిఖ్యాతిఁ । బడసిన దైవంబ
వేము కోరిన దాని । నీయలేవె?
గీ. కల్పవృక్షంబు వీక్షించి । కలిమిఁ గోరు
పేదచందాన నిన్నొండు । వేఁడుకొందు
మెన్నటికి నైన నినుఁబోలు । చిన్నవానిఁ
బడసినం జాలుఁ బున్నెంబు । పండుఁగాదె. 551

మ. అనినన్ జేసికి విష్ణువిట్లనియె:- "న । ట్లౌఁగాక యీసృష్టిలో
ననుఁ బోలంగలవాఁడు లేడు, విను మై । నన్ నేనపుత్రుండనై
జనియింతున్ భవదీయగర్భమున, నీ । సందేహ మింకేటికో
యనఘా!" యంచుఁదదీయభార్యగని "నీ। వర్థింపుమెద్దానినేన్"552

చ. అనవిని యాపె యిట్లనియె:— । "వంబుజనాభ! మదీయభర్తకో
రినయది స్వల్పమయ్యెను వ । రించెద;నయ్యది యట్టులుండఁగా
వినుము మఱొండుకోరిక ల । భింపఁగఁ జేసెదనంటి; బ్రహ్మకున్
జనకుఁడ వేమొసంగుటకుఁ। జాలవు' భక్తహితార్థి వారయున్. 553

శా అంతర్యామివి, లోకనాయకుఁడ వీ । వాద్యంత శూన్యుండ వ
శ్రాంతంబున్ నినుఁగొల్చువారలకు వాం । ఛాసిద్ధిలేకున్నె? శ్రీ
కాంతా నాకు లభింపఁ గోరెదనులో । కస్తుత్యవైరాగ్యమున్.
స్వాంతంబందునయుష్మదీయపదసే। వాసక్తియున్ భక్తియున్ 554

క. అన విని హరి యుల్లోఁగా
కని మిక్కిలి నంతసించి । యూపెన్ బొఁగడెన్?
మనుభూపతి శ్రీపతిఁ గని
"అనఘా! నా విన్నపంబు । నాలింపుదయన్. 555

క. జలముం బాసిన మీనము
జలజేక్షణ యెట్లు బ్రతుకఁ । జాలును చెపుమా?
తలపోయఁగ నాజీవం
బలరును నినుఁ గూడకున్న । నఖిలాత్మహరీ! 556

ఉ. నావుడు మాధవుండు,"నర । నాయక? యింత విచారమేటికిన్?
ఈవనినట్లయాన;సుఖ । యింపఁగఁ దొల్త సురేంద్రుసీమకుం
బోవలె, నచ్చటన్ సకల । భోగములన్ గొనవచ్చు;నావయిన్
భూవరమౌళివై వసుధఁ । బుట్టెద వేలికవై యమోఘ్యకున్. 557

ఉ. ఏ నరరూపముం గని మ । హిన్ జనియించెద భూవరా!భవ
త్సూనుఁడనై,మదంశమునఁ । దోచిన వారలుమత్సహోదరుల్ ;
కానలసంచరించి,జన కంటకులన్ । వధియించి,వేల్పులన్
మానులఁ బ్రోచెదన్ సకల । మానవులౌనని సన్నుతింపఁగన్ 558

క. మచ్చరిత మాలకించిన
సచ్చరితులు మోక్షమొందఁ । జాలుదు రనఘా!
హెచ్చిన భక్తిన్ నన్నున్
మెచ్చిన వెన్నాడువాఁడ । నీడ విధానన్ 559

సీ. భక్తులను ఘోరసంసార । వార్ధినుండి
నేఁ దరింపఁగఁ జేసెద । నిర్మలాత్మ!
ఇమ్మహామాయ సీతయై । యిల జనించు;
ననుచు వచియించి మాధవుం । డంతరించె. 560

క. అమ్మాన్యడ్క నంతరించిన
అమ్మాత్రధవు సన్నుతించి । రాశ్చర్యమునన్;
బిమ్మట దంపతు లిరువురు
నిమ్మహి నివసించి యెలమి । నేగిరి దివికిన్. 561

## ప్రతాపభానుని చరిత్రము

క. శ్రీరాముఁ డవతరింపఁగఁ,
గ్రూరాత్ముల సంహరింప, । ఘోరాటవులన్
బోరాము లనుభవింపగ,
నోరామ! మఱొండు హేతు । వున్నదివినుమా. 562

క. కేకయ దేశాధీశుఁడు
లోకైకబలుండు, ధర్మ । లోలుఁ డరిదురా
లోకుఁడ సుశ్లోకుఁడు, ల
క్ష్మీకరుఁ డనవొప్పు సత్య । కేతువు వఱలున్. 563

క. గుణధాము లతనిపుత్త్రిలు
రణభీములు, వారిలోన । రాజిల్లు నభో
మణినాఁ బ్రతాపభానుం
డనుమధ్యా! రాజ్యమేలె । నతఁడతిబలుఁడై 564

క. నానారిపుభూజానుల
సేనాతామిస్రపటలిఁ । జెదరం జేయుం
గానోపు ప్రతాపము, గల
భానుండగు నాప్రతాప । భానుండబలా! 565

క. అరయన్ రెండవపుత్త్రిం
డరిమర్దనుఁ డాతఁ డహహ । యరిమర్దనుఁడే

యిరువురు సోదరు లిరవుగ
ధరణిం బాలించి రతులు । ధర్మనిరూఢిన్. 566

క. రాగాభివృద్ధిఁ గోరరు,
భోగానుభవంబు గోఱరుఁ । బొక్కరు,ప్రజలన్
రోగార్తుల విడనాడరు,
త్యాగార్జిత కీర్తిధనులు । తరుణీ!వారల్. 567

క. భూషింప రధిక వేషుల,
ద్వేషింపరు పరుల సిరుల, । వికటంబున కేఁ
భాషింప రనృతభాషల,
ఘోషింపరు తాల్మిఁదూలి । ఘోరావదలఁ, 568

ఉ. పాపమనంగ నెట్టిదియొ । స్వప్నము నందు నెఱుంగ రెట్టి సం
తాపము లేనివారు,సత । తంబును వైదిక ధర్మకర్మని
ష్ఠావరులెల్లభంగులఁ బ్రజల్; పరికింపఁ । బ్రతాపభానుధా,
త్రీపతిఁ బోలువారుగలరే! । త్రిజగన్నుత రాజకోటిలో. 569

గీ. రాజ నీతికి శుక్రుండు, । రాజ్య హితుఁడు,
పాడిఁ గలవాఁడు, ప్రజలఁ గా । పాడు వాఁడు,
ధర్మరుచి యను సచివుండు, । ధర్మపరుఁడు,
ఆప్రతాప భానుని మంత్రి । యబ్జ వదన! 570

ఉ. ఖండన సీమ కేగి, బల । వద్రిపు కోటి జయింపఁ జాలు త
మ్ముండు విధేయుఁడై తనదు । పొంతనెయుండఁగ, రాజనీతికిన్
మండనుఁడైన ధర్మరుచి । మంత్రి పరుండయి చాతురీ ధురీ
ణుండయు యుండ, నానృపుని । నొంపఁగ నోపునెయెట్టిభూపుఁడున్

శా. సప్తార్చి ప్రతిమాన బాణ వితతిన్ । సైరింపఁగా శక్యమే!
సప్తాశ్వుండు ప్రతాప భానుఁ డనుచున్ । క్ష్మాకాంతు లగ్గింపఁగా

సప్తద్వీపములన్ జయించి, వసుధన్ । శాసించె నాతండు, సం
ప్రాప్త శ్రీ జిత యక్ష నాయకుఁడనన్ । రాకేందు బింబాననా!

క. ధర్మార్థ కామ మోక్షము
లర్మిలిఁ దనుగొల్చు వార । లందఱుఁ బడయన్,
శర్మము వర్ధిల్లఁగ, రిపు
మర్మ స్పృక్కర్మ మెఱిఁగి । క్ష్మావిభుఁ డేలెన్. 573

గీ. అతని దండ నీతిం బొంది । యమర ధేను
వనఁగ నొప్పారె భూదేవి । వనజ గంధి!
ఈతిబాధలఁ గలనైన । నెఱుఁగరాదు;
అతుల సౌఖ్యంబులం గాంచి । రఖిలజనులు. 574

క. వాపీ కూప తటాకము
లేపారఁగఁ, బుష్పవనము । లెల్లెడఁ గ్రాలన్,
స్థాపించె దేవగృహముల
క్ష్మాపాలుఁడు పాపమేఘ । ఝంఝానిలుఁడై 575

క. సత్రంబుల, బహుపుణ్య
క్షేత్రంబులఁ బాదుకొల్పి, । క్షేమంకరుఁడై
క్షాత్రంబు రహింప నహో
రాత్రంబు నతండు ప్రోచుఁ । బ్రజలన్ గరుణన్. 576

క. ఎప్పుడుఁ ద్రికరణశుద్ధిగఁ
దప్పక కార్యంబొనర్చి, । తత్ఫలము నతం
డప్పనము సేయు శ్రీహరి
కొప్పదె నిష్కామకర్మ । యోగి యనంగన్. 577

### ప్రతాపభానుఁడు వేటకేగుట

ఉ. పాటలగంధి! యాత్మపరి । వారము తోడ, హయాధిరూఢుఁడై,
హాటకపుంఖబాణనిచ । యంబు, శరాసనమున్ ధరించి, యా
ఖేటకవేషమూని, పరి । కించి వనాటులు త్రోవఁ జూప, విం
ధ్యాటవి కేగెనొక్కసమ । యంబున తేఁడు మృగాంతకుండవన్

కం. వేఁటరియై యుప్పొటరి
వ్రేటునకున్ వేనవేలు । మృగములు గూలన్
వేఁటాడి, మాటలాడుచు
వాటంబగు బాట మగిడి । వచ్చుచునుండన్. 579

కం. ఱిక్కించి చెవుల, గుఱ్ఱపు
డెక్కల సడి నాలకించి, । డీకొనఁగ నొడల్
నిక్కించి, ఘుర్ఘురించుచు
నొక్కెడఁ బొదప్రక్క నొక్క । యొంటరి చెలఁగన్. 580

ఉ. అవ్వని నల్లగొండ నడ । యాడఁగ నేర్చెననంగ నేపుమైఁ
గ్రొవ్వి చరించు పంది నృప । కుంజరుఁడుంగని యార్చి కెవ్వనన్
జివ్వన గుఱ్ఱముం గదియఁ । జేసి శరాసనమెక్కువెట్టి తా
ఱివ్వన బాణమున్ విడిచె । ఱెప్పల వైచిన యంతమాత్రలో

కం. ముప్పెంచి యవ్వరాహము
మెప్పించుచు వేఁటకాండ్ర । మెడవంచి వడిన్
గుప్పించి మొగసి గుఱిలోఁ
దప్పెంచిన యట్ల తూపుఁ । దప్పించుకొనెన్. 582

కం. అదలఁడు పాఱినపందికిఁ
గదలఁడు లో ఱిచ్చపాటు । గడలుకొనఁగ

మెదలఁడు పంతముఁ గుంతము
వదలఁడు ధరణీవిభుండు । పర్వతపుత్రీ! 583

క. ఒంటరికై భూపాలుం
డొంటరియై యేగి యేగి । యొకకొండ దరిన్
గంటక మయ కాంతారము
నంటుకొనెన్ ద్రోవఁ దప్పి । యలసెన్ సొలసెన్. 584

క. ఈపాటి యేకలంబును
భూపాలుఁడు చంపలేక । పోయెను; వినము
ద్గోపాలుఁడు శ్రీపాలుఁడు
గాపాడినఁ జంపువాఁడుఁ । గలఁడే? లలనా! 585

క. అడలెన్ గుఱ్ఱము వడికిన్
బడలెన్ బెనుదప్పివలన । బలిమియు మేరన్
సడలెన్, వృక్షచ్ఛాయకు
నెడలెన్ భూనాయకుండు । విశ్రాంతిఁ గోరన్. 586

క. తక్కటి వివేక మంతయు
నక్కట యాఖేటమనెడు । వ్యసనంబునకున్
జిక్కటి" నని భూపాలుం
డొక్కించుక విశ్రమించి । యూఱటఁ గాంచెన్. 587

ఉ. ఊఱటఁ గాంచి లేచి నర । పోత్తముఁ డంతయుఁ దల్లడిల్లి, నే
వీఱిఁడినైతిఁ బందికి వి । వేకముఁ దక్కితిఁ ద్రోవఁ దప్పితిన్;
ఆఱడిపోకకున్ దగిన । యారటమొందితి నెంతతోలినన్
బాఱెదువారువంబు పరి । వారముఁ జేర నుపాయమున్నదే? 588

మ. తఱిఁగెన్ సత్త్వముఁ దప్పితిన్ దెఱవుఁ దుర్దాహంబుచే నోరు పా
డఱెఁ, బెల్లాకటఁ దూలి సోలెఁ దురగం । బారాటముం బావఁగన్

దెఱఁగింకెయ్యది? నాలుకం దడుపఁగా । నీరంబు లేదయ్యె, నన్
దఱిమెన్ దుర్విధి భీకరాటవికి భూ । దారాపదేశంబునన్. 589

చ. కుడిపితి బ్రాహ్మణోత్తముల । కుం గడుపార నిదాఘవేళలన్
దడిపితి సర్వజీవముల । నాలుకలన్ విమలాంబుధారలన్;
బుడిసిలినీరు చేకురదు? । మున్నొనరించిన నోము లన్నియున్
జెడి నశియించెనే? యడవిఁ । జిక్కితిఁ బొక్కితిఁ జేవఁదక్కితిన్.

క. కడ కివ్వడువునఁ గడుఁ గడుఁ
జిడిముడిపడి పొక్కి మోము । చిటచిట లాడన్
దడఁబడెడు వారువంబును
నడపించుచు వెడలె భూమి । నాయకుఁ డడవిన్. 591

తే. కోరింద డొంకలంబడి
చేరువఁ గల మలలదాటి । చిట్టడవులలో
వారువము బుజ్జగించుచుఁ
గోరిక లీడేఱ నొక్క । కోనంగాంచెన్. 592

గీ. కానలోఁ గానరాని య । క్కోన లోన
నాశ్రమంబొండు నిర్మించి । విశ్రమించు
కపట మునివేషధారినిఁ । గాంచె నతఁడు
వెలఁది! రానున్న కీడుఁ ద । ప్పింపవశమె? 593

కపటముని ప్రతాపభానుని మోసపుచ్చుట

మ. మును పెవ్వాఁడు ప్రతాపభానునృపుతోఁ । బోరాడియయ్యాహవం
బున సర్వస్వముఁ గోలుపోయె వినుమ । భూపాలుఁ డిక్కోనలో
మునివేషంబున దాఁగియుండె నిపుడీ । భూపాలుఁ డిచ్చోటికిన్
జనుదేరం గని పోల్చి లోనలరె నీ । ర్ష్యాగ్రస్తుఁడై మానినీ!

గీ. ఆఁకటికి దప్పికిన్ డస్సి । వీఁక చెడిన
భూపుఁ డాతని నిక్కంపు । మునిగ నెంచెఁ

కపట ముని వానికిన్ దటా । కంబుఁ జూపె,
వారువము తోడ నాతండు । వారిఁ జొచ్చి; 595

గీ. స్నానముం జేసి విమలాంబు । పానమునను
శ్రమ నివారించి వార్చి యా । శ్రమముఁ జేరెఁ
గంద మూలాదులఁ దన్ని । కపటమౌని
సాంధ్య సమయంబునన్ వాని । సరస కేగి. 596

ఉ. "పువ్విలుకాని నీ చెలువు । పొమ్మనుఁ గిమ్మన నీయ దక్కటా!
ఎవ్వఁడవయ్య? యొంటిమెయి । నివ్వన సీమఁ జరింప నేటికి
జవ్వన మిమ్మృగావళులఁ । జంపు నిమిత్తము వెచ్చపెట్టుదే!
ఇవ్విధి నున్న నిన్నుఁ గని । యెంతయుఁ గుందెద నేమి సేయుదున్

క. ఇంద్రుఁడ వౌదువా? లేకయు
పేంద్రుఁడ వౌదువా? కళంక । హీనుఁడవై యా
చంద్రుని నిరసించు యశ
స్సాంద్రుఁడ వౌద" నిన రాజ । చంద్రుఁడు నగుచున్. 598

ఉ. "ఇంద్రుఁడఁ గాను వెండియును । పేంద్రుఁడఁ గాను ప్రతాపభానురా
జేంద్రుని మంత్రినౌదు వినుఁ । డేఁ జనుదెంచితి వేఁటకంచు ని
స్తంద్రమదంబునన్; బథముఁ । దప్పితిఁ దప్పికిఁ జిక్కి పొక్కితిన్
సాంద్రవనాంత భాగముల । సంచరియించితి మిమ్ముఁ గాంచితిన్

గీ. అనిన విని ధంభముని యిట్లు । లతని కనియెఁ
"గటికచీకటికిం దోడు । గాలివాన
దుర్గమంబు వనంబు నీ । దుర్గసీమ
చాల దవ్వుగ నుఁగఁడు ని । చ్చటికి నవఘ 600

గీ. ఒక్క త్రుటి లోన వేఁగుఁ బ్ర । త్యూషమునను
లేచి పోవచ్చు నందాక । వేచి యుండు

మంధకార బంధుర మైన । యడవిఁ బట్టి
ఊరి కేగుదె? డెబ్బది । యోజనములు. 601

క. వల్లె యని భూమిపాలుం
డల్లన గుఱ్ఱంబుఁ గట్టి । యవనిజమునకున్
మెల్లఁగ నిట్లనె "నో ముని
వల్లభ! నను మీ సుతునిగ । భావింపఁదగున్. 602

క. మీ మోముఁ జూచినంతన
నా మానస మందు జ్ఞాన । నయనము దోఁచెన్;
నామ పవిత్రీకర శు
ద్ధామృత మే నాస్వాదింతు । నానతి యీరే!" 603

క. అహహా!! ప్రతాప భానుఁడు
కుహనా మునిఁ జూచి పోల్చు । కొనఁజాలండా
మహిపాలు నాతఁడెఱిఁగెను
తుహినాద్రిజ! యెఱుఁగ రాదు । ద్రోహుల మతముల్. 604

క. ఆ రాజవర్యుఁ గనుఁగొని
వైరంబును గప్పిపుచ్చి, । వాత్సల్యంబే
పారఁగ, నమ్ముని మృదువా
గ్ధోరణితో నిట్లనియెఁ । దోయజనేత్రా! 606

క. "నను భిక్షుకుఁ డండ్రు జనుల్
జనసన్నుత! నాకు ధనము, । సదనముఁ గలదే?
మునివృత్తి నివ్వనంబున
దినములు వెచ్చించు చుందు । దెప్పర మయ్యున్." 606

చ. అనవుడు భూపుఁ డిట్లను:-మ । హామహిమంబును గప్పిపుచ్చు ని
వ్వనమున సంచరింతు రొక । పాటి జటింబలె, నార!! సత్త్వహో

ధనులరు, స్వార్థముఁ విడిచి । ధన్యతఁ గాంచినవారు, మిమ్ములన్
గనుఁగొన నొప్పదే నిపుడు । గప్పిన నిప్పుగ సంయమీశ్వరా.

కం. నిర్ధనియు, శాంతమూర్తియు,
స్వార్థత్యాగియు, సకలజ । నావనుఁడును, మో
క్షార్థులు, పావను లని వే
దార్థము నిగడించుఁగాదె । యనఘ! మునీంద్రా! 608

చ. శివుఁడవో? పద్మగర్భుఁడవో? । శ్రీహరివో? పరికింపఁజాలనో
ప్రవిమలచిత్త! నీదుపద । పద్మములం బడి సన్నుతింతు, ఘో
ర వనము నందు మత్తనువుఁ । బ్రాణముఁ బ్రోవఁగవచ్చినట్టియో
వెవఁడ వనుగ్రహింపఁగద । వే? తలవాంచి నమస్కరించెదన్.

కం. అనవిని, సుమహాముని ని
మ్మనమునఁ గడు సంతసించి, । బ్రహ్మవిభువర్యుం
గని యిట్లను:-"వినుమనఘా!
వనమున నివసించు వాఁడ । వైరాగ్యమునన్. 610

గీ. జప తపోవనసీమకు । జ్వాలఁ బోలు
లోకమాన్యత మునులము । మాకు దగదు;
జనము నీక్షింప కుండ ని । వ్వనము నందు
గాలముం బుచ్చుచుందు, ని । క్కంబు వినుము. 611

గీ. కపట సుందర వేషంబుఁ । గాంచి సంతఁ
జతురుఁడున్ వంచితుండగు । జనవరేణ్య!
మధురవాక్కుల నాలించు । మాత్రమునను
మానవుఁడు విశ్వసించిన । హాని యొదవు. 612

క. జనసంబంధముఁ బాసితి
వనమున నేకాకి నగుచుఁ । బరతత్త్వాన.

క్తిని ముప్ప్రొద్దులఁ గడపెద;
ననఘా! బ్రహ్మంబుఁ దక్క । నన్యముఁ దలఁవన్. 613

క. సర్వజ్ఞుఁడు భగవంతుం
డుర్విం గల భక్తకోటి । కొసఁగును ఫలములన్;
ఉర్వీశ వినుత! యెపుడున్
గర్వింపఁగరాదు చూవె । జ్ఞానంబునకున్. 614

క. తలఁపున భక్తిశ్రద్ధలు
వెలయఁగ నాయందుఁ బ్రీతి । విశ్వాసములన్
గలవాఁడవు, నినుఁగాదను
ఫులుమానిసి కెల్లు కీడు । మూడక యుండున్" 615

చ, పొలఁతి! ప్రతాప భాను నృప । పుంగవుఁడింటికి వచ్చె,నొంటిమై
నలువుగఁ జిక్కె నంచుఁగుహ । నాముని యివ్విధముచ్చటించిలో
నలరుచు "నన్నునేకతనుఁ । డందురుమానులు,నిక్కమింతయున్
దెలిపితి" నన్న భూవరుఁడు । నెమ్మది నమ్మికఁ గల్గియిట్లనున్

చ. నను భవదీయ దాసునిగ । నమ్మి కృతార్థునిఁ జేయరాదె! స
జ్జననుతచర్య! యేకతను । శబ్దములం గల భావ మెట్టిదో
వినియెద నానతిం"డనిన । "వెంగలి యీనర నాథ పుంగవుం"
డనుచుఁ దలంచి యిట్లనియె । నక్కపటాత్ముఁడు నక్కకైవడిన్

క. సృష్టికి మును నేనీ తను
యష్టిం గైకొంటి, నిట్టు । లలరుచు నుంటిన్;
నష్టంబుఁ బొంద నెన్నఁడు;
స్పష్టంబుగఁ జెప్పినాఁడ । భక్తుఁడ వగుటన్. 618

గీ. తనువు విడనాడ, రెండవ । తనువుఁ బొంద,
నేక తనునామ మివ్విధి । నాకుఁ జెల్లు

దీన నాశ్చర్యముం బొంద । నేల? రాజ!
తపమునకుఁ గాని కార్యమే । తలను గలదె? 619

గీ. బ్రహ్మ సృష్టింపఁ జాలెఁ ద । పంబు వలనఁ
దపమునన్ శౌరి పాలింప । దక్షుఁడయ్యె,
భర్గుఁడు హరింపఁ జాలెఁ ద । పంబు కలిమిఁ,
గార్యసిద్ధికి మూలంబు । ఘనతపంబు." 620

గీ. పోలఁతి! యారీతి నమ్మికఁ । బుట్టఁ బలికి;
తనదు మహాత్మ్యముం దెల్పు । కొనఁ దలంచి
నట్లు నటియించి, దరహాస । మంకురింప,
నృపవరుం జూచి వెండియు । నిట్టులనియె. 621

మ. "అవురా! నీవు ప్రతాప భానుఁడవు గా । వా చెప్పుమా వానిమం
త్రివె? యుద్దండబలుండ వౌదు, సకల । ద్వీపంబులం గెల్చినాఁ
డవు; సాధారణ రాజమాత్రుఁడవె? స్ప । ష్టంబయ్యెడున్ దివ్యదృ
ష్టి విలోకించిన సర్వమున్ మునులకున్ । శీఘ్రంబుగన్ భూవరా!

క. అరి మర్దనుఁ డరిమర్దనుఁ
డరయఁగ నీయనుఁగుఁదమ్ముఁ । డలరునె సుఖమై?
వరరాజ నీతిఁ గఱచిన
స్థిరబుద్ధికి ధర్మరుచికి । క్షేమమె చెప్పుమా? 623

క. నీతండ్రి నిత్యసత్య ని
కేతనుఁ డననొప్పు సత్య । కేతుఁడు గాఁడా?
భ్రాఁతియె? నీకపటేంగిత
చాతుర్యము, నే గ్రహింపఁ । జాలనె? చెప్పుమా. 624

గీ. అనృతము వచింపఁ దగదైనఁ । గినియఁ జూవె
రాజులకు నొప్పు; నయ్యది । రాజనీతి;

మండలాధిపు లొక్కెడ । మఱుఁగు పఱచి
మాట లాడుటయున్ లెస్స । మాన్యతలేంద్ర! 625

క. గురుకృప వలన లభించిన
వరదృష్టిం జూడ నీదు । వైనము దెలిసెన్;
వర మొండు వేఁడు మొసఁగెద
వరనాయక! సన్నుత సుర । నాయక! వినుమా.'' 626

క. అనవుడు భూవరుఁ డిట్లను
వినయంబున:—''రాజులకు ల । భింపక యున్నే
మునులను సందర్శించిన
మునుకొని ధర్మార్థ కామ । మోక్షము లనఘా! 627

చ. జననుత! నీవు నాయెడఁ బ్ర । సన్నుఁడవై వర మొండు వేఁడు మి
త్తునని వచించి తాత్మఁ గృప । దోపఁగ; ధన్యుఁడ నైతి, నత్తపో
ధనుల కృపావిశేషమున । ధన్యతఁ గాంచనివాఁ డెవండు? నీ
నెనరున శోకముం దొలఁగి । నేను సుఖించెద నెల్లభంగులన్.

చ. సరసిజనేత్రలం దనుపు । శక్తియు, రక్తియు, రూపమున్, జరా
మరణ విహీన దేహ, మన । మాన పరాక్రమ విక్రమంబులున్,
అరులు జయింప రాని మహి । మాతిశయంబును, దైవభక్తియున్
స్థిరమగు రాజ్యలక్ష్మియును । జేకుర నాకు ననుగ్రహింపవే!''

చ. అనవుడు దంభమౌని, దర । హాసము మోమునఁ దాండవింప ని
ట్లనియెను ''నీవుకోరినటు । లౌ; జను లెల్లఱు నీదు పాదసే
వనమును గోరుచుందు రొక । బ్రాహ్మణ బృందము దక్క; వారు స
న్మనులకుఁ దుల్యులై జపత । పోమహిమన్ విడనాడ రెన్నఁడున్.

గీ. బాడబుల కోప మత్యుగ్ర । బాడబంబు
వారి నెదిరించి మనలేఁడు । భర్గుఁడైన;

బ్రాహ్మణులు నీకు వశులైన । వనజభవుఁడు
నీదు పదదాసుఁడై యుండు । నృపవరేణ్య! 631

గీ. బ్రాహ్మణుల నీవు పూజించు । వాఁడవేని
వైభవంబున నీకు లో । పంబు లేదు;
బ్రాహ్మణుల నీవు ద్వేషించు । వాఁడ వేని
హాని చేకూరుఁ, దప్పింప । నజుని తరమె? 632

క. విని భూనాయకుఁ డెంతయు
మనమున సంతోష మొంది । మౌనిని భక్తిన్
వినుతించి మ్రొక్కి నిల్చినఁ
గని వెండియు నాతఁ డిట్లు । క్ష్మాపతికనియెన్. 633

క. "మన సమ్మేళన మేరికి
జననాయక! తెలియరాదు । సత్యము వినుమా,
నిను శపియించెదఁ దెలిసిన"
ననవుడు విని భూమినాథుఁ । డత్యాతురుఁడై. 634

గీ. మౌని పాదాబ్జములకు న । మస్కరించి
"నీదు నానతిఁ దలఁదాల్చి । నిను భజింతు,
ననఘ! యెటుఁగింపవలదె బ్రా । హ్మణ కృపా క
టాక్ష మేరీతి లభియించు? । నానతిమ్మ." 635

గీ. అనిన విని మౌని హసియించి । కనుల మోడ్చి;
ఆత్మ ధ్యానించు రీతియు । నభినయించి,
"లోకమున నుపాయంబులు । లేక యున్న
కష్ట సాధ్యంబు లగుఁగాక । క్ష్మాతలేంద్ర! 636

క. నదుపాయ మొండు గలదది
మదధీనము నందు నున్న, । మనుజులఁ జూడం

గద; వన సీమలఁ దక్కన్
దదితరములఁ జూడ నను వ్ర । తంబునుగొంటిన్." 637

క. విని భూమిపాలుఁ "డక్కట
మునిచంద్రుఁడు రాక యున్న । మోసము రాదే"
అని లోనఁ దలఁచి యత్తటి
వినయానతుఁడై యొకింత । వినుతించియనున్. 638

సీ. "సకల సంపదలకు । స్థానమై కుధరంబు
తన యాదలఁ దృణంబుఁ । దాల్ప లేదె?
రత్నాకర ఖ్యాతి । రాజిల్లు నంభోధి
హీనమా ఫేనంబుఁ । బూన లేదె?
రత్నగర్భ యనంగఁ । బ్రఖ్యాతిఁ గలభూమి
యనిశంబు ధూళితో । నలర లేదె?
అమృతాంశు ధరియించు । నలికాక్షుఁ డక్కటా!
హాలాహల జ్వాలఁ । గ్రోల లేదె?

గీ. లోక హితులైన లోక సు । శ్లోకు లెలమి
నెట్టి కష్టంబు నైన స । హించు వారు;
నీదు పద సేవకుండను । నిర్మలాత్మ!
బ్రదుక నోపుదునే? యీవు । రాక యున్న;" 639

ఉ. అంతట దంభమాని "భళి । రా! నృపవర్యుఁడు చిక్కె"నంచు లో
నంతస మొంది యిట్లనియె:- "భూమిప! ధ్రువంబుగ నీదు కార్యముల్
సాంతముఁ జేయనోపుదు, కృ । తార్థుఁడ వయ్యెదు, సందియంబు లే
దింతకు నాదు భక్తునకు । నేమియొనర్పఁ దపోబలంబునన్. 640

చ. ఇతరు లెఱుంగలేని యటుఁ । లేనొనరించెద వంటకంబులన్;
క్షితిసురవర్యు లెల్లను భు । జించిన నిన్ గడుమెచ్చుకొంద్రు; సం

తతమును లక్షభూసురుల, । దానమునన్ దనియింపనోపుదేᳫ,
క్షితిప! వచింపనేటికి, వ । చింపఁగరాని ఫలంబు చేకురున్. 641

చ. ధరణిప! నీవురోహితుని । దాచెదఁబో యొకయేడుదాఁకఁదా
విరతినిఁ బొందనిమ్మతని । వేసమునన్ జనుదెంతు; నింతకుᳫ
విరసముగాదె యిట్టి ముని । వేషమునన్ జనుదెంతునేని? మ
ద్గురుతరశక్తియున్ దపము । ధూర్జటినైన జయింపఁజాలు నే!

గీ. కడచివది చాలరేయి, భూ । కాంత! యింకఁ
బండుకొనఁ బొమ్ము; మత్తపో । బలముకలిమిఁ
జెక్కుచెదరక పురమును । జేరఁ గలవు;
మూఁడుదినముల కే నిన్నుఁ । జూడవత్తు.'' 643

క. అనవిని మునిపలుకుల న
మ్మనుజాధిపుఁ డాత్మ నలరి । మహిఁ బండుకొనెన్;
మునికెట్లు నిద్రవచ్చున్?
దనమనమునఁ గార్యరీతిఁ । దలఁచుచు నుండన్. 644

కాలకేతువు

గీ. శ్రిత జనస్తోమ దుఃఖాబ్ధి । సేతు వనఁగ,
భూతలాధీశ కులధూమ । కేతు వనఁగ,
దనుజసంచయ బలహేతు । ధాతు వనఁగఁ,
గెరలు నొకరాక్షసుఁడు కాల । కేతు వనఁగ. 645

ఉ. శంబరవిద్యయందు నెఱ । జాణఁడు, జాణెతవానిభార్య, స్వ
ర్గాంబరుఁ జీరికిం గొనని । యట్టిబలుల్ పదిమందిసోదరుల్,
పంచినవేడ్క వానిపద । పద్మములᳫ బడియుండు పుత్త్రికుల్
డంబుగ నూర్వురుంద్రు, జగ।డంబునకున్ వెనుదీయ రెన్నఁడున్.

గీ. దురమునᳫ వీనిసుతులు, సో । దరులు, భార్య,
ఆ పరితాప భానుని ప్రతా । పాగ్ని కకట!!

మిసుతలంబలె మడసిరి । పడఁతిమిన్న!
కడకు నిక్కాలకేతువా । క్కఁడుమిగిలె. 647

మ. తరుణీ! వీఁడె ప్రతాప భానునృపుఁగాం । తారంబునన్‌జూచి,సూ
కరరూపంబున మోసపుచ్చె; మునికిన్ । గారాపునెయ్యుండు; నం
గరరంగంబున వీరలిర్వురును మున్ । ఘూర్మికాంతుచేనోడి, భీ
కరకాంతారముఁ జొచ్చి రెమ్మెయిఁ బ్రతీ । కారంబుఁగావింపఁగన్.

క. ప్రతిదినము రాత్రి సఖునకు
క్షితిపాలుని చర్య లెల్లఁ । జెప్పుచు నుండున్;
అతివా! ఎప్పటి యట్టుల
నతనికిఁ దెలుపంగ వచ్చె । నతఁడ త్తఱికిన్. 649

ఉ. వచ్చిన వాని మాని కని । వజ్ఞకు వేఁజని వల్కరించి "యీ
విచ్చటికేగుదేర కెట । కేగదవో యని సంశయించితిన్;
మెచ్చితి సంగడీఁడ! నిను । మించిన వాఁడెవఁ"డంచు నవ్వుచున్
గ్రుచ్చి కవుంగిలించి నృప । కుంజరుఁ జూపి వచించె సర్వమున్.

క. యావద్వృత్తాంతము విని
దేవారి ప్రమోద మొంది । తేఁకువతో మా
యా విద్యా పాటవమున
వైవశ్యునిఁజేసె నకట!! । వసుధాధీశున్. 651

గీ. "ఔషధము లేకయే మన । వ్యాధి కుదురు
తెరవుఁజూపించి విధి మన । బరువుఁగొనియె,
నితని సకుటుంబముగ నశి । యింపఁజేసి
మగిడి వచ్చెద"నని వల్కి । మానిఁబాసి. 652

రాక్షసుఁడు ప్రతాపభానుని నంతిపురముం జేర్చుట.

గీ. వారువముతోడ నృపుఁబట్టి । బయలు వెడలి
పురమునకునేగి, నృపు నంతి । పురముఁజేర్చి;

అశ్వమును బట్టి మందుర । యందుఁగట్టి
నృప పురోహితు నింటికి । నిర్గమించి; 653

గీ. ఆ పురోహితుఁగందర । యందు డాచి
వానియాకృతిఁ గొనివాఁడు । పంకుకొనియె
జనవిభుఁడు లేచి, వెఱఁగొంది । మునిని మెచ్చి
వారువము నెక్కి వెండియు । వనికి నేగి; 654

గీ. వేఁటకుం బోయి మగిడిన । వితము దోప
రెండు జాముల కేతెంచె । నృపవరుండు
జనము తమ తేని రాకకు । సంతసించి
ఉత్సవముఁ జేసి రపుడు నే । తోత్సవముగ. 655

బ్రాహ్మణులు ప్రతాపభానుని శపించుట.

గీ. తన పురోహితు వేషంబుఁ । దాల్చినట్టి
అసుర వీక్షించి మునియని । యాత్మ నెంచి,
అతని యానతిఁ దలఁదాల్చి । యాతుణంబ
అన్న దానాభిలాషియై । యవని విభుఁడు. 656

క. పెక్కురు భూసుర వర్యులఁ
దక్కక రప్పించె నీవిఁ । దనుపఁగ; నంతన్
టక్కరిరక్కసి చక్కఁగఁ
గ్రిక్కనఁ గావించె వంట । కంబుల నెల్లన్. 657

క. గోబ్రాహ్మణ మాంసాదుల
నాబ్రాహ్మణ్యము భుజింప । నతఁడిడి నంతన్
సెబ్రి, భుజింపం దగదని
అబ్రింబుగ గగనవాణి । యాక్షేపించెన్. 658

గీ. బాడబులు లేచి కోపించి । బ్రాహ్మణులకు
నకట!! యుపచారముం జేయ । నగునె? రాజ!
అవని సకుటుంబముగఁబుట్టు । మసుర వగుచుఁ
గాకులముఁజేయ నెంచితే । మాకులంబు! 659

క. నీకుఁగ నివాప మొనరుప
నో కాపురుషాధమ! విను । మొక్కండైనన్
లోకంబున శేషింపఁడు,
నీ కావర మప్పు డణఁగు । నిశ్శేషముగన్." 660

గీ. అని శపించిన యంత న । జ్జన విభుండు
విహ్వలుండయి మతిఁదప్పి । వెడఁగుఁ బోలి
శూన్య దృక్కుల దిక్కులం । జూచి, చూచి,
డీలుపడి, మాప్రినుపతి, నేలఁ । గూలఁబడియె. 661

గీ. "ఘోరకాంతార మధ్యస్థ । వైరివలన
వంచితుండయ్యె, బ్రాహ్మణ । వర్యులార!
ఇందు నృపదోష మిసుమంత । యేనిలేదు,
పాడిఁ దప్పదురే"యని । వాణిపలికె.

ఉ. "ఆఁ" యని యెంతతప్పని ధ । రామరు లెల్లరు వంటయింటికిం
బోయిరి; వంటతో దనుజ । పుంగవుఁ డయ్యెడ నంతరించె; "ఛీ
ఛీ యిది యేమి మోస"మని । చింతిలి వారలు మానవేంద్రుపైఁ
బాయనికూర్మిఁ బూసి మృదు । భాషలనిట్లని రుమ్మలించుచున్

ఉ. "చెప్పఁగరాని వైశసము । చేకురె నీకు, నరేంద్ర! నీయెడన్
దప్పిసుమంత లేదయిన । దైత్యుఁడ వయ్యెద వెట్టివారికేఁ
దప్పదు విప్రశాపమిది । తథ్యము; సారసగర్భవంశమం
దుప్పతిలంగలాఁడవు, బ । లోన్నతిఁ బొందఁ గలాడ వింతకుఁగ

గీ. భర్గకరుణను వరములఁ । బడసెదీవు,
మూఁడులోకంబుల జయించు । వాఁడవీవు,
నరవరోత్తమ! వినుము స । నత్కుమారు
వలన నీకు మోక్షంబు సం । ప్రాప్తమగును. 665

క. నీవును నీపరివారము
నో వసుధాధిప! మునివరు । నుపదేశమునన్
గైవల్యముఁ గైకొందురు
భావుకములఁ బొందఁ గలరు । వైకుంఠమునన్. 666

చ. అని వచియించి భూమిసురు । లందఱు వీడ్కొని యేగి "రక్కటా"
యని ప్రజలెల్లఱున్ గలఁగి । యవ్విధి దూఱి రనేకభంగులన్;
దనుజుఁడు రేయిఁగందరను । దాచిన రాజపురోహితున్ గృహం
బునను బరుండఁబెట్టి, ముని । పొంతకు నేగి హసించి యిట్లనున్.

గీ. "అహాహా! సంకల్పసిద్ధుఁడ । వగుదు సఖుఁడ!
కోర్కెలీడేఱె, మనకుఁ జే । కూఱె బలిమి;"
అనిన విని మేలు మేలని । మునివరుండు
సైన్యమాయిత్తముం జేసె । సమరమునకు. 668

గీ. దనుజపుంగవుఁడుం దాను । దాడి వెడలి
భూవరుండుండు పురమును । ముట్టడించి
పోరి, సకుంటుంబముగ వైరిఁ । బొలియఁ జేసి
రకట! బ్రాహ్మణ శాపంబు । వ్యర్థమగునె! 669

ఉ. కాలము దప్పి వచ్చిన, జ । గత్పతి దైవము వైరమొంచినన్
ధూళి ధరాధరంబనఁగఁ । దోఁచును, పాముగఁ బూలమాలయున్
గాలునిఁబోలుఁదండ్రి, కడ । గండ్లకు లోనగు నెట్టిసాధువున్,
హాలహలంబుఁబోలు నమృ । తాన్నము; నేమనవచ్చు దుర్విధిన్

రావణ కుంభకర్ణ విభీషణుల జననము

చ. ఇరువది చేతులం గలిగి, । యేపగు దేహముఁగల్గి, లోకభీ
కరమగురూపుఁదాల్చి, దశ । కంఠుఁ డనంగఁ బ్రతాపభానుభూ
వరుఁడు పులస్త్యవంశమున । బ్రాహ్మణ శాపము కారణంబునన్
సురలకుఁ బ్రాణగొడ్డమయి । ఘోరవరుండయి పుట్టె భూస్థలిన్.

క. ధరణీధరకాయుం డై,
అరిమర్దనుఁ డక్కటకట! । యతిబలుఁ డై, సో
దరుఁ డై, త్రిజగజ్జనభీ
కరుఁ డై, జనియించెఁ గుంభ । కర్ణుం డనఁగన్. 672

క. వైమాత్రేయానుజుఁ డై,
క్షేమంకర విష్ణుభక్త । శేఖరుఁ డై, ని
ష్కాముఁ డయి, విభీషణుఁడన్
నామంబున, ధర్మరుచి జ । నన మొందె భువిన్. 673

రావణకుంభకర్ణవిభీషణులకు బ్రహ్మ వరములొసంగుట

గీ. నిష్ఠ దీపింప నాహార । నిద్ర లుడిగి
తపముఁ గావింప వార లా । తపమునందు;
బృథివి కంపించె, నమరులు । భీతిఁ జెంది,
రంతఁ బ్రత్యక్ష మగుచుఁ । బద్మాసనుండు. 674

క. వరియింపుఁ డనుడు దశకం
ధరుఁ డవ్విధి కిట్టు లనియెఁ:- । "దాతా! నరవా
నరతతిచేఁ దక్కన్, నే
మరణంబును బొందకుందు । మఱి యెవ్వరిచే." 675

చ. అనవుడు నీవు కోరినటు । లౌ నని నవ్వి, విరించి కుంభక
ర్ణునిఁ గని వానిక్రూరతర । రూపముఁ గాంచి "యహర్నిశంబు భో

జనము లభించెనేని జన । సంచయమున్ బ్రదుకంగనీదు వీ
డని పెరరేపె భారతిని । నాతఁడు నిద్రను గోరునట్లుగన్.

గీ. కుంభకర్ణుండు మతిఁ దప్పి । కోరె నిద్ర;
నంబుజాసనుఁ డట్లయా । నని వచించి,
సద్గుణవిభూషణుని విభీ । షణునిఁ జూచి,
"వత్స! వాంఛింపు" మనిన నా । భక్తుఁ డనియె. 677

క. "తాపసులతోడి మైత్రియు,
శ్రీపతిపద సేవయందు । స్థిరచిత్తంబున్,
బాపేంగి తానుతాపము
నేపారఁగ నిమ్మనుగ్ర । హింపుము దేవా! 678

చ. భళి! భళి! మేలు! మే లనుచు । భక్తవరా! చిరకాలజీవి వై
ఇల సుఖియించె దంచు వచి । యించి విరించనుఁ డంతరించె; లో
నలరుచు సోదరుల్ ముగురు । నాత్మగృహంబుల కేగి రాయమ
ర్త్యులు,మునిపుంగవుల్,నరులు। యోగులు,సిద్ధులుఁ,దల్లడిల్లఁగన్.

గీ. "గంధసింధుర సత్త్వ దు । రంధరుండు,
కంధరారవనిర్జిత । కంధరుండు,
ఘనవినయ వశీకృత నీల । కంధరుండు,
క్షుతవసుంధరుఁ డప్పంక్తి । కంధరుండు. 680

గీ. క్రూరహుంకార, ఘోరటం । కారభీత
శత్రుకామినీ గర్భ వి । స్రావణుండు,
ప్రబలవిక్రమ నిర్జితై । రావణుండు,
రావణుం డౌర లోక వి । ద్రావణుండు. 681

గీ. అని నుతింపఁగ నెల్లఱు, । దనుజవిభుఁడు
విక్రమక్రమంబున లంక । నాక్రమించి

దుర్గముల, రత్నమయహార్మ్య । వర్గములను,
సౌధముల, భవనములఁ, బ్రా । సాదములను. 682

గీ. మోద మిగురొత్త నిర్మించి, । సోదరులకు
హర్ష మెసఁగంగ నేలి, దు । ర్ధర్షుఁ డగుచు
మయునితనయను, సద్గుణ । మయను, సుంద
రినిఁ, గృశోదరిన్ మండోద । రిని వరించె. 683

రావణాదిరాక్షసులపరాక్రమవర్ణనము

క. సురలకు నమరావతిఁ బలె
వరసర్పంబులకు భోగ । వతి చందమునన్
నరభుక్కు లైన దైత్యుల
కిరవయి దీపించె లంక । యిల నిశ్శంకన్. 684

గీ. యక్షుల జయించి హార్యక్ష । మనఁ జెలంగి
అలకల ల్లాడకుండ న । య్యలకఁ జొచ్చి
పుష్పకవిమానమును మాన । మును హరించె
రావణుం డౌర! పీడాప । రాయణుండు. 685

ఉ. శౌర్యము దోర్బలంబు సుత । సంతతి,విద్యయు, మత్సరంబు, నై
శ్వర్యము సైన్యమున్ జయము। సౌఖ్యము బుద్ధియు శ్రద్ధయున్ మనో
ధైర్యము వృద్ధి యాకొలఁదిఁ । దామరతంపర యయ్యె వానికిన్
గ్రౌర్యముగార్యదీక్షయును।గర్వములోభముమోహముంగడున్.

గీ. కుంభకర్ణుని యుద్ధ సం । రంభవిధముఁ
జూచినం జాలుఁ జూలాలి । చూలు సడలు;
మేఘనాథుండు భళిర! య । మోఘబలుఁడు
ఇంద్రుని జయించె నమరుల । యేపణంచె. 687

గీ. కుముఖుఁడు నకంపనుండును । గులిశరదుఁడు,
ధూమ్రకేతుండు రిపురాజ । ధూమకేతుఁ,
డైన యతికాయుఁ డక్కటా! । యతులబలులు
కామరూపులు; నిర్దయుల్ । కపట మతులు. 688

గీ. వీర లెల్లను, సుభటులు । వీరవరులు
జ్యేష్ఠపుత్త్రుండు రిపుజైత్రు । డింద్రజితుఁడు,
సోదరుఁడు కుంభకర్ణుండు, । శూరసింహుఁ
డైన రావణు వర్ణింప । నలవి యగునె? 689

ఉ. నీలసరోజనేత్ర! యవ । నీధరముఁ గదలించె నేపుమై;
గాలునిఁ జీరికిం గొనని । కాలుఁడు రావణుఁ డొక్కనాఁడు పే
రోలగమందు మంత్రులను । యోధులఁ, బుత్త్రుల, నుగ్రదైత్యశా
ర్దూలములన్ గనుంగొని వి । రోధులఁ జంపఁదలంచి యిట్లనున్.

మ. "కదలం బోలిన బాహుదంతములచే । గౌరీశు కైలాసమున్
కదలింపం గల సత్త్వమున్ బడసితిన్ । గంధర్వులన్ వేల్పులన్
విదలింపం గల సైన్యముఁ బడసితిఁ । వీరుండ ధీరుండ న
న్నెదిరింపం గల రాచజోదు గలఁడే! । యీరేడు లోకంబునన్.

మ. మన కాగర్భవిరోధు లైన సురలన్ । మ్రగ్గింప నూహింతు వా
రనిలో దైత్యులఁ జూచిపాఱెద రుపా । యంబొండు చింతించితిన్
వనభాగస్థ మునీశ్వర క్రతుహవి । ర్భాగంబులన్ గైకొనన్,
జనదేరంగల వార లప్పుడచటన్ । సాధించి బాధింపనౌ. 692

గీ. బ్రాహ్మణుల యాగములకును । శ్రాద్ధములకు,
వెడలుచుందురు సతతంబు । విబుధవరులు;
అట్టితఱిఁ జూచి వారల । నదిమిపట్టి,
పరిభవింపుఁడు చంపుఁడు । హరి కలంగ" 693

చ. అనుచు దశాననుండు విబు । ధారులఁ జూచి వచించి సింహగ
ర్జన మొనరించినంతనె, ధ । రాతల మంతయు సంచలించె నొ
ననిఁ“యిదిలెస్స”యంచునమ । రారులుహుమ్మనిహుంకరించుచుఁ
జనిరి ధరామర ప్రముత । సన్మునియాగ వినాశనార్థులై. 694

రావణుని దిగ్విజయము

సీ. సురలోకముం జొచ్చి । సురనాథు బంధించి,
యితరదిక్పాలుర । యే పణంచి,
యక్షుల పీక్షించి । పక్షు లంచు వధించి,
గంధర్వులం బట్టి । కసిమసంగి,
నరులొ వానరులొ కి । న్నరు లంచుఁ బీడించి,
సిద్ధుల నోడించి । బుద్ధిఁ జెప్పి,
పురుషులా యంచుఁ గిం । పురుషుల సాధించి,
సాధ్యుల బాధించి । సంహరించి,

గీ. సప్తపాతాళముల గెల్చి । సంభ్రమించి,
అఖిలలోకంబుల జయించి । యతిశయించి,
శత్రులోకాంతకుం డయ్యె । సమరరంగ
భైరవుం డగు దనుజ కం । ఠీరవుండు. 695

ఉ. అవ్విధి రావణుండు, దను । జావళితోడఁ బరాక్రమించి, నా
కెవ్వఁడు సాటియంచు, హరి । యేడియెదుర్కొనఁడేటికంచు,మై
క్రొవ్వున హుంకరించి యని । రుద్ధబలుం డయి లంక కేగుచున్
నవ్వుచు వచ్చు ముళ్ళయతి । నారదుఁ గాంచిహసించి యిట్లనున్

ఉ. “డీ యని సర్వలోకముల । డీకొని గెల్చితి, గెల్పులచ్చితో
హాయిగవచ్చుచుంటి, నమ । రావనుఁ డందురు విష్ణుమూర్తి,దై

తేయుల గర్భవైరి యని । ధీరవరుం డని సన్నుతింతు, రే
డీ? యెదిరింపఁడో? నను జ । యింపఁడొ? దైత్యులసంహరింపఁడో.

శా. "భీతిల్లెన్ భువనత్రయంబు, విబుధుల్ । పెంపేద వెన్నిచ్చిరు
త్ఖాతం బయ్యె జగంబు, వేల్పు లెచటన్ । గన్పట్ట రన్నన్" సుర
వ్రాతం బెచ్చట డాఁగునో యెఱుఁగవే? । రాత్రించరాగ్రేసరా!
శ్వేతద్వీపము ముట్టడింపుము భవ । ద్వీర్యం బవార్యంబుగాన్"

రా వ ణు న కు సం భ వి ం చి న ప రా భ వ ము లు

చ. అని ముని హెచ్చరింప విని । యాననినవ్వుచుఁ దక్షణంబ య
ద్దనుజవిభుండు, వారినిధి । దాటి వడిన్ దెలిదీవి కేపు మైఁ
జని యచటన్ జరించు నెఱ । జాణలఁ బెక్కురఁ జూచి "వేగ మీ
యినునకుఁ దెల్పు డాతని జయించి మిముంగొనిపోవుదులంకకున్"

చ. అదవద లేక వీరుఁ డను । నాదర మించుక యైన లేక, య
మ్మదవతు లద్దశాస్యుఁ గని । మాటికి మాటికి నవ్వి రంతటన్
ముదుసలి యొూర్తు వానిపది । మోములఁ జూచిహసించి, "యౌర! నీ
వు దశముఖుండవో? దనుజ । పుంగవ! మావిభు గెల్వ వచ్చితో

క. పదితలలం గల పురువె
య్యదియో యేతెంచె" నంచు । నమ్ముదుసలి త
త్పదములఁ గేలం దివియుచుఁ
జదలకుఁ గొంపోయి త్రిప్పి । జలనిధిఁ ద్రోసెన్. 701

గీ. జలధిలోఁ బడి విప్రప్ర । సాదమునను
పొలియ కందుండి పాతాళ । మునకు నేగి,
ఎలమి బలిలోకముం జొచ్చి । బలినిఁ జూచి
అతని మన్ననలం గొని । యసురవిభుఁడు. 702

గీ. “అనఘ! నీరాజ్యము హరించి నట్టిహరిని
సంహరింపఁగ వచ్చి నా సాయమునను,
రమ్ము భూలోకమునకు నీ రాజ్యమునకు”
ననిన బలి వాని వీక్షించి యపహసించి. 703

చ. “భళిభళి బల్లిదుండ వనవచ్చు; మదీయ పితామహుండు వే,
ల్పులకు యముండు స్వర్ణకశిపుండు ధరిత్రికి రాచపుండు తా
నెలమి ధరించె దీని ధరియింపుము కానుకగా గ్రహింపు మి
య్యెల విహరింపు మాశల జయింపుము రావణ! రాక్షసావనా”

గీ. అని బలి యొసంగు భూషణం బును భరింపఁ
జేవలేక దశాస్యుండు చిన్నఁ బోయె;
వానిఁ దిలకించి యిట్లనె బలి, హసించి;
“ఎల్లిదం బయ్యెఁగద నీదు బల్లిదంబు. 705

గీ. అమర గంధర్వ కిన్నర యక్ష సిద్ధ
సాధ్యుల జయించి నాడవు, సాటిలేని
మేటి నని చెప్పుకొంటి వీ పాటిసొమ్ముఁ
దాల్పఁ జాలవు, శ్రీహరిఁ దాకఁ గలవె?” 706

చ. అనవుడు మోము వంచి దనుజాధిపుఁ డచ్చొటువాసి తత్క్షణం
బునఁ జనె లజ్జ నించుకయుఁ బొందక, ఘోరపరాభవార్తికిన్
వనరి, దయావిహీనుఁ డయి పాపభయంబుఁ దొలంగి, చిత్కళా
ఖను లగు మానులన్ ఘనులఁ గాసిలఁ జేయుచు నుండె నెంతయున్

గీ. అంతటి బలుండు, రావణుం డలువుఁ డయ్యె;
నకట! దైవంబు ప్రతికూల మైన వేళ
రత్న మెంతటి దయ్యు వ్యర్థంబ యగును
గాజు చందంబున, వరాట కంబు కరణి. 708

గీ. అంగనల మానధనముల । దొంగిలించి,
బ్రాహ్మణుల మానివర్యులఁ । బరిభవించి,
సజ్జనుల, దైవభక్తుల, । సంహరించి,
ఉర్విఁ దిరుగాడు నాతఁ డిం । కొక్క నాఁడు. 709

రావణుఁడు వాలిచేఁ బరిభవింపఁబడుట

క. పంపాతీరంబున, వర
శంపారుచిఁ గ్రాలు రోమ । సంతతితోడన్
సొంపారు వాలిఁ గనె; నను
కంపాహీనుండు దైత్య । కాంతుం డంతన్. 710

క. వాలిన్, శాత్రవకుల వన
కీలిన్, సంగ్రామరంగ । కేళీజితవీ
రాలిన్, జననుతభుజబల
శాలిన్, ముఖవిజితహేళి । సన్నుత శూలిన్. 711

గీ. గెలువ నూహించి జృంభించి । యలవు మెఱయ
మెల్లమెల్లఁగ క్రూరుల । బెల్లగించి,
ఉప్పరముఁ దాకు చొప్పున । నుప్పుచుండె;
దత్తఱిల్లక యవ్వాన । రోత్తముండు. 712

గీ. జపతపో ధ్యాన నిరతికి । సమయ మగుట
సూర్యునకు నంజలిం గూర్చి । చూచుచుండె;
"నన్ను లక్షింప కీతండు । మిన్నకుండె"
ననుచుఁ గోపించి, యిట్లనె । దనుజవిభుఁడు. 713

శా. "ఔరా! వానర! చాలుఁజాలును బక । ధ్యానంబుమానంబు, లో
కారాధ్యుండవ; బల్లిదుండ వని బ్ర । హ్మాండంబు ఘోషింప, దో

స్సారంబున్ బరికింప వచ్చితి శరా । సారంబునన్, బోరెదన్
రారా! లేక జితోస్మి; పాహి యనిన । ర్రక్షింతు నిం తేటికిన్".

గీ. అనిన విని వాలి యించుక । యాగ్రహించి,
"బ్రహ్మకులజుండు, బ్రహ్మవ । రప్రసాద
మహిమఁ గ్రొవ్వినవాఁ" డంచు । మదిఁ దలంచి,
జపముఁ జాలించి లేచి రా । క్షసునిఁ జూచి. 715

ఉ. "శూరుఁడ వౌదువో యి! యిదె । సూర్యున కర్ఘ్యము నంగునంతదా
కోరిచియుండు మిప్పటికి । నోడితి నంచు దలంపు" మన్న దే
వారి హసించి "సూర్యునకు । నర్ఘ్యమొసంగిన లాభ మేమి? నీ
కోరిన కామితంబు నొస । గూర్చెద నాకు నొసంగు మర్ఘ్యమున్".

చ. అన విని వాలి, యాగ్రహము । దగ్రముగాగ మహోగ్రుఁడై, నరా
శనుఁ గని "యోర! నీయెదిరి । సత్తుఁ దలంపక, సన్నిపాత మొం
దినగతి నేల ప్రేలెదవు? । నిన్ను జయింపఁగ వచ్చు, నింటికిన్
జను" మని నంత రావణుఁడు । చయ్యన డీకొనె వానరోత్తమున్

గీ. తగరుకొండను దాకు చం । దమునఁ జెలఁగి
తన్ను ఢీకొను రావణు । వెన్నుఁ దన్ని,
వాల నిహతాంబుధరపాళి । వాలి, వాలి
వాని నేపుమైఁ దనచంక । లో నిమిడ్చి. 718

చ. వననిధు లేడు దాటి, సుర । వారము మే లని హెచ్చరింపఁగన్
వనముఁ ద్రిప్పిత్రిప్పి, కుల । పర్వతపంక్తి నతిక్రమించి, యా
త్రినయను నెమ్మనంబున స్మ । రించుచు నింటికిఁ బ్రొద్దు గ్రుంకినం
తనె చని పుత్త్రినిన్ బిలిచి । దానవనాయకుఁ జూపి నవ్వుచున్

గీ. పదితలల బొమ్మ యియ్యది । పలుకఁ గలదు,
వాడుకొను మాడుకొను" మని । పలికి వెడలె;

దార యేతెంచి కరుణించి । దనుజవరుని
“వెంగలీ! పొమ్ము పొమ్మ”ని । విడిచిపుచ్చె. 720

గీ. బ్రదుకు జీవుఁడ యంచు నె । మ్మదిఁ దలంచి
వాలి తన కొనర్చినయట్టి । పరిభవంబు
నమరు లీక్షించి కడుమెచ్చి । రనుచుఁ గినిసి
తడఁబడుచుఁ బండ్లు గొఱుకుచు । వెడలి వెడలె. 721

రావణుఁడు కార్తవీర్యార్జునునిచే బంధింపఁబడుట

క. శర్మదఁ, బ్రత్యాశిత గజ
దుర్మద, భీకర యమభట । దుర్భర బాధా
వర్మద, స్నాతక ఘర్మద
నర్మద, నీక్షించె దనుజ । నాయకుఁ డంతన్. 722

గీ. అందుఁ గ్రీడించు వనితల । యందముఁ గని
హైహయాధీశ్వరుం జూచి । యాగ్రహించి
జలముఁ గలుషితంబుగఁ జేసి । చలముఁ బూని
పజ్జ కేతెంచి నంతనె । పరిహసించి. 723

గీ. కంఠరవజిత పర్జన్య । గర్జనుండు
దుర్జయుఁడు నిర్జితాఖిల । దుర్జనుండు
ఆర్జితార్జునకీర్తి వి । స్ఫూర్జితుండు
కార్తవీర్యార్జునుండు దోః । ఖర్జు వణఁగ. 724

గీ. రావణుం గొట్టి కరసహ । స్రమునఁ బట్టి
పురవరంబున కేగి మం । దురను గట్టి
“అసురనాయక! లజ్జింపు” । మనుచుఁ దిట్టి
కాంతలం గూడి యేగె శు । ద్ధాంతమునకు. 725

ఉ. అంతఁ బులస్త్యుఁడాత్మజు నహంకృతి యింతకుఁదెచ్చెనంచులోఁ
జింతిలి మిన్న కున్న నిఁకఁ జేడ్పడుఁ గీడ్పడు నంచు నెంచి భూ
కాంతుని సన్నుతించి దశ కంధరు బంధవిముక్తుఁ జేసె న
త్యంత విచార భార నిన తాననుఁడై పరితాప మొందుచున్.

గీ. తత్క్షణంబున వెడలి య ద్దనుజ విభుఁడు
తనకుఁ గలిగిన పరిభవం బునకుఁ గినిసి
పండ్లు పటపటఁ గొఱుకుచు వచ్చుచుండఁ
ద్రోవఁ గన్పట్టె రంభయున్ దోయజాక్షి. 727

రావణుఁడు రంభను బలాత్కరించుట

క. రంభన్ నిజోరుధిక్కృత
రంభన్ గుచకుంభజృంభ రంజ న్నాట్యా
రంభన్ సురతాధిక సం
రంభన్ గని కౌఁగలించె రతిఁ బీడింపన్. 728

చ. వలదని యేడ్చి కాళ్ళఁబడి వానికిఁ గోడల నౌదు రావణా
తొలఁగుము పాపహేతు వని తోయరుహానన యెంతచెప్పినన్
ఖలుఁడు బలాత్కరించి రతి కాంతున కోడి రమించె నాపెకన్
గొలుకుల నీరమూర నల కూబరుఁ జేరి వచించె సర్వమున్.

నలకూబరుఁడు రావణుని శపించుట

గీ. అతఁడు మోమునన్ జెమ్మట లంకురింప
గనలి కన్నీరు మున్నీరు గా స్రవింప
జలరుహేక్షణ నీక్షించి జలముఁ బూని
అసురనాథు నుద్దేశించి యాగ్రహించి. 730

గీ. "ఏదురాత్ముండు, నాకొఱ । కేగుదెంచు
లలనఁ గని కౌఁగిలించి, బ । లాత్కరించె,
నద్దురాత్ముండు, ఖలుఁడు, దే । వాంతకుండు,
సపరివారంబుగ నశించు । సంగరమున." 731

ఉ. ఆనలకూబరుం డను । జాధిపు నిట్లు శపించినంతనే
మానవనాథులున్, సురలు,।మానవులు, యోగులు, సంతసించియా
నా నని హెచ్చరించి, రను । రాధిపుఁడున్ భయ మొంది వెంటనే
ఆనతి యిచ్చె దైత్యులకు । నందఱ నెల్లెడ సంహరింపఁగన్.732

గీ. మునుము యోచించి కౌటిల్య । మునకుఁ జొచ్చి
రక్తపూరితకుంభంబు । రాక్షసుల కొ
సంగి, "మీ తేవి కీఁ బొందు । సత్వరముగ
వంశవర్ధన మగు" నని । పలికినంత; 733

గీ. ముని లొసంగిన యాకుంభ । మునుధరించి,
వార లేతెంచినంత, రా । వణుఁడు చూచి,
ఎగ్గు వాటిల్లు నని యెంచి । యిట్టు లనియె.
"దీనిఁ గొంపోయి యుత్తర । దేశమునను. 734

గీ. పదిలముగ నొండు స్థలమునఁ । బాదుకొలిపి
అరుగుదెం డని పొం డని" । యానతిచ్చె;
"నకట! మానులు వంచించి । రనుచుఁ గినిసి
వార లారీతిఁ గావింప । బయలు వెడలి; 735

క. జనకుని దేశంబునకుఁ
జని, యొక క్షేత్రంబుఁ జూచి । చయ్యనఁ గుంభం
బును నిమ్నగర్తభాగం
బునఁ బొందుగఁ బాదుకొల్పి । పోయిన యంతన్. 736

## సీతాజననము

చ. జనకమహర్షి దేశమున । క్షామము దిక్కుల నాక్రమించెఁ, ద
జ్జనులకు క్షుత్పిపాసలును । సంకటముల్ చెలరేగ, నెక్కడన్
జినుకులు లేవు కర్షకుల । నేత్రయుగంబునఁ దక్క నక్కటా!!
వనము లెడారు లయ్యె, నిఁకఁ । బాడినశించిన, వింత యున్న దే!

ఉ. కుంది కృశించియున్న జన । కుంగని క్రుంగని తాల్మితో శతా
నందుఁడు "కుందనేల! జన । నాయక! జన్న మొనర్పు మింక నా
నందము మేర మీఱఁగ ఘ । నాఘనవృష్టి లభించు" నన్నఁ దా
సుందరమైన క్షేత్రమును జూచి, మునీంద్రులు ప్రోత్సహింపఁగన్.

చ. కనకహలంబుఁ బూని జన । కాంతుఁడు దున్నుచు నుండ భూమిలోఁ
గనుఁగొనయ్యె నొక్క వర । కన్య, విశాల సరోరుహేక్షణన్,
కనకలతాంగి, సన్మునుల । కన్నులకున్ మిఱుమిట్లు గొల్పఁగన్
జనులు వినూత్నరత్నఖని । సంచయ మంచు నుతింప నయ్యెడన్

క. ధన్యన్, మునిసన్నుత సౌ
జన్యన్, బుణ్యాగ్రగణ్య, । జనమాన్య, నసా
మాన్యన్, రూపానన్యన్,
గన్యన్, వీక్షించి, భూమి । కాంతుం డలరెన్. 740

ఉ. నారదుఁ డేగుదెంచి, జన । నాథునిఁ జూచి నుతించి, యీమె ధా
త్రీరమణీతనూజ యగు, । సృష్టికిఁ దత్స్థితికిన్ దలంప సం
హారిణి, యాదిశక్తి, గుణ । హారిణి, క్షీరపయోధికన్య, నీ
సీరమునన్ జనించె, భువి । సీత యనంగ నెసంగు భూవరా!

గీ. సకల కళ్యాణ సంధాత్రి । స్వర్ణగాత్రి,
పృథ్వినాయక! నీపుత్రి, । విష్ణునేత్రి,
అనిన విని మౌనికిన్ మ్రొక్కి । యభినుతించి,
జనకుఁ డాజగన్మాతకు । జనకుఁ డయ్యె. 742

రావణుని దారుణచర్యలు

గీ. ఈసమాచార మంతయు । నమరవైరి
రావణుం డాలకించి, ని । ర్లక్ష్యముగను,
దిక్కుల జయించి, శాసించి । త్రిభువనముల,
సూర్య చంద్రులఁ బాధ దా । సుల నొనర్చె. 743

గీ. సకల దిక్పాలు రతని సే । వకులు గాగ
నఖిల రత్నంబు లతని భో । గ్యంబు లయ్యె;
క్షుద్రతరకీర్తి, సంగర । రౌద్రమూర్తి,
వక్రపథవర్తి, రాక్షస । చక్రవర్తి. 744

క. పాకారి వీఁక యణఁచెను,
కోకారినిఁ గోకమిత్రుఁ, । గొని దివ్వెలుగా,
లోకారి యనఁగఁ జెలఁగిన
నాకారి జయింప రాదు, । నగరాట్పుత్రీ! 745

గీ. నిగమ! నిగమాంగములను దృ । శీకరించి,
బ్రాహ్మణుల గోవులం జంపి, । గ్రామనగర
జనపదంబులఁ గాల్చి, భ । స్మములఁ జేసి,
పాపముల కునికిపట్టయ్యె । వానిసుతుఁడు. 746

మ. భగవత్పూజలు,యజ్ఞముల్,జపతపః।స్స్వాధ్యాయముల్ దానముల్
జగతిన్ స్వప్నగతంబు లయ్యె, నెవఁడేన్ । సత్త్రంబులన్ బెట్టి,యు
ధ్వగులన్ బ్రోచిన, నత్వరంబ చని వి । ధ్వంసంబుఁ గావించు; పం
క్తిగళున్ మించెను మేఘనాథుఁడు ధరి । త్రీదేవి శోకింపఁగన్.

క. చోరులు, జారులు, నత్యా
చారులు, దుర్మార్గు లైన । శ్వపచులు, నీచుల్

కూరులు, బ్రాహ్మణమాంసా
హారులు బాధించి రకట! యవనీదేవిన్. 748

భూదేవి గోరూపము ధరించి యమరుల మొరలవిలపించుట

క. "సప్త కులపర్వతంబుల,
సప్తసముద్రముల, సకల జనులన్, ఖనులన్,
సప్తాశ్వు తీవ్ర తేజము,
సప్తద్వీపముల నోర్వఁ జాలియు నకటా !! 749

గీ. ఒక్క పాపాత్ము భరియింప నోప, నిపుడు,
ప్రబల విద్రోహు లెందఱో ప్రబలి రింక
నోపుదునె?" యంచు భూమి గోరూప మూని
అమరులం జూచి విలపించి యలసి సొలసె. 750

గీ. చేయునది లేక, కన్నులు చెమ్మగిల్ల
నపుడు భూదేవితోఁ గూడి యమరు లెల్ల
బ్రహ్మపాలికి నేతెంచి, ప్రస్తుతించి,
గొల్లు మని యేడ్చి యేడిచి, పల్లటిలిరి. 751

గీ. బ్రహ్మ చింతించి, దుఃఖింప వలవ దనుచు,
వసుమతిం జూచి, యకట, నా వశముఁ దప్పె,
నంతయున్ బరమాత్ముని యందు కలదు,
అభినుతింపుము, భగవంతు ననుదినంబు. 752

గీ. "అనిన విని వేల్పు లెల్లను నదియు లెస్స"
అనుచు నామోదముం బొంది రభినుతింప;
వసుమతీదేవి జలజాత భవునిఁ జూచి,
వెక్కి, క్రిటుచుఁ, గుం దొర్చి! వెచ్చనూర్చె. 753

శా. "పాడిం దప్పిన క్రూరులన్ దనుజులన్ । బాషండులం జెండి, కా
పాడం జాలినవాఁడు విష్ణు వనఁగా । నా నంచు సైరించితిన్,
రాడో? దైత్యుల సంహరింపఁడో? ననున్ । రక్షింపఁగాఁ జాలఁడో?
ఏడీ యాభగవంతుఁ డెందడఁగెనో? । యేచాయ నిద్రించెనో!

సీ. కాలాంబుదచ్ఛాయుఁ । బోలువాఁ డని నమ్మి,
యంభోధరంబుల । నభినుతించి
ఇందుభానులఁ బోలు । కందోయివాఁ డంచుఁ
జంద్రసూర్యులఁ జూచి । సంతసించి,
కమలకు నిల్లంచుఁ । గమలనాభుం డంచుఁ
గమలంబుఁ గాంచి, త । ద్ఘనత నెంచి,
చక్రివనుం డంచుఁ । జక్రధారియునంచుఁ
జక్రంబుఁ గిలకించి । సన్నుతించి,

గీ. జలధి వన శైలములఁ జొచ్చి । సంచరించి,
విసిగి వేసారితిన్ మేలు । పొసఁగ దనుచు,
డింది కుందితి; భగవంతుఁ । డెందుఁ గలఁడొ?
రాడొ? నా మొఱాలించి కా । పాడ లేడొ? 755

గీ. అనుచు విలపించు వసుమతి । ననునయించి,
ఉమ్మలించుచుఁ, గన్నులు । చెమ్మగిల్ల,
నుల్లములు తల్లడిల్లఁగ । నెల్ల వేల్పు
లించుకంత తాల్మిం బూని । యిట్టు లనిరి. 756

ఉ. "క్షీరసముద్రమందు నివ । సించు, సతంబును శేషశయ్య పైఁ
గూరుకుఁ జెందు, నెప్పుడు వి । కుంఠమునన్ విహరించు నందు రా
శ్రీరమణుండు, భూతదయఁ । బ్రేమముఁ గల్గిన భక్త వర్యులన్
జేరి రహించు నంద్రు ముని । శేఖరు లెల్లను; నిక్క మెట్టిదో?

గీ. దేశకాలంబులన్, సర్వ । దిక్కులందుఁ,
జిన్మయుం డయి దీపించు । శ్రీవిభుండు;
ఇందుఁగలఁ డందు లేఁడను । సందియంబు
వలదు వలదంద్రు కొందఱు । భక్తవరులు. 758

గీ. సర్వరహితుండవో? లేక । సర్వమయుఁడ
వో! విరాగివో? రాగివో? । యోగివో? త
లంపభోగివో? నిన్ను గ్ర । హింపఁగలమె?
ఆదిమధ్యాంతరహిత! కా । పాడవలదె?" 759

క. విని వేల్పు లాడు పలుకుల,
మనమున హర్షంబు భక్తి । మల్లడిఁ గొనఁగన్
గనుదోయి నీరమూరఁగ
వనజాక్షుని సన్నుతించె । వనజాసనుఁడున్. 760

బ్రహ్మకృత శ్రీవిష్ణుస్తుతి

రగడ;—"జయ జయ నిర్జర । సంతతినాయక!
జయ జయ సన్నుత । సన్మునిగాయక!
జయ జయ సజ్జన । సత్సుఖదాయక!
జయ జయ శంకర! । శంకరనాయక!
వరజన రంజన! । భవభయ భంజన!
శరణునిరంజన! । జ్ఞానాంధాంజన!
నిను వినుతింపఁగ । నేర్చును వేదము,
ఘనుఁడవు, నీమది । గాంచదు ఖేదము;
పరుఁడవు, పరనిజ । వాదవిభేదము
నరయక పొందెద । వతులామోదము;
అతులవిరాగీ! । యానతయోగీ!
అతిశయభోగీ! । స్వార్థత్యాగీ!

సురలన్ బ్రోవుము । సురరిపుశిక్షా!
నరులన్ గావుము । నరహర్యక్షా!
క్షమఁ జాలింపుము, । క్షమఁ బాలింపుము,
మము లాలింపుము. । మనవాలింపుము;
తనుజిత కంధర! । దళితజలంధర!
తనుభృత మందర! । దరనిభకంధర!
వనరుహనయనా! । వననిధిశయనా!
వినత ధరామర । వేదాధ్యయనా!
జయ జయ గోద్విజ । సంచయరక్షా!
జయ జయ రక్ష । స్సంఘువివక్షా!
జయ జయ సుందర । సద్గుణమందిర!
జయ జయ శ్రీముఖ । జలజేందిందిర!
పాహి సురాసుర । వందితచరణా!
పాహిచరాచర । పావనివారణ!
పాహి ముకుందా! । వంచితబృందా!
పాహి విమోహిత । వరమునిబృందా! 761

అభయప్రదానము

క. అని సన్నుతించి సంతసె
విని సర్వవ్యాపకుండు । పృథివింబ్రోవన్
వనజాసనుఁ దనియింపఁగ
దనమనమున నిశ్చయించి । దయనిట్లనియెన్. 762

మ. "వనజాతాసన! తాల్మిఁ బూనుమువనీ । భారంబు వారింపఁగా
జనియింతుర్ భువి రాఘవుండను; రక్షస్సంఘముం గూల్చెదన్,
జనులన్ ధర్మముఁ బాదుకొల్పెద, ధరన్ । శాసించెదన్, గోద్విజా
వనభారంబు వహించెదన్, నరనుప । ర్వశ్రేణికీర్తింపఁగన్.763

గీ. భువి నయోధ్యాపురంబున । రవికులమున
దశరథక్ష్మావనీశుని । తనయులమయి
నలువురము జనించెదముద్దె । త్యులవధింప;
నాదిలక్ష్మియు జానకి । యైజనించు" 764

చ. అనవుడు మేలు మేలనుచు । నందఱుసంతస మొంది రప్పుడా
వనజభవుండు, "వేలుపులు వానరులై భువి నుద్భవిల్లి, య
వ్వనరుహనేత్రునిం గొలిచి । పావను లౌదురు పొండుపొం" డనన్
విని కడు లెస్స యంచుఁ బృథి । వీసతిఁ దోఁ జని రెల్ల వేలుపుల్.765

శ్రీ రామ జననము

ఉ. కాఁపురమై జయేందిరకు, । క్ష్మాస్థలిఁ గాంపులు విదేశకోటికిన్
మూఁపురమై, ధరారమణి । నూపురమై, బుధసేవితావనీ
గోపురమై, సువర్ణమయ । గోపురమై,సురహృద్యమై, యయో
ధ్యాపుర మొప్పు, సంపదల । దాఁపురమై యలకాపురంబునాన్.

ఉ. ఆపుర మేలువాఁడు, సక । లాశ్రితకోటికి మేలువాఁడు సం
తాపము లేనివాఁడు, నృప । ధర్మమెఱింగినవాఁడు,సద్గుణా
వాపమనంగ ఖ్యాతిఁ గల । వాఁడు, మహాబలవంతుఁ డయ్యు,నా
వాపము లేనివాఁ డహహ । పంక్తిరథుం డనుతేఁడు; మాలినీ!

శా. ఆసుజ్ఞాని, పతివ్రతామణుల, మి । థ్యామధ్యలన్,ముగ్ధలన్,
గౌసల్యాదిపవిత్రశీలవతులన్, । కళ్యాణులన్ గూడి, వి
శ్వాసంబుంగలమంత్రులున్ భటులుఁ గొల్వన్ భూమిశాసించియున్
తోసం బేమియు లేక సన్నగిలెఁ బు । త్త్రిల్ లేనిలోపంబునన్

క. మగఁటిమిఁ గలవాఁ డయ్యున్
వగఁ బొగులుచు నుండె నతఁడు । వసుధ "నపుత్ర
స్యగతిర్నాస్తి" యనంగన్
నిగమజ్ఞులుపల్కినట్టి । నీతికినకటా! 769

క. గురువర్యుఁ జేరి తత్పద
సరసీజములకు నెఱఁగి, శ్రద్ధన్, భక్తిన్,
కరకమలంబుల మోడిచి,
పరితాపము భూవరుండు । వ్యక్తముఁ జేసెన్. 770

గీ. అవ్వశిష్ఠుండు దశరథు । ననునయించి,
"ఓ కుపుంబూను మనఘ! నీ । కుద్భవింపఁ
గలరు నలువురుసుతులు, జ । గత్ప్రసిద్ధు
లాశ్రితావనదక్షు ల । త్యధికబలులు." 771

గీ. అనిన విని హర్షముప్పొంగ । జనవిభుండు
మ్రొక్కు లర్పించి వెడలె; న । మ్మునివరుండు
పుత్రకామేష్టికిన్ యత్న । ముల నొనర్చి,
ఋష్యశృంగుని రప్పించె । నింటికపుడు. 772

ఉ. పొంగుచు నంతరంగమున । భూపతి మెచ్చెఁ, బదానురోధసా
రంగు, నధిష్ఠితాగమతు । రంగుని, నానతరాజమత్తమా
తంగుని, సజ్జనాంబుజప । తంగుని, భూతదయాంతరంగు, ని
స్సంగుని, యాగచంగు, గుణ । సంగు, నభంగుని, ఋష్యశృంగునిన్.

గీ. అమ్మునీంద్రుని యానతి । నవధరించి,
పుత్రకామేష్టిఁ గావించె । భూవరుండు;
భక్తినాహుతినీయ, వై । శ్వానరుండు,
అలరి, ప్రత్యక్షమై, యిచ్చెఁ । బాయసంబు. 774

క. "ఈపాయసంబుఁ గైకొని
భూపాలక! పంచియిమ్ము । సతులకు; దనుజా
టోపాంతకులన్, దనుజులఁ
బాపఘ్నులఁ గాంచెదీవు । వసుధావనులన్." 775

గీ. అనిన విని వీతిహోత్రునిఁ । గనినుతించి,
రెండుగాఁజేసి పాయసం । బొండు పెద్ద
భార్యకు నొసంగి, మిగిలిన । భాగ మొగినిఁ
గైకకున్ సుమిత్రకుఁ బంచె । క్ష్మావరుండు. 776

గీ. తనదుభాగంబులోని య । ర్థము మిగిల్చి,
ఆసుమిత్రకుఁ గౌసల్య । యందఁజేసె;
బ్రేమదైవార నెలమిసే । వించినంత
సతులు వరగర్భవతు లైరి । క్షితిపుఁ డలర. 777

క. జగముల నెల్లెడ నెలకొను
భగవంతుని దివ్యకాంతి । భరియించిన య
మ్మగువల చక్కఁదన మె
న్నఁగ వీక్షింపఁగ నలవియె । నలువకునైనన్. 778

ఉ. మేదినిఁ జైత్రశుక్లనవ । మీతిధినా డభిజిన్ముహూర్తమం
దాదివిరాట్స్వరూపమున, । నచ్యుతుఁ డవ్యయుఁ డీప్రపంచ మా
మోదముఁ బొంద రామనృప । పుంగవుఁ డై జనియించె;బూర్ణచం
ద్రోదయభూషితాంబునిధి । యోయనఁ బంక్తిరథుండు రాజిలన్.

క. ఆనందకంద మనఁదగు
శ్రీనాథుఁడు రాముఁ డవత । రించినయంతన్
ధ్యానించి రఖిలమానులు,
జ్ఞానులుఁ; జరము లచరములు । సంతోషించెన్. 780

గీ. వసుమతీజావలోకన । వైభవంబు
తనకుఁగా కన్యులకుఁ గల్గ । దనుచుఁ దెలుపు
గతిని, సుమసౌరభంబులఁ । గడలఁ జల్లి,
మలసె మలయసమీరకు । మారుఁ డపుడు. 781

సీ. వనవృక్షసంతతి, । ఫలపుష్పభారావ
నతము లై, భూమికి । నతు లొనంగె;
సర్వపర్వతపంక్తి । సకలలోహములకుఁ
గమనీయమణులకా । కరము లయ్యె;
స్వాదునిర్మలపూర్ణ । సలిలంబులం గల్గి
జలజలప్రవహించె । సకలనదులు;
దేవతామంగళా । రావంబు స్తుతిగాఁగ
నచ్చర లిచ్ఛమై । నాడి పాడి;

గీ. రంత నిర్ఝరు లామోద । మతిశయిల్ల
నలరువానలఁ గురిపించి । రఖిలదిశల;
సన్మునులమనోవీధి ప్ర । సన్నమైన
కరణి, గగనంబు నిర్మల । కాంతిఁ గ్రాలె. 782

సీ. నీలాంబుదశరీరు, । నిగమాంతసంచారు,
నమృతాంశునయను, శ్రీ । రాబ్ధిశయను,
నానతఫాలాక్షు, । మానవహర్యక్షు,
నాహవభీము, లో । కాభిరాము,
వరచతుర్భుజకాండు, । వరదానగుణశౌండు,
సద్భక్తజనలోలు, । సత్యశీలుఁ,
బంచాయుధోపేతు, । బహుళమాయాతీతు,
మకరకుండలకర్ణు, । సుకృతపూర్ణు,

గీ. శిష్టజనమానసోల్లాసుఁ । జిద్విలాసు,
నసురసంతాపుఁ,ద్రిభువన । వ్యాప్తరూపు,
శత్రుభీకరశస్త్రాస్త్రు, । స్వర్ణవస్త్రు,
విబుధవినుతవివిధవేషు, । వేదభాషు; 783

గీ. చూచికౌసల్య, భీతిల్లి । సొక్కి సోలి,
తెప్పిఱిలిలేచి, ఱెప్పల । నప్పళించి,
కన్నుఁగవవిప్పి, హస్తయు । గంబుమోడ్చి,
"దేవతావనదివ్యప్ర । భావ! దేవ! 784

క. శరణాగతావనాంతః
కరణా! శుభకారణ! వర । కరుణాభరణా!
చరణాశ్రయసన్మునిజన
భరణా! నిగమావతరణ! । భక్తావరణా! 785

క. ఈరూపుఁజూడఁజాలను,
శ్రీరామ! గుణాభిరామ! । శిశురూపము ము
ద్దారం జూపింపుము, నా
గారాబము మేరమీఱఁ । గాంచి నుతింతున్. 786

క. కరమక్కజంబుఁ గొలువఁగ
నరుణాంబుజనేత్ర యిట్టు । లాడినయంతన్
వరదుండు సంతసించెను
దరహాసం బాస్యసీమఁ । దాండవమాడన్. 787

ఉ. మాయ కలితుఁడై సకల । మానవకోటి నుతింప, నాదినా
రాయణుఁ డర్కవంశమున । నాకృతిఁదాల్చి జనించి, భక్తిమై
నాయమ వేడుటన్ శిశువు । నాకృతి వెండియు నేడ్చుచుండె, నో
హో" యని యెల్లఱున్ దశర । థోర్వివిభున్ గొనియాడసత్తఱిన్.

గీ. మఱియుఁ గైకేయి యొక్కకు । మారుఁ గాంచె
నలసుమిత్రయు నిరువుర । నెలమిఁ గనియెఁ;
దనుజులన్ నల్వురంజూచి । దశరథుండు
పేద పెన్నిధిం గనినట్లు । మోద మందె. 789

సీ. కులపురోహితుఁ డైన । గురువర్యునానతి
నవధరించి, మునీంద్రు । లనుమతింప
జాతకర్మాదుల । శ్రద్ధతో నొనరించి,
బ్రాహ్మణుల కనర్ఘ । రత్నములను
ధనధాన్యవస్తువా । హనముల, గోవులన్,
గృహములఁ,దనివోవఁ । బ్రీతినొసఁగెఁ;
గస్తూరిగలనీరు । కలయంపిగాఁజల్లి,
గంబూరముగ్గులఁ । గలయఁదీర్చి,

గీ. వరపతాకంబులన్ సౌధ । పాళిఁ గట్టి,
పురవరంబునఁ బౌరు లు । ప్పొంగిపోరఁ
బొంకముగ రాజవీధి న । లంకరించి
రెల్లజనుల యుల్లములు రం । జిల్లునట్లు. 790

గీ. ఆకసమునుండి పుష్పంబు । లవనిఁ గురిసె,
స్వర్ణకలశంబులంబూని । సతులు వచ్చి
"మంగళముమంగళం"బంచు । మధురగాన
మింపెనఁగఁబాడి దీవన । లిచ్చి రెలమి." 791

గీ. పట్టపగలయ్యు నగరు ధూ । పములవలన
నంధకారంబు వ్యాపించె । నఖిలదిశల
రత్నములు తారకలఁ బోలి । గ్రాలుచుండె;
రాత్రి యేతెంచెనేమొ శ్రీ । రాముఁ జూడ. 792

గీ. "అవనిఁ గాపాడ శ్రీరాముఁ । డవతరించె
మేలుకొనుఁ"డంచు వఱువాత । మేలుకొలుపు
ద్విజకులారావమో యన । ద్విజవరేణ్య
వేదనాదంబు దిక్కులఁ । బిక్కటిల్లె. 793

సీ. నీలాంబుదచ్ఛాయఁ । బోలు దేహమువాఁడు
వనరుహంబులనేలు । కనులవాఁడు
సంపెఁగఁబోలిన । చారు నాసికవాఁడు
సోముని వలపించు । మోమువాఁడు
కంతుచాపముఁ బోలు । కనుబొమఁగలవాఁడు
డంబైన కంబుకం । ఠంబువాఁడు
ఆజానులంబ బా । హాదండములవాఁడు
కమలామనోజ్ఞవ । క్షంబువాఁడు
గీ. శోభ కావాల మగు నిమ్న । నాభివాఁడు
పిడికిటం జిక్కు తడఁబడు । నడుమువాఁడు
అతని యందంబుఁ జందంబు । నభినుతింప
నలవియే ? చూడవలెఁగాక । యలరుబోణి ! 805

గీ. ముత్యములఁబోలినఖ కాంతి । పొలుపుమిగులఁ
గులిశకేత్వంకుశాదిరే । ఖలు రహింప
నినదమింపొంద క్షుద్రఘం । టికలు మ్రోగ
మెలఁగు చరణారుణాంబుజం । బుల నుతింతు. 806

చ. కలుములచాన కేలుఁగవఁ । గ్రాలెడు కమ్మని తమ్మిపూవులై
తెలిజిగిఁ దేలు పుష్కరన । దిన్ బ్రియమారఁగఁ గన్నతల్లులై
బలిబలసాహసంబులను । బల్మి నడంచిన పర్వతంబులై
అలరు పదాంబుజాతముల । నాత్మఁ దలంచి నమస్కరించెదన్.

చ. మగువ చరాచరప్రతతి । మాయకుఁ జిక్కి మెలంగు, మాయ యా
భగవదధీన మాత్మభగ । వంతు భజింపకయున్న, మాయయున్
మొగులునఁ జిక్కి జ్ఞానమను । ప్రొద్దు రహింపకయుండుఁ, గావునన్
జగదవనార్థమై యిలనె । సంగిన బ్రహ్మము రాముఁ గొల్చెదన్

శ్రీరామబాల్యక్రీడాభివర్ణనము

క. జననీజనకుల మానస
వనజంబు లమందహర్ష । వారిధి నలరన్,
ఘనమాయామానుషుఁ డ
వ్వనజాతాక్షుఁడు నటించె । బాల్యక్రీడన్. 809

క. బాలుని విశాలఫాలునిఁ
బాలించుచు ముద్దులొలుకఁ । బాలిచ్చి, కడున్
లాలించుచు హర్షాంబుధిఁ
దేలించుచు రాజమహిషి । దినములు గడపున్. 810

గీ. తల్లి కౌసల్య యొకనాఁడు । దాశరథిని
జలక మాడించి, పసిఁడి సొ । మ్ములనలంక
రించి, యుయ్యెలంబెట్టి, ని । ద్రింపఁజేసి,
స్నాన మొనరించి దేవతా । ధ్యానవిధికి. 811

గీ. ఎలమిఁ బూజాగృహంబున । కేగి యందు
వేల్పులకు మ్రొక్కులిచ్చి, నై । వేద్యమునకుఁ
బాకశాలకుఁ బోయి, యో । పంకజాక్షి!
చూచె నొకవింత నెంతయుఁ । జోద్యముగను. 812

క. బాలుఁడు శ్రీరాముం డా
శాలాంతరపక్వభక్ష్య । సందోహంబున్
లీలన్ దినుచుండఁగ నో
బాలా! వీక్షించి యామె । భయమొంది వడిన్. 813

క. రుద్రాణీ! వినుము, సందే
హోద్రేకముతోడ నేగి । యురుతరగాత్రున్

నిద్రాముద్రితనేత్రుఁన్
భద్రాకృతిఁ గ్రాలురామ । భద్రుం జూచెన్. 814

చ. ఇరువురరాములం గని యి । దేటివిచిత్రమొ యంచు, దైవమా
కరము భయంకరం బనుచుఁ । గంపితగాత్రమునం గలంగి, యు
ర్వరఁబడి తల్లడిల్లె; రఘు । రాముఁడు తల్లికిఁ దోచినట్టి యు
య్యరమరఁబాప లోఁదలఁచి । యంతటఁజూపెను విశ్వరూపమున్.

విశ్వరూపప్రదర్శనము

సీ. ప్రతిరోమకూపంబు । బ్రహ్మాండములతోడ
శోభాయమానమై । చూడ నొప్పెఁ
గనులెత్తి చూడ శ । క్యంబెయ్యేరికినైనఁ
జంద్రార్కబింబసం । చయము దోచె
నహినాథునకు నైన । నలవియే లెక్కింప,
నక్షత్రకోటియుఁ । దటరహించె
సకలచరాచర । సంతతి యట్లుండ
బ్రహ్మాదిదేవతా । ప్రతతివఱలెఁ
గీ. బర్వతంబులు నదులును । వారినిధులుఁ
గాననంబులు భూములుఁ । గాననయ్యెఁ,
గాలకర్మగుణజ్ఞాన । లీలలెల్ల
నరుసఁ గన్పట్టె విశ్వరూ । పంబునందు. 816

మ. కలయో మేల్కొనియుంటినో యకటజా । గ్రత్స్వప్నసందిగ్ధసం
చలితస్వాంతమునన్ మతిభ్రమను వి । జ్ఞానంబుఁ గోల్పోతినో?
తలఁపన్ బాలునియందు నిట్టివిపరీ । తం బెట్లుగన్పట్టెనో ?
తెలియన్ శక్యమె యంచు నవ్వనిత భ । క్తిన్ మోడ్చె నేత్రంబులన్

ఉ. స్వేదకణంబు లాస్యమునఁ । జిందులు ద్రొక్క, భయంబు పెంపునన్
పాదయుగంబు తల్లడిలఁ । బంకజనాభు ననంతలీలలన్
బైదలి సన్నుతించె నెద । భక్తియు విస్మయ మావరింప; నా
మోదముఁ బొందిరాఘవుఁడు । ముద్దుగఁ దాల్చెను బాలరూపమున్

గీ. కాలము గతించెఁ గొంత నీ । లీలనంత
నన్నదమ్ములు పెద్దవా । రై రహించి
రందు రాముండు విద్యల । నభ్యసించె;
నతనిశ్వాసమే వేద । మంబుజాక్షి! 819

గీ. వరధనుర్బాణధారి యై । వఱలువాని
రామచంద్రుని, లోకాభి । రాముఁ జూచి
భువిఁ జరాచరవితతి, వ్యా । మోహవార్ధి
నోలలాడుచు నుండెనో । లోలనయన! 820

సీ. సఖులు సంతోషింప । సంచరించుచునుండు
వేఁటకాండ్రింగూడి । వేఁటలాడు
దల్లిదండ్రులయాజ్ఞఁ । దలఁదాల్చి పాలించు
ననుజుల కనుకూలుఁ । డై మెలంగు
నితరోపకారంబె । హృదయంబునం గోరు
నాశ్రితజనులఁ గా । పాడుచుండు
నెట్టిశాత్రవునైన హింసింప వెనుదీయు
ధర్మమార్గముఁ బ్రోవఁ । దలఁచుచుండు

గీ. సకలవేద పురాణాది । శాస్త్రములను
ననుజులకుఁ జెప్పు టట్లుండ । నఖిలజనులు
నభ్యసింపంగ బోధించు । ననవరతము
నుప్రసన్నుఁ డై యుండునో । సుందరాంగి! 821

చ. కరుణకు నునికిపట్టనుచు । క్ష్మాస్థలిఁ బ్రోవఁగఁ బుట్టినట్టి యా
సరసిజనేత్రుఁ డంచు, ముని । చంద్రులు మేలన నంచరించు దా
శరథిని, సాత్త్వికోదయుని । శాంతునిఁ బ్రాణసమానుఁగాఁ జరా
చరములలోఁ దలంచుగిరిజా! యనుమానము మాను మాత్మలో.

గీ. అచ్యుతుఁ డజుఁడు త్రిభువన । వ్యాపకుండు
నామరూపవిహీనుండు । రాముఁ డతివ!
ధర్మసంస్థాపనార్థంబు । ధరణియందు
నాకృతిం దాల్చి మనుజుఁ డై । యవతరించె. 823

విశ్వామిత్రుఁడు దశరథునిఁ జూడవచ్చుట

గీ. జలజగంధి! గాధిసుతుండు । జపతపోగ
రిష్ఠుఁ డయ్యును సన్ముని । శ్రేష్ఠుఁ డయ్యు
నీచులైన సుబాహుమా । రీచదనుజ
పుంగవుల ఘోరబాధకుఁ । బొనువడంగి, 824

చ. తనదుతపోబలంబునను । దైత్యులఁ జంప వలంతియయ్యు, న
ట్లొనరుప నేటికంచు, నతు । లోగ్రతపోధనరక్షణార్థి యై,
మునులను బ్రోవఁగన్ బుడమిఁ । బుట్టిన శ్రీరఘురాముఁ డధ్వరా
వనమున కోపునంచు జన । పాలునిఁ జూడఁ దలంచి చెచ్చెరన్.

గీ. సరయునదిలోనఁ దనివోవ । స్నానమాడి
భూతిఁ దాలిచి జపతపం । బుల నొనర్చి
యోధుల కసాధ్య మైన య । యోధ్య కేగి
ఎలమి నృపునకుఁ దనరాక । నెఱుకపఱచె. 826

క. మునినాథుఁ డైన గాధిజుఁ
డనఘుం డేతెంచె నంచు । నవనీనాథుం

డనుసరితోర్వీసురుఁడై
చని రం డని గారవించె । సంయమివర్యున్. 827

గీ. భూసురుల వేదనాదంబు । బోరుకలఁగ
నర్ఘ్యపాద్యాదిపూజల । నాదరించి,
ఇష్టమృష్టాన్నమునను సం । తుష్టిపఱచి
"అనఘ భవనంబు పావన । మయ్యె ననుచు" 828

క. వినయానతుఁడై జనపతి
తనయావృతుఁడై యొరంగి । ధన్యుఁడ ననుచున్
దనయాసన మిచ్చిన యం
తన యామోదించె గాధి । తనుజుం డాత్మన్. 829

గీ. దైత్యులను సంహరింపంగ । ధరణియందు
మానవాకృతిఁ దాల్చిన । భానుకులజు
రాము నీక్షించి హర్షించె । రాజమౌని;
కైరవప్రియుఁ గనిన చ । కోరమట్లు. 830

ఉ. అచ్చపుభక్తి నెక్కొనఁగ । నంత నరేంద్రుఁడు రాజమౌనితో
ముచ్చటలాడి, "యాశ్రమము । పొంత మృగంబుల బాధ లేదుగా,
ఇచ్చటి కేగుదెంచుటకు । హేతు వొకించుక యుండవచ్చు, మీ
వచ్చినకార్యమున్ జెవుల । పండువుగా నెఱిఁగింపరే దయన్?"

ఉ. నావుడు రాజుఁ జూచి, ముని । నాయకుఁ డాననినవ్వియిట్లనున్:-
"భూవర! నిన్నుఁ బోలు నృప । పుంగవులుండఁగలోపముండునే?
పావననాము రాము సుర । వంద్యునిఁ గంటివి, దైత్యకోటికిన్
జేవ యణంగకున్నె ముని । శేఖరు లెల్లను సంతసింపఁగన్. 832

క. ఓ నరనాథశిరోమణి !
భానుకులాంబుధిశశాంక! । వడి మామనవిన్

వీనుల నిడి రక్షింపుము;
మానవులు కుందిరి సుబాహు । మారీచులచే. 833

ఉ. వార లసాధ్యు లెట్టినృప । వర్యున కే, నలికాక్షుఁ డైన నీ
క్రూరులఁ జంపఁజాలఁడు; వి । కుంఠమునన్ నివసించుమాధవుం
డీరఘురామచంద్రుఁ డొకఁ । డే వధియింపఁగ నోపు, భూవరా!
మారువచింపరాదువిను।మా! యుభయం బనుమా శుభంబగున్

ఉ. ద్రోహులరాక్షసాధములఁ । ద్రుంచి, జయేందిరఁ బెండ్లియాడఁగన్
శ్రీహరి యైన రామునకుఁ । జెల్లు; శుభం బగు నమ్ము మింకసం
దేహముఁ బొంది జ్ఞానమును । ద్రొక్కని భీతిలి పుత్త్రుఁడంచు వ్యా
మోహవశంబునన్ గలఁతఁ । బొందకుమా నరనాథచంద్రమా.

చ. నరవర! రామలక్ష్మణుల । నావలుకుల్ విని పంపుమా మద
ధ్వరమును బ్రోవఁగాఁ దగిన । వారలు దైత్యులఁ జంపఁబుట్టి రు
ర్వర; నరమాత్రులంచు సమ । రంబున హాని ఘటిల్లునంచు లో
నరమరఁ గుంద నేటి కను । రాంతకు లెంతకుఁ జాల రింతకున్.

దశరథుని పరితాపము

చ. అన విని తెల్లఁబోయి తన । యా యని రాముని ముద్దులాడుచున్
గనుఁగవబాష్పతోయములఁ । గ్రక్కుచు వెక్కుచు వెచ్చనూర్చుచున్
వనమునఁ గ్రూరదానవుల । బాధకు నోపునె చంటిబిడ్డఁ డో
మునివర! యంచుఁ గాళ్ళఁబడి । మొక్కుచు నానరనాథుఁ డిట్లనున్.

సీ. "అతులపరితాపవి । ఖ్యాతిఁ గాంచినయట్టి
పావనవంశ సం । భవుఁడ వీవు
ఫాలాక్షుఁ డైననిన్ । బరిభవింపఁగ లేడు
భీకరశస్త్రాస్త్ర । వేది వీవు

సకలలోకంబుల । శాసింపఁ జాలుదు
వందితభూపాల । వరుఁడవీవు
సృష్టికిఁ బ్రతిసృష్టి । సృష్టింప నోపుదు
బ్రహ్మీభవించిన । వాఁడ వీవు
గీ. వరయశస్వి తేజస్వి త । పస్వియనుచు
జనులు వినుతింప నెసఁగిన । ఘనుఁడవీవు
శాత్రవుల నిర్వైరం జంపఁ । జాల వేనిఁ
బాలుదాౕవెకు రాముఁడా । వలఁతి చెపుమ! 838

గీ. రాజ్య మిచ్చెదఁ గైకొమ్ము; । ప్రాణములను
ధారవోసెదఁ దనియుము; । దయఁ దలంచి
నన్నుఁ గోరుము; చక్కని । చిన్నవాని
రామభద్రుని నెడఁబాసి । బ్రదుకఁజాల. 839

ఉ. అక్కట! సూర్యవంశకల । శాంబుధిచంద్రుఁడు బాలరాఘవుం
డెక్కడ, భీకరాయుధము । లెక్కడ, దుర్గమ మైన కాననం
బెక్కడ, మాంసభుక్కులయి । యేపుగఁ గ్రొవ్వినవారితోరణం
బెక్కడ, బల్మిమైఁ దునుము । టెక్కట, యివ్విధిఁ గోరవచ్చునే!

ఉ. పాడిఁ దలంపుమయ్య, బల । వద్రిపుకోటి జయించు సైన్యముల్
దోడుగ నిచ్చెదన్, దనుజ । దోర్బలమున్ హరియింప నేను బో
రాడెదఁ, బోరి ప్రాణముల । నైనఁ ద్యజించెద నంతెకాని, నో
నాడకు మౌనిసింద్ర! విడ । నాడఁగఁజాలను రామభద్రునిన్"

ఉ. మానవుఁ డంచు లోఁదలఁచిమాధవు రామునిఁ బంపఁజాల నం
చానరనాథుఁ డిట్లు తన । యజ్ఞత వెల్లడిఁజేయఁ బిన్నన
వ్వానన సీమఁదోప విని । యానని యమ్మని మిన్నకుండె న;
జ్ఞానము వెల్లడింపఁ దగు । నా యని నవ్వి వశిష్ఠుఁ డిట్లనున్.

ఉ. ‹‹ఓనరనాథ వంశకల । శోదధిపూర్ణశశాంక! రామునిన్
మానవుఁగాఁ దలంచి వెడ । మాటలఁ బల్కెద వైననేమి, యి
మ్మానికి మ్రొక్కి వేగమె కు । మారుల ధీరుల యుద్ధవీరులన్
దానవవైరులన్ బసిపి । ధర్మపథంబును బ్రోవు మిత్తఱిన్. 843

గీ. అధ్వరావనదక్షు లీ । యలఘుబలులు
సమరభీములు, క్రూరరా । క్షసులవలన
హానిచేకూరు ననుచు లో । నడలవలవ
దధిప! నీకుమారులకుఁ గ । ల్యాణ మగును. 844

ఉ. స్థాణునిచిత్తమం దెవఁడు । సంతతమున్ నివసించు, నంబుజ
భూ్రిణులఁ గన్నవాఁ డెవఁడు, । భూవర! రాముఁడు గాఁడె! దానవ
ప్రాణములన్ హరింపఁ బను । పందగు నిమ్మునితోడ; నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము । నై విలసిల్లును నీపురం బిలన్.”

దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రుతోఁ బంపుట

చ. అన విని ఱేఁడు గాధిజున । కాదట వంగి నమస్కరించి, యో
యనఘ! త్వదీయభాషణము । లాగమబుక్కుల యంచు నధ్వరా
వనమున కీకుమారులను । బంపెద, నవ్విధి నాదరింతువో?
వనమున నెట్లు ప్రోచెదవో! । భారము నీయది యింతయేటికిన్.

గీ. అనుచు వచియించి బాష్పంబు । లను త్యజించి
తనకుమారుల మున్నిడి । దశరథుండు
‹‹అనఘ! మజ్జీవనాధారు । లైనసుతుల
నొసఁగితిని నీకు'' నని మిన్న । కుండె నపుడు. 847

మ. ‹‹భళిరే! ధన్యుఁడ వైతి నీవలన స । ప్తద్వీపభూపాలదో
ర్బలనాశంకరదుర్మదాసురకుల । ప్రధ్వంస విద్వాంసులన్

బలులన్ బంపితి వీవు మత్సవనమున్ । బాలింప, నాలింపుమా
తలపూ వాడదు నీకుమారులకు నో । ధాత్రీశ! కళ్యాణమా."

గీ. అనుచు హర్షించి శ్రీరాము । నఘవిరాముఁ
గౌఁగిటం జేర్చి ముద్దాడి । గాధిసుతుఁడు
జనని యనుమతిఁ గైకొని । సత్వరంబ
వత్స! చనుదె మ్మనుడు భక్త । వత్సలుండు. 849

గీ. వల్లె యని తల్లిఁ గాంతామ । తల్లిఁ గాంచి
మస్తకము వంచి యోఁమిన । మస్కరించి
జరిగినయుదంతముం జెప్పి । జంకకుమని
యనుమతింగొని యమ్మౌని । ననుగమించె. 850

గీ. బాణబాణాసనోగ్రకృ । పాణములను
గవచములఁ బూని యమ్మౌని । కాంతు ననుగ
మించు నబ్బాలవీరులఁ । గాంచినంత
శూరులకు గుండె లదరవె । సుందరాంగి! 851

సీ. అర్ధేందునిభఫాలు, । నాశ్రితావనలోలుఁ,
బరరాజహరరంహుఁ । బురుషసింహు
నరుణాంబురుహనేత్రు । శ్యామసుందరగాత్రు,
సంగరోత్సాహు, నా । జానుబాహుఁ,
బాపనాశంకరు, । భక్తవశంకరు,
బలవంతు, ధృతిమంతుఁ, । బరమశాంతు
రవికులాంబుధిచంద్రు, । రంజితమౌనీంద్రు,
సర్వలోకవ్యాప్తు । సజ్జనాప్తుఁ

గీ. జిత్కళోల్లాసుఁ, బీతకౌ । శేయవాసు
నఘువిరాము, శ్రీరాము, లో । కాభిరాము

వివిధభంగుల వినుతించి । విప్రవరులు
విద్య, యీరీతి మూర్తిభ । వించె ననిరి. 852

గీ. పృథివి భారంబు వారింప । విప్రవరుల
నమరులఁ, గోవులన్ బ్రోవ । నవతరించి
నట్టి యీ రాకుమారుల । నభినుతింప
నగునె" యని యెంచి యెంతయు । నాత్మ నలరి. 853

గీ. బాణతూణీరచాపకృ । పాణములను
గవచములుఁ గ్రాల నేతెంచు । క్షాత్రబాల
వీరపుంగవులం గూడి । వెఱపుఁదక్కి
అడవివెంబడి యమ్మౌని । వెడలుచుండ. 854

### శ్రీరాముఁడు తాటకను సంహరించుట

చ. అరుణరుచిప్రకీర్ణనయ । నాంతకనీనికలన్ రహించి, భీ
కరశితదంతకుంతచయ । ఖండితమానవకంఠరక్తసి
క్తరసనయై, మృగాంత్రమయ । కంధరయై, ధృతమండలాగ్రయై
ధరపదఘట్టనంగదలఁ । దాటక వచ్చె నకాలమృత్యువై. 855

చ. గడగడఁ బాదముల్ వడఁక । గా మునినాయకుఁ డాపెఁ జూచి లో
నడలుచుఁ జూచినాడవె న । రాశని ధిక్కృతభీకరాశనిన్?
దడయక యొక్క బాణమును । దానియురంబును నాటి వెల్వడన్
విడువుము, నాతియంచుఁ గరు । ణింపకుమా, రఘువీరపుంగవా!

మ. అనినన్ రాముఁడు మౌనిచంద్రుఁ గని "యు । గ్రాస్త్రంబు సంధించి యి
వ్వనితన్ గూలిచి సర్వలోకసుమనో । వ్రాతంబు రక్షింతు నో
యనఘా" యంచు వధించె సాంద్రవనస । త్త్వాఖేటకన్ శోణితా!
జనయుక్ఖేటక నిర్జనీకృతమహా । శృంగాటకన్ దాటకన్. 857

గీ. పార్వతీ! రామచంద్రుని । బాణనిహతిఁ
బుణ్యజనకాంత యేగెఁబో । పుణ్యగతికి ;
నమ్మునీంద్రుండు శ్రీరాము । నభినుతించి,
యర్హుఁ డని యెంచి యఖిల వి । ద్యల నొసంగె. 858

గీ. మానియొసఁగినవిద్యల । మహిమవలన
క్షుత్పిపాసలు లేకుండె । సుందరాంగి;
అంతకంతకు నతనిదే । హంబునందుఁ
బృథుబలంబుఁ దేజంబు నా । విర్భవించె. 859

సూర్యాస్తమయవర్ణనము

మ. ఇనవంశీయుఁ డొకండు నేటికొకస్త్రీ । నీరీతి హింసించునే
యని చింతించి విచారభారమున నయ్యర్కుండు మందోష్ణుఁడై
తన కైకుందు పతంగసంచయునినా । దం బాశలన్ బర్వఁగన్
జనియెన్ బశ్చిమదిఙ్మహాంబునిధికిన్ । స్నానార్థి యై మానినీ!

సంధ్యాసమయవర్ణనము

గీ. తాటకాముఖోద్గతశోణి । తంబుఁబోలి
సాంధ్యసమయంబు దీపించెఁ । జరమదిశను;
అసురమాయను దలఁపింప । నంతకంత
కంధకారంబు వ్యాపించె । నఖిలదిశల. 861

చ. కుధరతనూజ! రాక్షసులఁ । గూలిచి ధర్మపథంబుఁ బాదుకొ
ల్ప ధరణిఁ బుట్టినట్టి రఘు । వర్యుని యాదిజయప్రసిద్ధి, న
భ్రపథఫలకంబునన్ సురలు । వ్రాయఁగ రాజిలు నక్షరంబులన్
విధమునఁ దోచెఁ దారకలు । విస్ఫుటకైరవదీప్తివర్ధిలన్. 862

ఉ. అంతమునీంద్రుఁ డారఘుకు । లాంబుధిచంద్రులఁ గౌఁగిలించి,మీ
రెంతకుఁజాల రీదనుజ । నింతకుఁదెచ్చిన మీప్రతాపమున్
నుంత నుతింపఁజాలు రణ । శూరులు లేరు కుమారులార! నా
వంత నశించె నంచుఁ బరి । పక్వఫలంబుల నిచ్చె మెచ్చుచున్.

గీ. ఆతఁ డొసఁగినఫలముల । నారగించి
నిర్భయంబుగ మౌనితో । నిదురవోయి
వేకువన్ లేచి యబ్బాల । వీరవరులు
అమ్మునీంద్రున కిట్లని । రధిక భక్తి. 864

మ. అనఘా! మే మొనరింపఁజాలుదుము దై । త్యధ్వంసకార్యంబుఁ బా
వనయజ్ఞంబునకుం గడంగుము, భవ । త్పాదంబులన్ గొల్చుచున్
వనముం గాచుచు నుందు మన్న విని వి । శ్వామిత్రుఁ డాఁగాకయం
చొనరింపన్ దొడఁగెన్ మహాధ్వరముద్దై । త్యోత్సాహముల్ నెక్కొనన్.

రామలక్ష్మణులు సుబాహుమారీచాది దనుజుల సంహరించుట

గీ. అంత విఘ్నమాపాదింప । నాత్మనెంచి
బింక మిగురొత్త హుమ్మని । హుంకరించి,
పండ్లు పటపటఁగొఱుకుచు । బయలువెడలి,
నీచుఁ డైనట్టి మారీచుఁ । డేచె నకట. 866

గీ. తాచుఁబోలిన నీచు మా । రీచుఁ జూచి
రాముఁ డనిలాస్త్రమును సత్వ । రముగ నేసెఁ;
దూల మనఁగఁ దదస్త్రవా । తూలమునకుఁ
దూలి గిరగిరఁ దిరుగుచు । ధూళిఁబోలి 867

గీ. కడకు శతయోజనాంతమా । జడధినడుమఁ
బడియుఁ దక్కించుకొనె వాఁడు । ప్రాణములను;

పిదప నాగ్నేయమున బాల । వీరవరుఁడు
భస్మరాశిగఁ జేసె సు । బాహుదనుజు. 868

గీ. అంత లక్ష్మణుం డసురసై । న్యము వధించె,
వనము నిష్కంటకం బయ్యె । ననుచు మునులు
బ్రాహ్మణులు సంతసించి దీ । వనల నిచ్చి
వేయివిధముల మెచ్చి ర । వ్వీర వరుల. 869

రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిలాపురమునకు వెడలుట

క. ప్రథమ ప్రధనంబుననే
ప్రథితాసురమారకు లన । భాసిలి పిదపన్
మిథిలాపురధనురధ్వర
విధిఁ జూడఁ గ రాజసుతులు । వెడలిరి మునితో. 870

గీ. రాజఋషితోడఁ జనిచని । రాజసుతులు
కాడుచందాన నెంతయుఁ । బాడువడిన
గౌతమునియాశ్రమంబున । రాతిబండ
నొండు వీక్షించి రంత ర । ఘూద్వహుండు. 871

అహల్యాశాపవిమోచనము

గీ. గాధిసుతుఁ జూచి యిట్లనెఁ । గరుణఁదోప
ననఘ ! యియ్యది యెవ్వని । యాశ్రమంబు
ఇట్లు మరుభూమి యై యుండ । హేతు వేమి ?
ఒండు రాబండ నడుమ ని । ట్లుండు టేమి ? 872

గీ. అరయఁ గడు వింతగా నున్న । దానతీవె ?
యనవుఁడు మునీంద్రుఁ డిట్లను । నఘవినాశ!
ఈశసన్నుతజగదీశ! । నాశరహిత!
ఈవెలుంగని వింత యెం । దేనిఁ గలదె! 873

గీ. కోడిగముఁ గోరి కోపి యై కోడెకాఁడు
వేలుపుల ఱేఁడు గౌతము వెలఁదిఁ గూడె;
నమ్మునీంద్రుండు హరి సహస్రాక్షుఁ జేసె
నాతి నీరీతిఁ గావించె నలిననేత్ర! 874

చ. అలఘుచరిత్ర! నీదు చరణాబ్జరజంబును గోరుచున్నదీ
శిల కరుణింపవే యనిన శ్రీరఘురాముఁడు గౌతమున్ మదిన్
దలఁచి నమస్కరింపుచుఁ బదంబున నించుక దాకి నంతనే
శిల జలజాక్షి యయ్యె ముని శేఖరు లెల్లను సన్నుతింపగన్.

గీ. అఘవిరాము, శ్రీరాము, లోకాభిరాము,
సద్గుణస్తోము, జయధాము, సమరభీముఁ,
బ్రణతసుత్రాము, వీక్షించి వంచె మోము,
సతులశృంగారరసకుల్య యాయహల్య. 876

అహల్య శ్రీరాముని స్తుతియించుట

గీ. తనదుచరితంబు కారణంబున జనించు
సిగ్గునకుఁ దోడు మదిఁ జోద్య మగ్గలింపఁ
జెమ్మటలు గ్రమ్మ నాకొమ్మ సొమ్మసిల్లి
మ్రానువడి డీలుపడి యుండె మానసమునను. 877

గీ. పలుక నంకించు, వెండియు పలుకువలనఁ
గిన్కఁ గవమూయు నెట్టెటో కట్టకడకు
మోము నించుక యెత్తి శ్రీరాము నిట్ల
లలన వినుతించె నెలమి లోనలమికొనఁగ. 878

గీ. నతశతానంద! యచ్యుతానందకంద!
దేహజితకంద! వందిత త్రిదశబృంద!

గిరిశహృదయాంబుజమిళింద! । హరిముకుంద!
అనఘ! గోవింద! నేత్రజి । తారవింద!. 879

చ. జయజయ రాజపుత్త్రి! సుర । సన్నుతదివ్యచరిత్ర! పావనం
చయవనవీతిహోత్ర! ముని । శాప మొసంగిన కారణంబునన్
దయఁగల నీపవిత్రముఖ । దర్శనభాగ్యము నాకుఁ జేకురెః
భయము తొలంగె నోవరద! । భక్తజనావన! లోకపావనా.!

శా. ఏనీదర్శన మబ్జసంభవుఁడు వి । శ్వేశుండు, నాకేశుఁడుః
మౌనుల్ జ్ఞానులుభక్తులున్ సతతమున్ । వాంఛించి ధ్యానింతురో
ఆనీదర్శన మప్రయత్నముగ ల । భ్యంబయ్యె నా కియ్యెడన్
తూర్ణనాధాన్వయవార్ధిశీతఘృణి! రా । మా! దేవచూడామణీ!

మ. జలజాతంబుల నేలు నేత్రములు, శ్రీ । స్థానంబు వక్షంబు, భ
క్తులఁ గాపాడు వరప్రదానమునఁ జే । తుల్, భూతలంబాదిగాఁ
గలలోకంబుల నెజ్జ బొజ్జ, నిను వ । ర్ణింపఁగా శక్యమే?
బలిచూడామణి నీదుపాదఘృణి, దే । వా! భక్తచింతామణీ!

గీ. భర్తపదపద్మములఁ గొల్చి । బ్రదుకుకంటె
వాంఛ వేఱొండు లేదు నా । భావమునఁ,
జలదనిభగాత్ర! భాస్కర । కులపవిత్ర!
దశరథనుపుత్త్ర! పాపల । తాలవిత్ర. 883

క. అని రాము నాసతిం గొని
వనితామణి భర్తయుండు । పజ్జకు నేగెన్;
మునితోడ బాలపీనులు
చనిచని వడిఁ జేరి రంత । చదలేటిదరిన్. 884

గంగావతరణవృత్తాంతము

క. గంగః, రంగత్తుంగత
రంగః, భర్గోత్తమాంగ, । భ్రమదురుభృంగీ

భృంగన్, బావఘ్నాభి
ష్వంగన్, భక్తానుషంగ, సాగరసంగన్. 885

గీ. కాంచి హర్షించి వీరరా ఘవవరుండు
అనఘ! దీని యుదంతమా ద్యంతముగను
నా కెఱింగింపవే యని నన్ మునీంద్రుఁ
డిట్టు లనియె నుత్సాహంబు నెట్టుకొనఁగ. 886

గీ. ఆది భవదీయదివ్యపా దాంబుజాత
జాతమకరంద మనఁగఁ బ్ర ఖ్యాతి కెక్కి
హరుని తలమానికం బయి యలరినట్టి
ఈనదికి సాటి యైనది యొండుఁ గలదె! 887

గీ. దివిని మందాకిని యనంగ, దేజరిల్లు
భువిని భాగీరథి యనంగఁ బొలుపుఁ గాంచు
భోగవతినాఁగఁ బాతాళ మున రహించుఁ
బతితపావన విఖ్యాతిఁ బరిఢవిల్లు. 888

చ. జనులకు జీవనం బొసఁగఁ జాలినదంచు రుజాపనోదనం
బన నుతి కెక్కెనంచు నురు పుణ్యఫలప్రద యంచు, లోకపా
వనసలిలౌఘ యంచు, భవ పాపముఁ బావఁగ నీసురాపగన్,
మునిఁగి మహాత్ము లెల్లఁదను బొందెద రక్షయమైన మోక్షమున్.

సీ. పతితపావన! నీదు వంశంబునన్ మున్ను
జన్మించె సగరుఁడన్ జక్రవర్తి
సరసిజేక్షణ! వాని కిరువురుభార్యలు
కేశినీసుమతులన్ గీర్వాణు
లందుఁ గేశిని, దుష్టు నసమంజసుం గాంచె,
సుమతి యర్వదివేల సుతులఁ గనియె;

ననమంజసుని పుత్త్రుఁ । డంశుమంతుఁడు సద్గు
ణాఢ్యుండు, శాంతుండు । నలఘుబలుఁడు

గీ. సగరుఁ డధ్వర మొనరించు । సమయమునను
అధ్వరాశ్వంబు నమరేంద్రుఁ । డపహరించి
భూరినిష్ఠను బాతాళ । మునఁ దపించు
కపిలమునివర్యు సన్నిధి, । గట్టి వెడలె. 890

చ నరవరుఁ డాగ్రహించి సుర । నాయకుఁ డించుక తల్లడిల్లఁగా
నరువది వేలపుత్త్రులను । నాదటఁ బిల్చి "కుమారులార! య
ధ్వరహరి దొంగిలించి చను । వాని వధింపుఁడు వారువంబున
త్వరముగఁ దెండుపొండనుఁడు । వారలుహుమ్మనిహుంకరించుచున్

గీ. భూతలంబునఁ గలదేశ । ములను జూచి
పురవరంబుల శోధించి । భూధరములఁ
జొచ్చి, వనములఁ బరికించి । సొక్కిసోలి
తగిన పరికరంబులఁ బూని । ధరణిఁ ద్రవ్వి. 892

గీ. తుదకుఁ బాతాళమున కేగి । వెదకివెదకి,
ఘనునిఁ గపిలమునీంద్రునిఁ । గాంచి వాని
పజ్జ దీపించు నధ్వరా । శ్వమును జూచి
అతని నోనాడి రెంతయు । నాగ్రహించి. 893

క. "మాతండ్రి యధ్వరాశ్వము
నీతీరున దొంగిలింప । నేటికి" ననిరన్
అతఁడు వారల భస్మీ
భూతులుగాఁ జేసె నొక్క । మొగిఁ గోపాగ్నిన్. 894

గీ. తుదకు నచ్చోటి కంశుమం । తుండు వచ్చి
అధ్వరాశ్వంబుఁ గొనిపోయి । యాతఁడంబ

తాతకు నొసంగి, యధిక సం । తాప మొందెఁ
దనదుపైతృవ్యులన్ నాక । మునకుఁ బనుప. 895

గీ. అల సురాపగాజలముల । వలనఁ గాని
అతిపవిత్రత లభియింప । దపుడుగాని
జనకులకు సద్గతి లభింప । దని యెఱింగి,
తపముఁ గావించి గంగ కై, । తనువుఁ దొఱఁగె. 896

గీ. కట్టకడకు భగీరథ । క్ష్మావరుండు
ధరణి కంపింపగా ఘోర । తప మొనర్చి,
శివుని మెప్పించి గంగను । నవతరింపఁ
జేసి కృతకృత్యుఁ డై భువి । వాసిఁ గాంచె. 897

క. జనపావన మగు నీ గా
థను విని, నది స్నానమాడి, । దాశరథులు మే
లని, హర్షించుచు వడివడి,
జనకుఁడు పాలించు పురికిఁ । జని రమ్మునితో. 898

క. చని నానా దేశాగత
జనవిభు సేనాహరికరి । సంఘాతస్యం
దనసంచలితన్ మిథిలన్
గని రంతట దైత్యమత్త । గజపంచాస్యుల్. 899

క. ప్రమదావ్రిమదప్రదన
త్ప్రమదావనగరిమఁ జూడ । వాంఛించెద వేన్,
బ్రమదామణి! సుమధామ
వ్రిమాదావనరాశి, మిథిలఁ । బరికింపఁ దగున్. 900

గీ. కూపములఁ దటాకంబుల । వాపికలను,
వరసరస్సులఁ గైరవ । పద్మములను,

ప్రకృతిశృంగారముం గల । పర్వతములఁ
దొలుత నప్పురి నీక్షింప । వలయుఁ జూవె. 901

గీ. వరచతుష్పథంబుల, దివ్య । భవనములను
సౌధముల, హర్మ్యములను, బ్రా । సాదములను
విపణులను, నిత్యకళ్యాణ । వేదికలను,
జనులు వీక్షించినం జాలుఁ । దనివిదీఱు. 902

గీ. బ్రాహ్మణులు, క్షాత్రవంతులు, । వైశ్యవరులు,
శూద్రులున్, నీతిపరులు, వి । శుద్ధమతులు
భక్తివిజ్ఞానవైరాగ్య । వైభవమున
ఖ్యాతికెక్కినవారల । బ్జాతనయన! 903

మ. దివిఁ జుంబించెడు ధర్మహర్మ్యములపై । దీపించుపద్మానవా
నివహంబున్ బరికించు దుర్విటుల దు । ర్నీతిన్ నివారింపఁగా
రవి వీక్షింపఁగనీయఁ డుగ్రకిరణ । వ్రాతప్రసారంబుచే;
భువిచూడామణిఁబోలునప్పురముసొం । పుం బెంపునూహింపుమా

గీ. పృథుతపంబుఁ గావించి బ్ర । హ్మభావించి
నట్టి గాధిపుత్త్రునిరాక । నాలకించి,
జనకుఁ డెదురుగ నేతెంచి । సన్నుతించి,
అర్ఘ్యపాద్యాదివిధులచే । నాదరించి. 905

క. మునినాయక క్షేమంబే
యని, బాలురచందముఁ గని । హర్షం బెనఁగన్
జనవరకులపాలకులో?
మునికులతిలకులో? యెఱుంగఁ । బోలదె చెపుమా? 906

క. కోరిక లీరిక లెత్తఁ జ
కోరము శశిఁగాంచి, ప్రీతిఁ । గొనుచందమునన్,

వీరలఁ గని నాహృదయము
గారాబముఁ బొందె ననఘ। కారణ మేమో? 907

గీ. వీరిసందర్శనంబునఁ। బృథుతరాను
రాగముం బొందుటట్లుండె, । యోగివినుత!
సహజవైరాగ్యముఁ గల మ। త్స్వాంతమునను
అందరాని బ్రహ్మానంద। మంకురించె. 908

క. అనవుడు విశ్వామిత్రుఁడు
జనకునిఁ గని యీవనినది। సత్యం బనఘా!
ఇనకులతిలకులు దశరథ
జననాథునిసుతులు వీరు। జగదాధారుల్. 909

గీ. రాముఁ డీతండు ఘోరసం। గ్రామభీముఁ
డతనితమ్ముఁ డీతఁడు లక్ష్మ। ణాహ్వయుండు;
జన్మముం బొంది దనుజుల। సంహరింపఁ
దనుజులం బంపె దశరథ। జనవిభుండు. 910

క. బలవిక్రమరూపంబులఁ
దలపోయఁగ వీరిఁబోలు। ధరణీవరు లి
య్యిలలో నెచ్చోనైనం
గలరే! జనసన్నుత జన। కక్షితినాథా! 911

గీ. తాటక సుబాహు మారీచ। దనుజవరుల
లీల నొకకోల నేలకుఁ। గూలనేసి,
దేవహితయజ్ఞముం బ్రోచి। తేజరిల్లె
రాముఁ డనురాద్రినివహాను। త్రాముఁ డనఘ! 912

చ. అనవిని మేలుమే లనుచు। నమ్మునినాథుని సన్నుతించి, య
జ్జనకమహర్షి, "యీఘనుల। చందము నందము నెంతచూచినన్

దనివినిఁ బొంద దీమనము । ధన్యుఁడనైతి మునీంద్ర" యంచు భో
జన మిడి గౌరవించి వర । సౌధమునన్ విడియించె బాలురన్.

### రామలక్ష్మణులు మిథిలాపురమున విహరించుట

క. మరునాడు బాలు రిరువురు
నరుణోదయ వేళ, మౌని । యనుమతిఁ గొని య
వ్వరవరమునఁ గల వింతల
నరయఁగ వడి నిర్గమించి । రత్యాసక్తిన్. 914

క. బాలున్ రవికులవరభూ
పాలుర్ సంతతకృపాల । వాలున్ నతగో
పాలున్, మునిజనలోలున్
లోలాక్షులు రాజవీధి । లోఁ గని రెలమిన్. 915

సీ. పద్మాక్షు నీక్షించి । పద్మాక్షి యొక్కతె
జనవంద్యుఁ డితఁ డంచు । సన్నుతించె;
రాజహంసను జూచి । రాజాస్య యొక్కతె
హంసవంశశ్రేష్ఠుఁ । డని నుతించె;
జలధరశ్యాముని । జలదవేణి యొకర్తు
తిలకించి మోహించి । జలదరించె;
సింహసంహనుని । సింహమధ్య యొకర్తు
పరికించి వలవంతఁ । బరితపించె;

గీ. అలయహల్యను గాపాడి । నట్టి యితని
పాదధూళికి శివుమేని । భస్మధూళి
కెట్టి భేదంబు లే దని । యింతి యోర్తు
మెచ్చి యొక మచ్చెకంటితో । ముచ్చటించె. 916

గీ. రామచంద్రునకున్ ప్రమొక్కె । రామ యోర్తు
లక్ష్మణునిఁ జూచి హసియించె । లలన యోర్తు
రామలక్ష్మణులం జూచి । భామ యోర్తు
ఎలమి ననిమిష నేత్రయై । నిలిచి యుండె. 917

చ. "ముదిత యెఱుంగవే? జనక । పుత్త్రికఁ బెండిలి యాడఁ గోరి యు
మ్మడనుఁడు వచ్చె మిత్రుఁడగు । మాధవుతోఁ బరికింపు" మంచు నా
సదయునిఁ గీర్తిసాంద్రు ననుజన్మునితోఁ జనురామచంద్రునిన్
మదవతి యోర్తు చూపె నొక । మానినికిన్ నవయౌవనాంగికిన్.

క. "తాటకను సంహరించిన
హాటకచేలుండితండ" । యని యోర్తు జగ
న్నాటకసూత్రిక్ బురశ్ళం
గాటకమునఁ గని తనచెలి । కర్తెకుఁ దెలిపెన్. 919

క. "వడి నడవికిఁ జని యొక్క
మ్మడి విల్లెక్కిడి సుబాహు । మారీచుల యే
పడఁచిన బాలున్ గంటివె
పడఁతీ? యని రాము నొకఁడు । భార్యకుఁ జూపెన్. 920

గీ. ధరణి కన్యకఁ బెండ్లాడఁ । దగినవరుఁడ
హరకఠోరధనుర్భంగ । మలఁతి యగునె"
అని తలంచి రాముని ఖ్యాతి । నాలకించి
ధైర్యముం బూని యొకవృద్ధ । తనివిఁ బొందె. 921

క. "మనజానకిఁ బెండ్లాడఁగఁ
జనుదెంచిన సకల । రాజ సంతతిలోనన్
ధనువుం దునుమంగలఁ డీ
ఘనుఁ" డంచును రాము నొక్క । కాంత నుతించెన్. 922

మ. తన మోహమున్ గనినంతమాత్రమునఁ గాం। తాబృందమీతీరునన్
విసతింపన్ బురవీథులం గడచి రీ। విన్ రాజమార్గంబునన్
జని, సౌధంబుల భర్మహర్మ్యములఁ బ్రా। సాదంబులన్ మెచ్చి హె
చ్చిన వేడ్కన్ రఘురాముఁ డొక్క యెడ గాం। చెన్ బుష్పితోద్యానమున్

ఉద్యానవనమున సీతారాముల యన్యోన్యావలోకనము

ఉ. అమ్మహనీయుఁ డంత ముద। మందుచు లక్ష్మణుఁ జూచి "చూచితే
తమ్ముఁడ! సొంపునింపు బ్రమ। దావనరత్నము నందనోపమా
నమ్మను, దీనిఁ బోలినవ। నమ్ము జనమ్ములు చూడ రెందు ని
క్కమ్ముగఁ; బూలఁ గోయుదము। గాధితనూజుని దేవపూజకున్.

క. అని తమ్మునితోఁ బ్రముదా
వనమును వీక్షింపఁ జొచ్చి। ఫలపుష్పములన్
గని, యభ్రంకషకుజములఁ
గని, చనిచని చూచె నొక్క। కాసారంబున్. 925

ఉ. సారసకైరవప్రకర। జన్మగృహంబన నొప్పు సారకా
సారముఁ జూచి, యందుఁ గల। సారసపక్షి రాజహంసలన్
సారెకుఁ జూచి, మెచ్చి నృప। చంద్రుఁడు పజ్జకుఁ జేరఁబోయి త
త్తీరమునందుఁ గాంచె సుద। తీమణి మన్మథుఁ గన్నసుందరిన్.

ఉ. జానకి యంచు లోనెఱుఁగఁ। జాలకి చక్కఁదనంబు మెచ్చి, "యౌ
రా! నవమోహనాంగి యన। రాదె? వివాహితయేనిఁ బావనం
బైన మదీయమానసము। నం దుదయించునె ప్రేమ స్వప్నమం
దైన? రఘూద్వహుండ నక। టా! పరకాంతలఁ జూచువాఁడనే!

ఉ. పావనమై రహించు రఘు। వంశమునం దుదయించినట్టి నా
భావము మైత్రిఁ గోరి పర। భామలఁ గూడఁగ నిచ్చగించునే

ఈవనితాలలామ, జగ । జ్జేతుణ, చక్కనికన్నెమిన్న" యం
చావరుఁ డాత్మలోఁ దలఁచి । యాదటఁ జూచుచు నిల్చియుండఁగన్

ఉ. జానకియున్ రఘూద్వహుని । చక్కఁదనంబును జూచి మెచ్చి, యే
మానవభర్త యిట్టియస । మానుఁడు సూనుఁడుఁ గా రహించె, నా
మానస మీమనోహరుని । మానసవీధి భ్రమింపఁ జొచ్చె, భూ
జానికుమారుఁడో మరుఁడో । చంద్రుఁడో యింద్రుఁడో యాయుపేంద్రుఁడో

ఉ. సంతస మయ్యెఁ గంతుని, వ । సంతు, జయంతు, దిసంతుకొట్టు నీ
కాంతుఁ డెవండో? యంతిపురి । కాంతలు సంతతముం జరించు నే
కాంతవనాంతరంబుఁ గనఁ । గాఁ జనుదెంచిన యీవరుండు భా
స్వంతుఁడో? సంభ్రమింపకుము । స్వాంతమ! శాంతముఁ బూను మింతటన్

మ. అదిరా! యాకనుదోయిసొంపు, భళిరా! । యామోము సందంబు; న.
మ్మదనుం గన్న మహానుభావుఁ డగు ని । మ్మాన్యుండు సామాన్యుఁడే?
హృది నూహింపఁగ, నారమావిభుఁడె యి । ట్లేతెంచెనో గాక, యే
సుదతీరత్నము వీని పేరురము పై । శోభిల్ల జన్మించెనో

ఉ. ఎందఱు లేరు రాజవరు, । లెందఱు లేరు మనోహరా
కెందఱు లేరు వీరవరు, । లెందఱు లేరు మహానుభావు లీ 920
యందపు జందముం గలవె? । యక్కట! యీపురుషోత్తముండహా
డెందము దొంగిలించె; విక । టించెను మాయధుఁడె మి సేయుదున్!

శా. ఏఁడీ చక్కనివాఁడు! లేడు భువిలో । నీమేటికిన్ సాటిగాఁ
జూడన్ గన్నుల నెత్తి యెట్టివరు నేన్; । శోకించి నాతండ్రి యె
గ్గాడుం గాక; మదీయనాయకుఁ డితం । డౌ; నివ్వరుం గోరి పెం
డ్లాడన్ బగ్గము లేని గుట్టముగతిన్ । స్వాంతంబు పర్వెత్తెడున్.

మ. హరకోదండవిఖండనంబునఁ గదా । ప్రాప్తించుఁ గళ్యాణ మి
వ్వరుఁ బ్రేమించ ప్రతిజ్ఞలో మఱచితిన్, । భావింప నిబ్బాలుఁ డె

క్కురణిన్ భీకరకార్ముకంబుఁ దునుమం । గా నోపు? బ్రహ్మాదిని
ర్జరులారా? కరుణించి తోడుపడరే, । రక్షింపరే! మ్రొక్కెదన్

ఉ. పావనవంశసంభవు, న । పారకృపాకరు, సర్వలోకధ
ర్మావనలోలు, ఫుల్లధవ । ళాంబుజపత్త్రవిశాలనేత్రు, నే
నీవనసీమఁ జూచి వరి । యించితిఁ, దోడ్పడుమమ్మ పెండ్లికిన్
జీవనధాత్రి, ధాత్రి! పుర । జిద్ధనురధ్వరదీక్షపూర్తిగాన్. 935

క. అని జానకి ప్రార్థింపఁగ
వనితాకృతిఁ దాల్చి యంత । వసుమతి తననం
దనఁ గౌఁగిలించి యిట్లనుఁ
"దనయా! ప్రేమించితీవు । దశరథుతనయున్. 936

మ. ధవళాబ్జాక్షుఁడు మాధవుం డఖిలదై । త్యశ్రేణిశిక్షింప, వా
సవురక్షింప జనించెఁబో దశరథ । క్ష్మాపాలుపుత్త్రాకృతిన్;
శివుచాపంబుఁ బుటుక్కునం దునిమి నీ । చిత్తేశుఁ డై భార్గవ
స్తవముం గైకొని యింటికిం జను మన । స్తాపంబు నీకేటికే?

క. అరయఁ జతుర్దశభువ[illegible]
దరుఁ డీదశరథ[illegible]యా! ధరణీ
ధరముల బంతుల[illegible]
హరచాపముఁ ద్రుంచు[illegible] । యతనికి లెక్కా? 938

క. ఈరీతి నెఱుకపఱచిన
ధారణి,సీతాసఖియును । తలఁపుంగొని యా
శ్రీరాముఁ డుండఁ దగ దని
యారామముఁ బాసి వెడలె । ననుజనితోడన్. 939

ఉ. పిమ్మట ధాత్రి,పుష్పవన । వీధినిఁ జొచ్చి, సుమాళిఁ దెచ్చి,దా
మమ్ముగఁ గ్రుచ్చి,మెచ్చి,సుఖ । మారికి నిచ్చి,వచించె నిట్లు"చా

వమ్మునను దుర్రించి నీదుకర । పల్లవముఁ గ్రహించు రాముకం
రమ్ము నలంకరింప లల । నా! సుమదామము నీకొసంగితిన్.

చ. అదె చెలికత్తె లెల్లఁను ల । తాంతములం గొని యేగుదెంచి రో
ఘదగజయాన! లోన నను । మానము మానుము, రాముని న్వరిం
చెద వని" పల్కి యవ్వసుధ । శీఘ్రముగన్ దనరూపుఁ బాసె; లో
నదవదఁ జెందుచున్ సకియ । లందఱు వచ్చిరి పుష్పరాశితో.

గీ. "ఒంటిమెయి నుంటివే మచ్చె । కంటి!" యనుచుఁ
బుష్పహారంబుఁ దిలకించి, "పుష్పగంధి!
హారముం గ్రుచ్చితే" యంచు । నభినుతించి
జానకిం గౌఁగిలించిరి । సకియ లెలమి. 942

చ చెలులు వచించుపల్కులకు । సీత కడుంగడుఁ బ్రీతిఁ గాంచి, వా
రలు గొని తెచ్చినట్టి సుమ । రాజికి నెంతయు సంతసించి, ము
ద్దులొలుకు ముచ్చటల్ జరపి, । తూరుపుఁ జూచి, బిరాన లేచి, తాఁ
దొలుత గమించెఁ, బుష్పముల । తోఁ జెలికత్తెలు వెంబడింపఁగన్.

క. శ్రీరాముఁడు లక్ష్మణుతో
నారామమునుండి వెడలి । యతిరయమున, లో
నారామఁ దలఁచి మెచ్చుచు
గారామున, విడిది కేగె । గాధిజు డలరన్. 944

గీ. వారు గొని తెచ్చినట్టి పు । ష్పములఁ గాంచి
ప్రమదవనమున కేగిన । వరుస నెంచి
రాము నెమ్మోముఁ బరికించి । రాజమౌని
సర్వము గ్రహించి యెలమి నా । శీర్వదించి; 945

గీ. పూజఁ గావించి బాలురఁ । బుణ్యఖనుల
నిష్టమృష్టాన్నముల భుజి । యింపఁ జేసి

వరపురాణగాథలఁ జెప్పి । భావములను
మోద మిగురొత్తఁగ గొంత । పొద్దుపుచ్చె. 946

సూర్యాస్తమయవర్ణనము

మ. వనజాతాక్షుఁడు జానకిన్ వలచె, మ । ద్వంశీయుఁ డప్పీరుఁ డే
జననాథోత్తముఁడేఁ గదల్చుటకు దు । స్సాధంబుగా నుండు భ
ర్గునికోదండము రేపు తున్చు నమరుల్ । కొండాడఁగ, గర్మసా
క్షిని నే స్నానముఁ జేసివత్తు నని క్రుం । కెఁ సూర్యుఁ డస్తాంబుధిన్

చ. జలజసఖుండు పద్మినుల । సంగతిఁ గాంచియుఁ దృప్తిలేక సా
నుల కనురాగమిచ్చి కడు । నొచ్చి వసూత్కరహీనుఁడయ్యెఁ దగ
వలచినయట్టిపుష్పవతి । వారుణిఁ గూడఁగ వచ్చినంత, ద్యో
జలరుహనేత్రి చల్లిన వ । సంత మనంగ రహించె సంధ్యయున్.

గీ. పశ్చిమదిగంతమున సంధ్య । ప్రజ్వరిల్లి
నంత సంయమీశ్వరుఁడు స్నా । నార్థ మేఁగె;
సాంధ్యకృత్యంబులం దీర్చి । శౌచ మొంది
వార్చి యర్పించి రిరువురు । వందనంబు. 949

మ. అలమెన్ మోసుగుపూచెనాఁజరమసం । ధ్యాకాంతికూపెట్టుచున్,
బులుగుల్ గూండ్లకుఁ బాఱెఁగామకులవ్యా । మోహంబుతో నంధకా
రలతల్ దిక్కులఁ బ్రాకెఁ దత్సుమములై । రాజిల్లె రిక్కల్ జగం
బలసెన్ దమ్మిలసొంపుఁ బెంపణఁగె నా । కల్లాడ దే క్రమ్మకునన్.

చంద్రోదయము

గీ. చటులగాఢాంధకారమున్ । సకల దిశల
గరములం జించి చెండాడి । కలువచెలువ
చెలువ మిగురొత్త నెలలేని । వలపు లూర
నుదయగిరివీధిఁ జంద్రుఁ డ । భ్యుదయ మొందె. 951

క. శ్రీతోఁ బుట్టినవానిన్
జేతోభవు మేనమామ । క్షీరాబ్ధినుతున్
సీతావదనసమానున్
శీతాంశునిఁ జూచి చూచి । శ్రీరాముఁడనున్. 952

చంద్రోపాలంభనము

క. చేతోజాతుని నవకం
జాతాస్త్రము ధిక్కరించు । సంపదఁ గల యా
సీతాముఖబింబమునకు
నీతండు సమానుఁడనిన । నే నోపుదునే? 953

సీ. హాలాహలానల । జ్వాలానుజుఁ డనంగ
జడధిలో జనుఁడయి । వాడమకున్న
విరహులు దుఃఖింప । వేధించువాఁడను
బహుళకళంకంబుఁ । బడయకున్నఁ
బర్వకాలంబున । వైభవం బుడివోవ
సైంహికేయునివాత । స్రగ్గకున్న
వలపుకత్తెలఁ గల్వ । చెలువల నలరింపఁ
జెల్లెలుండు గృహంబుఁ । జెఱపకున్నఁ
గీ. జెలఁగి చక్రవిద్వేషి యై । మెలఁగకున్నఁ
బగలు సత్పథచ్యుతి వెల్లఁ । బాఱకున్నఁ
దమ్ములకుఁ గీడు గూర్చరే । ద్రిమ్మరీడు
ఈడుగానోపు సీతాము । ఖేందునకును. 954

క. అని చంద్రోపాలంభన
మున సీతాముఖవిలాస । ముం బొగడుచు లోఁ

దనివోవఁ దలఁచి యులరుచు
వనజాక్షుఁడు మోడ్చె నేత్ర ౹ వనజాతములన్. 955

గీ. శివునిధనువును ఖండించి ౹ సీతఁ బెండ్లి
యాడ నీరేయి యాటంక ౹ మయ్యె ననుచు
నించుకంత రాముండు ని ౹ ద్రించియుండఁ
దెల్లముగ నంత భళ్ళునఁ ౹ దెల్లవాఱె. 956

సూర్యోదయము

క. విదళించుచుఁ దమసంబును,
వదలించుచు భృంగసంఘ ౹ బంధముఁ, బ్రజలన్
మెదలించుచుఁ, గెందమ్ములఁ
బొదలించుచు నినుఁడు తూరు ౹ పున నుదయించెన్ 957

ఉ. కౌముదిఁ బాసెఁ జందురుఁడు ౹ కైరవముల్ ముకుళించె, నాయుడు
స్తోమము కాంతిఁ దక్కె, రవి ౹ తూర్పునఁ దోచి రహించివంత; శ్రీ
రాముని యాగమంబుఁ గని ౹ రాజవరుల్ దరహాసహీను లై
మోములవాంచి బింకమును ౹ బొంకముఁ బాసినరీతి నత్తఱిన్.

గీ. శూరుఁ డగు లక్ష్మణుం డంత ౹ సోదరునకు
మౌనివరునకు నెలమి న ౹ మస్కరించి,
హరకఠోరధనుర్భంగ ౹ మాత్మఁ దలఁచి,
భావి శుభసూచకంబుగఁ ౹ బలికె నిట్లు. 959

చ. ‘‘నరవరులెంద ఱున్న రఘు ౹ నాయక! యీవ వలంతి వాడు వీ
శ్వరునికఠోరకార్ముకము ౹ వంపఁగఁ ద్రుంపఁగ; దృక్పథంబు పై
నరిగొను నంధకారనిచ ౹ యంబుఁ గరంబుల సంహరింప భా
స్కరునకుఁ గాక చుక్కలకు ౹ శక్యమె కాంతి యొకింతఁ గల్గినన్

సీ. పరరాజసంతతి । వైభవంబు నశింప,
సఖిలదిక్కులఁ దేజ । మావరింప,
లోకంబులన్ భక్త । లోకంబులు గహింప,
నమరపద్మామోద । మతిశయింప,
ద్విజసన్మునీశ్వర । ద్విజసంఘము నుతింప,
సజ్జనభ్రమరముల్ । సంభ్రమింప,
మేదినిం గల, ప్రజల్ । మేల్కాంచి శ్లాఘింప,
వంశ మున్నతకీర్తిఁ । బ్రస్తరింప

గీ. కాలగళఘోరధనురంధ । కారపటలి
లీల నొకకేల విదళింపఁ । జాలుదీవు;
భానువంశప్రదీప! దీ । వ్యత్ప్రతాప!
రమ్యతరకీర్తిసాంద్ర! శ్రీ । రామచంద్ర! 961

మ. అనియీరీతిరఘూద్వహున్ పృథుల శౌ । ర్యౌదార్యధీధూర్వహున్
గని సౌమిత్రి వచించుచుండఁగఁ శతా । నందుండు వేంచేసి, ‚‚యు
జ్జనకక్ష్మాపతి పంచె రం"డనిన, వి । శ్వామిత్రుఁ డాసద్యశో
ధనులన్ దోడ్కొని యజ్ఞశాలకుఁ జనెన్ । ధాత్రీశ్వరుల్ భీతిలన్.

మునితో రామలక్ష్మణులు యజ్ఞశాలఁ బ్రవేశించుట

మ. ‚‚అదిగో వచ్చిరి వచ్చి"రంచుఁ బ్రజ లా । హాయంచు నగ్గింపఁ గా
నెదు రేతెంచి,బహూకరించి, జనకుం । ‚‚డేతెంచిరే, రండు మా
కొదవం దీర్పఁగ'' నంచు నాసనములన్ । గూర్చుండఁగాఁ బెట్టి,స
మ్ముద మేపారఁగ ముప్పురం దనిపెఁ దాం । బూలాది మర్యాదలన్

చ. కటకట!! ఖడ్గకాండశర । ఖండితవీరకులంబు మాబలం
బటమటఁ జెడునే ! శివశ । రాసన మెంతటి ? దంచు నవ్వుచున్

వటవట మాటలాడు నృప । వర్యులచే వరవీరకోటిచేఁ
గిడకిట లాడుశాలఁ బరి । కించి హసించిరి రామలక్ష్మణుల్.

గీ. సకలశాత్రవసంతతి । సంహరించి
తేజరిల్లిన సంగ్రామ । ధీరుఁ డొకఁడు,
“వీరరస మిట్లు మూర్తిభ । వించె” ననుచు,
రామచంద్రుని వీక్షించి । ప్రస్తుతించె. 965

సీ. కుటిలభూపాలుఁ డొ । క్కరుఁడు రాముని జూచి
బీభత్సముఖుఁ డని । భీతిఁ జెందెఁ,
గపటదైత్యుఁ డొకండు । కంజాక్షు నీక్షించి,
దండధరుం డంచు । బెండువడియె,
సుందరాంగులు రాము । సౌందర్యముం గాంచి
యభినవమరుఁ డంచు । నభినుతించి,
రసఘులు మాను లా । యభిరాముఁ దిలకించి,
నారాయణుం డంచు । నతులొసంగి

గీ. రతనిఁ బరికించి జనకభూ । పతి, మహర్షి
యనుచుఁ జింతించి మోఁతయు । నతిశయించె,
యోగివరుఁ డీత డని యొక్క । యోగి యెంచె,
సుప్రసన్నాత్ముఁ డని యొక్క । సుజనుఁ డలరె. 966

గీ. ధీరుఁ డగు రాముఁ జూచి శా । క్తేయుఁ డొకఁడు
సకలశాక్తేయసుతరహ । స్యముల కెల్ల
నెల్ల యని యెంచి మిక్కిలి । యుల్లసిల్లి
అతని గురువుగ భావించె । నాత్మయందు. 967

గీ. “ఇంత చక్కని బాలు నే । కాంతఁ గాంచె
నామె జన్మంబు సార్థక । మయ్యె” ననుచు,

వృద్ధ యొక్కర్తు శ్రీరాము । శుద్ధగాంత
మూర్తిఁ దనివోవఁ జూచి లో । ముద్దులాడె. 968

గీ. వికసితశ్వేతపద్మాక్షుఁ । బీనవక్షు,
సంగరోత్సాహు, సుందరా । జానుబాహు,
రామునిం జూచినంతనె । రాజవరుల
గుసగుసలు హెచ్చె, హెచ్చిన । యెసక మణఁగ. 969

ఉ. "ఇందుకళాకిరీటునకు । సీతఁడు సాటి యనంగ నొప్పు, న
స్పందితధైర్యశౌర్యగుణ । వంతుఁ డనంతుఁడు సందియంబులే
దందగరానిపండ్లకయి । యఱ్ఱులు సాచితి మింక సీతకై
వందురనేటి" కంచుఁ దమ । వాంఛఁ ద్యజించిరి కొందఱత్తఱిన్

ఉ. "చక్కని వాఁడ యెక్కరణి । జానకిఁ బెండిలియాడు? నక్కటా!
చెక్కు చెమర్చినంత నిజ । చేష్టలఁ దక్కి పరుండు బాలకుం
డెక్కడ! యీశ్వరుండు ధరి । యించి త్యజించిన ఘోరకార్ముకం
బెక్కడ? చూడ శక్యమగు । నే?" యని యెంచిరి కొందఱత్తఱిన్

గీ. జాల మింకేటి కని మునుల్ । సంభ్రమింప,
జనకుఁ డౌనని సమయ మా । సన్నమయ్యె
ననుచు సీతకై చెలులను । బనిపినంత,
వల్లె యని యామె శాలకు । బయలు వెడలె. 972

సీతాసౌందర్యాభివర్ణనము

గీ. వసుధ దీపించు నుపమాన । వస్తు వితతి
జనకపుత్రిక వర్ణింపఁ । బనికిరావు;
దేవదానవమానవ । స్త్రీసమాజ
మామెపద సేవఁ గావింప । నర్హమగును. 973

గీ. అతుల వాచాలభారతి । యలఁతి యయ్యె
నీవు నర్ధాంగి వైతివి । నీరజాక్షి!
రతి యనంగునివనిత, శ్రీ । రమణి చపల;
జనకసుతసాటి గానోపు । సతులు గలరె? 974

మ. వనితా! మారుఁడు, సర్వలోకములశో । భన్ రజ్జువుం జేసి, పా
వనశృంగారము మంధరాచలముఁగా । భావించి బంధించి; నా
తనలావణ్యపయోనిధిఁ దరిచినం । తఁ దోఁచు శ్రీలక్ష్మియే
జనకక్ష్మాపతిపుత్రి, కానియెడ నీ । సౌందర్య మిట్లుండునే?

గీ. లీల, జయమాల యొక కేలఁ । గ్రాలనలరు
సీత నీక్షించి నృపులు ని । శ్చేష్టులైరి?
దాశరథిఁ జూచి, లజ్జించి, । తలను వంచె
సర్వభువనైకమాత, భూ । జాతసీత. 976

గీ. సద్గుణస్తోము శ్రీరాము । సన్నుతించి,
ప్రేమ మీరీతి మూర్తిభ । వించె ననుచుఁ
గొమ్మ తనవాలుఁజూపులఁ । గ్రుమ్మరించి
చెలులతోఁ దండ్రిపజ్జను । నిలిచి నంత. 977

వందిమాగధులు జనకుని ప్రతిజ్ఞఁ బ్రకటించుట

క. జనకుండు వందిమాగధ
జనులం గని "నాదుప్రతిన । జననాథులకున్
వినిపింపుఁ" డనిన వారలు
ఘనవాక్కుల నిట్టులనిరి । కవితాసరణిన్. 978

క. మోహావశంబున సీతో
ద్వాహముఁ గాంక్షించి నట్టి । పార్థివులారా!

బాహుబల చంద్రిమండల
రాహువు, ఫాలాక్షధనువు । రండు గ్రహింపన్. 979

ఆ. బాణరావణాది । పాషాణకాయులు
కేల నెత్తలేక । కూలఁబడిరి;
కొండఁబోలినట్టి । కోదండ మియ్యది;
రండు రాజులార! । బెండువడక. 980

ఉ. మానవనాథులార! యభి । మానముఁ గోఁ బనిలేదు, మీరున
న్మానముఁ గోరి వచ్చి రను । మాట నిజం బగు, నైన నేవ్వుమై
నేనృపవర్యుఁ డీధనువు । నెక్కిడఁ జాలు, నతండె యీసభన్
జానకిఁ బెండ్లియాడుటకుఁ । జాలినవాఁ డగు నెల్లభంగులన్"

క. ఈరీతి వందిమాగధు
లారాజులఁ జూచి వలుక, । నందఱు దురహం
కారావేశంబున హుం
కారముఁ గావించి సీతఁ । గాంచిరి గిరిజా! 982

రాజులధనుర్భంగప్రయత్నము

సీ. "ఏపాటి యీచాప । మెక్కిడఁగా" నంచు
నొక్కండుహుమ్మని । హుంకరించె
"బ్రహ్మాండమయ్యె నీ । ప్రతిన" యంచు హసించి
యలవోక నొకఁడు మీ । సలను ద్రిప్పె,
"ఈశ్వరకృప యున్న । నెక్కిడలే కేమి"
యని యెంచి నన్నొకఁ । డభినుతించె;
"బరిభవింపఁగఁ జేయు । ప్రతినయియ్యది" యంచు
నత్యుగ్రుఁ డై యొక్కఁ । డాగ్రహించె;

గీ. "సీతతలఁదన్ను చక్కని । చెలువమిన్న
యుర్వి లభియింపదే యని" । యొక్కఁ డలిగెఁ,
"దరుణి దండకు? హరునికో । దండమునకు
దండ" మని యెంచి యొక్కండు । బెండువడియె. 983

క. మానము లేరీ యనుచున్
మీసములం ద్రిప్పిత్రిప్పి । మృత్యుంజయుబా
ణాసనమాకర్షింపగ
నాసించుచు రాజసింహు । లరిగిరి గిరిజా! 934

సీ. అవలీలఁ దునిమెద । ననివల్కి యొక్కండు
కేల నెత్తఁగలేక । కూలఁ బడియె,
వదనంబు జేవురిం । పఁ గడింగి యొక్కండు
రక్తమున్ భళ్ళునఁ । గ్రక్కి వెడలె
మీసంబులను నుల్వి । రోసించి యొక్కండు
హుమ్మని గుంజించి । యుర్వి కూలెఁగ,
తనయిష్టదైవంబుఁ । దలఁచుచు నొక్కండు
కెంగేలఁబట్టి గ్రు । క్కిళ్లు మ్రింగ,

గీ. వేగముగ నేగి బలిమిమై । లాగిలాగి
దిమ్మటలఁ గ్రక్కి యొక్కండు । సొమ్మసిల్లె,
విల్లు గదలింపఁ జాలక । విసువలేక
సీతఁ జూచుచు నొక్కండు । చేష్ట లుడిగె. 985

గీ. వసుధ నొకలీలఁ గదలింప । వచ్చుఁ గాని
దీనిఁ గదలింపఁ బూనిన । హాని యొదవు,
బలునుకూరైనఁదినవచ్చు । బ్రిదికి యున్న
ననుచు నొకఁడు తనస్థలం । బునకు వెడలె. 986

గీ. అవనిఁ బ్రఖ్యాతి కెక్కిన । యతులబలులు
వల్లటీ ల్దాటి చెల్లఁబో । పల్లటిలిరి,
ఏనుఁగు లడంగె దోమల । నెవ్వఁ డడుగు
నని తలంచిరి తక్కిన । మనుజవరులు. 987

గీ. ఎత్తవచ్చినరాజుల । సత్తుగ్రమింగి,
అంతకంతకు బరు వెక్కె । యతిశయించి,
కొండవలె నుండె నాదుకో । దండ మతివ,
దానిఁ గదలింపఁ జాల రీ । మానధనులు. 988

గీ. భయదతర్జనభర్జన । వాక్యములకు,
వశమునకు రాని వరవతి । పతినుబోలి,
అవని నాథాభిమాన ప్ర । యత్నములకు
సంచలింపక యుండె నా । చాప మబల. 989

గీ. భూవరుల భావముల దైన్య । మావరింపఁ
జెన్నుమీఱిన మోములు । చిన్నవోయె,
వారిశౌర్యంబు పరిహాస । పాత్ర మయ్యె
నకట వైరాగ్యహీన స । న్న్యాసమట్లు. 990

జనకుఁడు రాజులనో దార్చి సంతాపించుట

క. వనితా వినుమంతట న
మ్మనుజాధిపు లుక్కుఁదక్కి । మానవ్రతు లై
తనదిక్కుఁ జూడ నత్తఱి
జనకుండు వచించె నిట్లు । సంతాపమునన్. 991

ఉ. మానవనాథులార! యభి । మానవశంబున వచ్చి రీరు సం
స్థానములన్ దొఱంగి, హర । చాపము నెక్కిడ శక్యమానె? మా

జానకిఁ బెండ్లియాడు బల । శాలి జగంబునఁ బుట్టలేదె? తే
జోనిధి యొక్కఁడేఁ గలఁడె? । శూరులవంశము గొడ్డువోయెనే?

చ. ఇరువది బాహుదండముల । నీశునగంబుఁ గదల్చినట్టి యా
సురపతివైరి రావణుఁడు । సొమ్మసిలెన్ గదలింపలేక యీ
హరధనువున్, సహస్రకరుఁ । డైన మహాబలశాలి బాణుఁడున్
ధరణిధరంబు గాని యిది । ధర్మువు గాదని యేగె నింటికిన్.

మ. హరకోదండము నెక్కువెట్టఁ గలరే । యత్యల్పభూపాలు రి
ద్ధరణిన్ జానకి కన్యకాత్వమున సం । తాపించు గాకింతకున్
వెరవిం కెయ్యది? భూతలం బకట ని । ర్వీర్యంబునన్ బాడఱెన్
దురహంకారము సంహరింపుఁడిఁక మీ । దోర్గర్వముల్ ఖర్వముల్.

చ. అనఘుఁడు క్షత్రియుండు సమ । యంబును దప్పునె? వీరుఁ డొక్కఁడేన్
ధనువును వంచియున్న లల । నామణితోడ నమేయసద్యశో
ధనము లభించియుండును గ । దా? ధనువించుకయేన్ జలింపదే?
వనజభవుండు నాసుతకు । వ్రాయఁడు గాక వివాహయోగమున్

గీ. అఖిలభూపాలు రేతెంచు । టట్టులుండె
దేవతలుఁ గిన్నరులుఁ బూర్వ । దేవతలును
వేషధారులై వచ్చిరి । బెండువడిరి
అక్కటా పృథ్వి నిర్వీర । యై నశించె. 996

ఉ. ఆశలనుండి పెండ్లికి దు । రాశలతోఁ జనుదెంచి రక్కటా!
వైశన ముప్పతిల్లె నవి । వాహితయై మనుగాక సీత మీ
యాశయముల్ ఫలింపవు, ని । రాశలతోఁ జనుఁడింక నాగ్రహా
వేశము లేటికిన్? నిజ ని । వేశములన్ సుఖియింపుఁ డెల్లయున్.

### లక్ష్మణుని యాగ్రహము

ఆ. వె. "జనకుఁ డిట్లువలుక । సభ్రమానుపడి యుండె
గండుమీఱి లక్ష్మ । ణుండు మిగుల

నాఁగ్రక్రోంచి లేచి । యగ్రజన్మునిఁ జూచి
కటము లదర నధర । పుటము లెగయ. 998

ఆ. వె. మోము కెంపురింప । బొమముడి విచలింపఁ
బ్రళయసంధ్యఁ బోలి । ప్రజ్వలింప
నేత్రరక్తకాంతి । నృపవరు లాలింప
నిట్టులనియె రోష । మినుమడింప. 999

ఉ. కార్యము మించివచ్చె జన । కక్షితినాథునివల్కు వింటె, లో
కైర్యముఁ గాడుకొల్పి, హర । ధర్మవుఁ ద్రుంపుము, శాంతమూని, దో
ర్వీర్యముఁ జూపవేఁ దొలఁగఁ । బేరును జెంపును, భూతలంబు ని
ర్వీర్యమె యన్న దూఱు రఘు । వీరులఁ బీనులఁ జొచ్చె నక్కటా.

ఉ. ఖండము దండ మంచు రిపు । తండము బెండువడంగ, దీర్ఘదో
ర్దండము లెత్తి గాధిజుని । దండకు నేగి నమస్కరించి, తే
దండము పుండ్రిముఁ దునుము । నప్లవగీలను ఫాలనేత్రుకో
దండముఁ ద్రుంచి సీతవిరి । దండను గొమ్మ సుభప్రదమ్మగన్

ఉ. అండజయాన సీత భవ । దాననముం దిలకించె నింకఁ గో
దండముఁ గొమ్మ; లేద పద । దానుఁడ నాకు ననుజ్ఞనిమ్ము, బ్ర
హ్మాండముఁ బెల్లగించెద, శ । రాసన మేటికి! నగ్రజుండ వీ
వుండగ నేను విల్ దునుము । టొప్పదు సోదర! సజ్జనాదరా!

మ. ఇనవంశోద్భవుఁ డైనవీరుఁ డకటా! । యెన్నండు నీరీతిఁ బ
ల్కిన నైర్తింపఁడు, వీరరాఘవుఁ డుపేక్షింపంగ నాశే? సభన్
జనకక్ష్మాపతి యెగ్గులన్ బలుకునే! । ఖాతింపఁగా నిల్లి తుం
డనె! సీతమ్మఁడ నాన్యతిమ్మ ధనువున్ ద్రాకేల, గొంపోయెదన్

సీ. సీవానతిచ్చిన । నిఖిలశాస్త్రవ్రులఁ జెం
డాడి, మోద్దింపి చెం । గాదన్నాఁడ

నెల్లకొండలఁ గేల । నల్లలఁ గదలించి
క్షితి తల్లడిలఁ బెల్ల । గించువాఁడఁ,
బ్రహ్మాండభాండంబు । బ్రద్దలు గావించి
చిందఱవందఱఁ । జేయువాఁడఁ,
గమలనాళముఁ బూను । గంధేభముం బోలి
ఫాలనేత్రునివిల్లుఁ । బట్టువాఁడఁ

గీ. బట్టి శతయోజనంబుల । వఱకు వదలి,
కడువడిం ద్రిప్పి విసరెదఁ, । గాక యున్న
ధన్విఁ గాకుండు నీకుపా । దములఁ గొట్టి
శపథముం గొంటి, నాకర్మ । సాక్షిసాక్షి. 1004

గీ. అనిన విని రాముఁడిట్లనె, । “నంతవాఁడ
వౌదు వొక్కింత శాంతింపు । మనఘ! గురువు
లనుమతించినఁ జాలు నీ । ధనువుఁ దునిమి,
అతులభూపాలసుతుల నం । స్తుతులఁ గొందు. 1005

చ. పరమపవిత్రమైన రఘు । వంశమునందు, సమస్తలోకభీ
కరదనుజావళిం దునుమ । గా జనియించితి, జంకుఁ దక్క యా
శ్వరధనువున్ జయించి,యను । జా! విను జానకిఁ బెండ్లియాడియా
గురువులపాదపద్మముల । కుం గుసుమాంజలినే నొసంగెదన్ 1006

గీ. శివునికోదండముం దున్మి । సీతఁ బెండ్లి
యాడకున్న నాచంద్రతా । రార్కముగను,
పృథులనత్కీర్తి మనకుఁ బ్రా । ప్తించు టెట్టు?
లోర్వఁదగుఁగాక, గుర్వాజ్ఞ । నొందు దాక. 1007

వ. అనవుడు మాని రామువినయంబునకున్ గడు సంతసించి,యి
ట్లనియెను:--ఫాలనేత్రునిశ । రాసనమున్ వడి నెక్కుపెట్టి, యి

జ్జనకుని సంతసం బెసఁగ । జానకిఁ జేకొని పెండ్లియాడ నె
వ్వని కగు నీకుఁగాక, చను । మాయనుమానముఁదక్కి రాఘవా

మ. అనినన్ మౌనికిమ్రొక్కి రాముఁడు, ఘన । శ్యాముండుఁగంభీరుఁడై
జననాథోభసమూహముల్ బెగడఁ బం । చాస్యంబుచందంబునన్
జని, సంరంభముదంభమున్ విడిచి, యు । త్సాహంబుదీపింపఁగన్
వినుతింపన్ మునివర్యు లెల్లఱు, సమీ । పించెన్ ధనూరత్నమున్

సీ. వైరివీరకఠోర । భావాంబరంబున
నాశాంధకారంబు । లణగిమణఁగ;
జానకీముఖసరో । జాతంబు వికసింప,
దదపాంగభృంగసం । తతి చెలంగ
దురభిమానావనీ । వరదంభవాక్యోడు
సంతాన మొల్లెడ । నంతరింప,
కుటిలమానవలోక । కుముదంబు ముకుళింప
గపటభూపత్యులూ । ఖంబు లడల

గీ. ఋష్మనురానీకచక్రవా । కంబులలర,
నమరవరునాశ పై రాగ । మతిశయింప,
హరశరాసనసరంగోద । యాద్రిఁ దోచె
మానినుత రామమార్తాండ । మండలంబు. 1010

గీ. ఇనకులస్వామి, చారుమ । దేభగామి,
మానవునియట్లు, పెద్దల । యానఁబొంది,
ధనువుఁ గొన నేగి నంతనె, । జనకుపత్ని
తనదుచెలికత్తెతో నిట్టు । లనియె నెలమి. 1011

ఉ. కేలఁ గదల్పలేక వరి । కించి తొలంగిరి బాణరావణుల్;
బాలికఁ గోరివచ్చిన నృ । పాలకు లెల్లఱు సొమ్మసిల్లి రీ

బాలుఁడు శూలికార్ముకముఁ । బట్టఁగ నోపునె జంకుఁ దక్కుఁ దే
లీలను రాజహంస కద । లింపఁగఁ జాలును మేరుశైలమున్ 1012

క. అనినన్ విని నెచ్చెలి యి
ట్లను:—నరుల కచింతనీయ । మగాప్రభావం బ
వ్వనరుహగర్భలిఖితము
వనితా మనశక్య మౌనె । భావింపంగన్. 1013

సీ. కడఁ జూడఁగా రాని । జడధిఁ దాఁవఁగ నౌనె?
జడదారి ఘటకకు । నడఁగి మడఁగె
జటులాంధకారంబు । సంహరింపఁ దరంబె!
రవి తోఁచినంత స । ర్వము నశించె
నతివ! యాలోచింపు । మతనుఁ డెంతటివాఁడు,
పూవులచే లోక । ముల జయించె
మతి ధ్యానముం జేయ । మంత్రాక్షరము లెన్ని!
కలదేవతలకు శ్రం । ఖలము లయ్యె

గీ. నింత యేటికి మదగజం । బెంతటిదగు?
నొక్క స్వల్పాంకుశంబున । కుక్కుఁ దక్కె;
నతుల తేజస్వి కిల నసా । ధ్యంబుగలదె?
కాంత! పరికింపుచుండుము । చింతఁ దక్కు. 1014

గీ. అనిన విని యూఱడిల్లె నా । జనకపత్ని;
జనకసుత రాము నీక్షించి । సంశయించి,
జనకునిప్రతిజ్ఞను దలఁచి । సంచలించి,
నాథనూరత్నముం గాంచి । నను నుతించి. 1015

చ. భళిర! శిరీషపుష్పమున । వజ్రముఁ దుంపఁగ నిశ్చయించె నా
నలువ,తలఁప బాలుఁడు పి । నాకశరాసన మెక్కుపెట్టఁగా

వలఁతియె యటంచు నెంచి బహు। భంగుల వేల్పుల నన్నుతించి, నృ
క్ష్మాల నిగిడించి, జానకి ర। ఘుప్రవరున్ దిలకించె నాదటన్.

గీ. తనదు కన్నీరు కృపణుని। ధనముఁ బోలి
నేత్రకోణద్వయంబున। నిల్చియుండ,
నువిద రాముని( దిలకింప। నోడి హృదయ
బంభరముఁ జేర్చెఁ దత్పాద। పద్మములకు. 1017

చ. ధరణితనూజ, యాతురతఁ। దఁ బరికింపఁగ నుత్సహించి, భూ
వరులఁ దృణీకరించు తన। బల్మి రహింపఁగ రాముఁ డత్తఱిన్.
గరుఁడుని వైఖరిన్ భయద। కార్ముకసర్పముఁ జూచినంత, సో
దరుఁ డగు లక్ష్మణుండు, భుజ। దర్పమునన్ వచియించె నివ్విధిన్.

ఉ. “శ్రీదయితుండు, రాముఁడు, వి। శృంఖలవీరుఁడు, భూతలంబుపైఁ
బాదయుగంబు మోపి, పుర। వైరిశరాసన మెక్కువెట్టు నో
యాదివరాహమా! కమఠ। మా! భుజగాధిప! దిగ్గజంబులా
రా దయఁ గల్గి యిత్తఱి ధ। రన్ భరియింప ధృతిన్ వహింపుఁడీ

చ. సత్వముఁ జూపఁగాదు, నృప। చంద్రులఁ గేరఁగఁ గాదు సీత క
న్యత్వముఁ బాప, వీరపతి। యై ధరణీసతి ఖ్యాతికెక్క, మా
తత్వముఁ జాట, లోకనుత। ధన్విరఘూద్వహుఁ డుత్సహించుచున్
సత్వర మేగుదెంచె హర। చాపము నెక్కిడ నాలకింపుఁడీ. 1020

చ. అనుజుఁడు లక్ష్మణుం డిటు ల। హంకృతిఁ బల్కఁగ నాలకించి, మ
ద్ధనువు ధరింప నేగు గుణ। ధాముని రాముని( జూచి సంతసే
మనుజవిభుల్ మనోదురభి। మానములన్ ద్యజియించి మెచ్చి రా
జనకుఁడు వానిభార్యయును। జానకియున్ వినుతించి రెంతయున్.

గీ. రామచంద్రుని శౌర్యవా। రాశినడుమ,
నాదు కార్ముకరత్నంబు। నావఁ బోలె,

తారకుఁడు లేడు సకలభూ । ధవు లయందు;
రమ్యతరగాత్రి! పర్వత । రాజపుత్రి! 1022

చ. జలమును బొందఁజాలని తృ । షావరితప్తుఁడ కాలమృత్యువున్
గలిగినపిమ్మటన్ జలముఁ । గల్గిన నవ్వాడు లాభ మేమి యన్
దలఁపున, జానకీరమణి । తన్ బరికింపఁగ, నామెభావమున్
దెలిసి హసించె రాఘవుఁడు। ధీరవరుం డయి, సుప్రసన్నుఁ డై.

గీ. ఎండినపొలంబు వాన కై । యెదురుచూచు
చొప్పునన్ దన్ను జనకుండు । చూచుచుండ,
బొమ్మలంబోలి పరికింప । భూమిపతులు,
మునికి మ్రొక్కి రాముండు మ । ద్ధనువునత్తి. 1024

గీ. నారిఁ గూరిచి లాగినం । తన లతాంగి!
పెద్దధ్వనితోడ ఫెళ్ళున । విఱిగె విల్లు;
జంట మెఱపు తళుక్కనన్ । మెఱసినీల
జలదమున లీన మై పోఁగు । చందమునను. 1025

ఆ. వె. నారిఁ బట్టి లాగు । నరపతి కేరీతి
ధర్మువుండు ననఁగ । ధర్మ మకట
ఫెళ్ళుమనుచు విఱిఁగె, । భీకరరావంబు
భూమిపతుల మూర్ఛఁ । బొందఁజేసె. 1026

సీ. బ్రహ్మాండభాండంబు । పగిలెనాఁ గుహారకం
దరములు ఘూర్ణిల్లి । ధ్వనులనీనఁ
గందరాంతరసుప్త । కంఠీరవము లేచి
డంబుగఁ బ్రత్యుత్త । రం బొనంగఁ,
గుంజాంతరోన్నిద్ర । ఘోరదర్పకమ్ము శ
తఘ్ని యన్ భయమునఁ । దల్లడిల్లఁ,

బరకామినీబాహు । పరివృతరావణ
శ్రవణకటాహముల్ । సంచలింప

గీ. ధ్యానగతినుండు భార్గవుం । డదరిపడఁగఁ,
బాలకడలిని వెన్నుండు । మేలుకొనఁగఁ
బ్రళయపర్జన్యగర్జాను । బంధ మనఁగ
సంచరించె ధనుర్భంగ । జనితరవము. 1027

శా. ఆకోదండము రెండు ఖండములుగా । నారావ మొక్కుమ్మడిన్
లోకాలోకముఁ దాకి, సంద్రములక । ల్లోలధ్వనిం గూడి, ది
గ్వ్యాకీర్ణంబయి,భూనభోంతరము లు । త్కంపింపఘూర్ణిల్లఁగా
నాకర్ణించెఁ జలించి భార్గవుఁడు తా । లల్లాడ కుద్విగ్నుఁ డై

చ, కమఠవరాహదిక్కరులు । క్ష్మాస్థలియున్ విచలించె, భాస్కరా
శ్వములు పథంబుఁ దప్పె,సుర । వైరులగుండెలు బ్రద్దలయ్యె, న
య్యమరులు సంతసించి జయ । మంచు నుతించిరి, హెచ్చరించి రె
ల్లమునులు, వైరిభూపులు క । లంగి తొలంగిరి కాందిశీకులై.

గీ. వెన్నెలం గ్రోలు క్రొన్నెల । వన్నెనీను
రామచంద్రుని చిఱునగు । మోముఁ జూచి,
గాధిపుత్త్రుండు దుగ్ధప । యోధిఁ బోలి,
పులకలను నిండుటలలతోఁ । బొంగిపొరలె. 1030

గీ. ఆకసంబున నచ్చర । లాడిపాడి
రఖిలసిద్ధులు సాధ్యులు । నమరవరులుఁ
చిత్త మిగుఁరొత్తఁ బొంగి యా । శీర్వదించి,
రవని సురులకోలాహల । మతిశయించె. 1031

సీ. ఎండఁ బాఱినపైరు । వృష్టిఁగాంచిన రీతి,
రాణిమనోవీధి । రాణఁ దనరె,

స్థలహీనునకు మంచి । తావు చేకురినట్లు,
జనకుండు తోషిత । స్వాంతుఁ డయ్యెఁ,
దమ మంతరించిన । తఱి దీపతతిఁ బోలి,
నృపసమాజము కళా । హీన మయ్యె
వర్షోదకంబును । బడసినచాతక
పోతముంబలెసీత । మోద మొందెఁ,

గీ. చంద్రునిఁ జకోర మీక్షించు । సరణి నపుడు
ఘనునిరాముని సౌమిత్రి । గాంచి యలరె,
జలధి మథనావసరమున । నలలఁ బోలి,
కాహళమృదంగవేణుశం । ఖములు మ్రోఁగె. 1032

గీ. బాల కెంగేల నొకపుష్ప । మాల గ్రాల
డెందమున మహోత్సాహంబు । నందడింప,
వదనమున్ వంచి,మందాక్ష । భారమునను
దాశరథిఁ జేరి నిలిచెఁ జి । త్తరువుఁ బోలి; 1033

గీ. స్నేహవశమున మదిఁ దోఁచు । సిగ్గువలన,
జంకి నిల్చిన జానకి । సరణిఁజూచి,
ఎలమిఁ జెలులు శతానందుఁ । డెచ్చరింప,
లలన పూదండ రాము న । లంకరించె. 1034

సీ. కమ్మనిపూఁదావి । క్రిమ్మి గుబాళింపఁ
బొలుపొందె వేల్పుల । పూలవాన,
పువ్వారు బోణులు । నివ్వాళులొసఁగంగఁ,
బొదలె నెల్లెడలఁ గం । బూరతావి,
భూసురాశీర్వాద । ముల వేదములతోడఁ
గడలఘూర్ణిల్లె మం । గళరవంబు,

పుణ్యాంగనలపాట ॥ పణ్యాంగనలయాట
యింపుసొంపుం గూర్చె ॥ నెల్లదిశల

గీ. వంశవృత్తాంతమున్ గద్య ॥ పద్యములను
కడకు నుడివిరి వందిమా ॥ గధులు బుధులు;
ఆశుభముహూర్తసమయంబు ॥ సభినుతింప
నలవియే? పార్వతీ! చూడ ॥ వలయుఁ గాక. 1035

గీ. శిష్టులడర, ససంతుష్టి ॥ దుష్టు లడల
బ్రాహ్మణులు వేదవాక్కులఁ ॥ బ్రస్తుతింప,
జానకీనేత్రబంభర ॥ సంచయంబు,
రాఘవునిపాదపద్మమ ॥ రందమానె. 1036

గీ. జానకీరామచంద్రుల ॥ సరణిఁ జూచి,
వైరిభూవరుల్ మోముల ॥ వంచుకొనిరి;
పద్మినీభాస్కరులవైభ ॥ వంబుఁ గాంచి
ముకుళితములైన కైరవం ॥ బులనుబోలి. 1037

గీ. అలయహల్యను బ్రోచిన ॥ యట్టియీపద
దాబ్జములు నాకు శరణమా ॥ సని తలంచు
సీతభావంబు గ్రహియించి ॥ ప్రీతచిత్తుఁ
డయ్యె శ్రీరామచంద్రుఁ డో ॥ యంబుజాక్షి. 1038

ఉ. ఆసమయంబునన్ జనకు ॥ డాత్మజ నారఘురాముఁ జూచి, పే
రాసలఁ బాసి కొందఱు భ ॥ యంపడియేగిరి, కొందఱమ్మయున్
మోసముఁ జేసి సీతఁ గొని ॥ పోవఁ దలంచిరి, బాలుఁ డట్లొ బా
ణాసనమెక్కువెట్టె నని ॥ యాజికిఁ జేరిరి కొందఱుత్తటిన్ 1039

చ. జనకుడు యుద్ధయత్నముల ॥ చందముఁ గాంచి హసించి యిట్లనున్:-
జనపతులార! మీకుఁ గల ॥ శౌర్యము, ధైర్యము, బాహువీర్యమున్

జనులకుఁ జెల్ల మయ్యె హర । చాపముఁ గేలు స్పృశించుటే కా
ముని రణభీమునిఁ గనియుఁ । బోరఁ దలంచి రెట్టి హీనులై 1040

గీ. లక్ష్మణుఁడు పరిచండ క్రోధాన । లంబునందు
శలభములఁ బోలి మీరలు । చావనేల?
బ్రదికి బలుసాకుఁ దినవచ్చు । రాజులార!
బెండువడి రిత్త నిండ్లకుం । బోండు లెండు. 1041

సీ. హరికి వాహన మైన । గరుడుని స్థానంబుఁ
జెలఁగి కాకంబు కాం । క్షింపఁ దగునె
మృగలోక భీకర । మృగరాజు విఖ్యాతి
మృగధూర్తకంబు వ । రింపఁ దగునె
ఒరులసవదకుఁ జూ । పోవమిఁ గల క్రోధ
శీలుఁడు సుఖము వాం । ఛింపఁ దగునె
పరకాంతలను జూచి । వలచి పైఁబడు కాము
కుఁడు నిష్కళంకంబుఁ । గోరఁ దగునె

గీ. మెసఁగఁ జాలక బీదల । కొసఁగలేక
బ్రదుకు లోభి శాశ్వతకీర్తిఁ । బడయఁ దగునె
ఈశ్వర ద్వేషి మోక్షంబు । నెనయఁ దగునె
క్షితితనూజను మీరు కాం । క్షింపఁ దగునె? 1042

క. ఈరీతి జనకభూవరుఁ
డా రాజుల తోడ నయభ । యంబులు దోపన్
వీరఘటా కంఠీరవు
శ్రీరాముని దోర్బలంబుఁ । జెప్పుచు నుండన్. 1043

పరశురాముని యాగమనము

సీ. మహిఁ బాతకులఁ దోఁపఁ బొచ్చు । మత్తశుండాలముఁ బోలి
జేబుగ జడ లెల్ల । జీరులాడ

బాలేందుఁ బోలిన । ఫాలభాగంబు త్రి
పుండ్రాంకితంబయి । పొలుపు నింప
నాజాను లంబిత । హస్త యుగంబునఁ
బరశువు, జపమాల । భయముఁ గొలుపఁ
గటిసీమఁ గట్టిన । గైరికవసనం బ
కాలసంధ్యాకాల । కాంతిఁ గ్రాల
గీ. బాణ బాణాసన కృపాణ । తూణవితతి
తన శరీర పశ్చాద్భాగ । మున రహింప
వదన ముదయార్కబింబమై । ప్రజ్వలింప
వచ్చె హతభూధవుఁడగు । భార్గవుండు. 1044

సీ. ప్రాగ్దిశ నుదయించు । పౌర్ణిమేందుంబోలు
నారక్తభీకరా । స్యంబువాని
భ్రుకుటిచేఁ గుటిలమై । వికట దృష్టిం గ్రాలు
తరుణారుణాబ్జ నే । త్రములవాని
రుండమాలంబోలు । రుద్రాక్షమాలికా
లంకృత దీర్ఘ గ । ళంబువాని
నిరుపక్క నున్నత । శిరములంబలె నొప్పు
ఘన వృషస్కంధ యు । గంబువాని
గీ. సమిత భస్మావలిప్త దే । హంబు వాని,
వీర రసమిట్లు మునిగ నా । విర్భవించె
నని నుతింపఁగ నేతెంచి । నట్టివానిఁ
బరశు రాముని జూచిరా । ధరణివరులు. 1045

ఉ. ముచ్చటదీఱఁ బెండ్లికని । పొంకముగా జనుదేర, భార్గవుం
డిచ్చటికేగుదెంచెవధి । యింపఁగ, గానకు జింక వేఁటకై

వచ్చినవానిఁ గ్రోలుపులి । పైఁబడి, చంపినయట్టులయ్యెనం
చచ్చటి రాజులెల్లరు భ । యంపడి రెంతయు సంచలించుచున్.

చ. తమతమ నామముల్ వరుసఁ । దప్పక మెల్లఁగ నుచ్చరించి, గో
త్రములను, వంశచిహ్నములఁ । దండ్రుల నామములన్ వచించి, శ
స్త్రములఁ ద్యజించి, మూపరశు । రాముని పజ్జను మోఁకరించి, పా
దములకు మ్రొక్కి, రాజులు ప । దంబులుతొట్రిల నిల్చిరత్తఱిన్.

చ. జనకుఁడు వచ్చి, పాదజల । జంబులఁబట్టి నమస్కరించి, సీ
తనుఁబిలిపించి, భక్తిమెయిఁ । దచ్చరణంబుల మ్రొక్కఁబంచి, యు
య్యానఘుని దీవనల్ బడసి । యాపెను లోనికిఁబంపె; గాధినం
దనుని యనుజ్ఞపై నతులొ । నర్చిరి నవ్వుచు బాలవీరులున్.

గీ. రామలక్ష్మణులం జూచి । రాముఁ డంతఁ
జిత్తరువుఁ బోలి తుదకు నా । శీస్సులొసఁగె;
నతని యాశీస్సులం బొంది । యధికభక్తి
గురువు పజ్జకు నేగిర । య్యిరువురపుడు. 1049

చ. అలఘుల మంచు బెండ్లికయి । యాతురతన్ జనుదెంచినట్టి రా
జులఁగని రామలక్ష్మణుల । చొప్పుఁ గనుంగొని, యోలగంబునం
దలబలమాలకించి, యిను । మంతయు బుద్ధి నెఱుంగనట్లు చూ
పుల నటియించి భార్గవుఁడు, । భూవరులెల్లరుఁ దల్లడిల్లఁగన్.

గీ. నృపకులంబిట్టు లేతేర । హేతువేమి?
చెప్పుఁడనినంత, జనకుండు । చెప్పుచుండఁ,
బుడమి బీటలు వాఱిన । పోలుపుఁ దెలుపు
నలిక నేత్రు ధనుష్ఖండ । ములను జూచె. 1051

### పరశురాముని యాగ్రహము

చ. కనుఁగొని యార మూర్ఖజన । కా! శివకార్ముక మెవ్వఁడివ్విధిన్
దునియలఁ జేసి, శంభునకు । ద్రోహమొనర్చ సాహసించి, నా

కినుకకుఁ బాత్రుఁడయ్యెఁ బరికించెదఁ జూపుము లేకయున్నఁ జే
రోఁగను మనినంత రాఘవుఁడు కుంఠిత వీరవరేణ్యుఁ డిట్లనున్.

గీ. విప్రకులవర్య! శివువిల్లు విఱిచినట్టి
దాసుఁడను నేను సెలవిండు దోసమున్న;
ననిన విని భార్గవుండంత నాగ్రహించి
యెల్ల దిక్కులఁ జూచి కన్నెఱ్ఱఁ జేసి. 1053

చ. మనమున జంకుఁగొంకు విసుమాన మొకింతయు లేని రామచం
ద్రునిఁ దిలకించి సేవకుఁడు దోస మొనర్చునె మూర్ఖ! ఫాలనే
త్రుని నిరసింపఁగన్ ధనువు ద్రుంపఁగ వచ్చునె? చెప్పకేమి యా
ధ్వనియె మదీయ కర్మములఁ బట్టి ననుంగొని తెచ్చెఁ జెచ్చెరన్

ఆ.వె. చంక దుడ్డుఁ బూని శరణార్థి వైతివో?
శివుని ధిక్కరించు సేవకుఁడవో?
యోధ వరుఁడ వౌదు యుద్ధంబు సిద్ధంబు
పోడువ కుండ నిన్ను విడువ విడువ. 1055

ఉ. బాలుఁడవో? దురాత్మ! పుర వైరికి ద్రోహ మొనర్చినట్టి చం
డాలుఁడవో? వినుండు నర నాయకు లెల్లరు రాజశేఖరున్
హేళనసేయఁగన్ దలఁచె నేఁడుఁ డాతనిఁ గార్తవీర్యునిం
బోలినవైరి నేఁ దునుమఁ బోలుఁ గఠోర కుఠార ధారలన్.

గీ. అని వచించిన భార్గవు నభినుతించి
యవనినాథులు మోదించి రాత్మలందు
నంత ముఖమున దరహాస మంకురింప
నీసడించుచు లక్ష్మణుం డిట్టులనియె. 1057

క. బాలుఁడ? ధిక్కృతపశ్వ
త్బాలుఁడ? యర్కేందుతుల్య బాలుఁడ? జితభూ

పాలుఁడో! పాతకిల్బిషజం
బాలుఁడో! నీవెఱుఁగఁగలవె! । భార్గవరామా. 1058

క. హంతవ్యుఁడె విప్రుఁడు! బహు
మంతవ్యుఁడ యని తలంచు । మముఁ దిట్టెదవో!
క్షంతవ్యుఁడవే! భార్గవ !
గంతవ్యుఁడ వాదు పీవు । కాలుని పురికిన్. 1059

గీ. అమితకోపివె చండాలుఁ । డనఁగ నొప్పు
నీవెఱుంగని ధర్మమొం । డేనిగలదె
చిఱుత విల్లొంకు విఱిచిన । చేఁతకిట్లు
తగవు లాడినఁ జెల్లునే! । ధరణిదేవ! 1060

మ. శివుఁడో మాధవుఁడో ధరించు ధనువేన్ । జింతింపగానేల! భా
ర్గవ! యేకార్ముకమైన మాకలఁతి; దో । ర్గర్వంబుచే నెన్ని ధ
ర్మవులన్ దుంపము బాల్యచాపలమునన్, । రోషించి భాషింప
ధర్మవె! మాకియ్యది యొక్క లెక్క యగునే! । మూర్ఛించినం జెల్లునే.

గీ. అనిన వినిభగ్గుమనిమండి । యాడుగఱచి,
గాత్రమంతయుఁ గంపింపఁ । గటము లదర,
గండగొడ్డలి తనకేల । గంతు లిడఁగ
బలికె నీరీతి సభలోన । భార్గవుండు. 1062

శా. ఔరా? రాజకుమార! నీకు మరణం । బాసన్న మయ్యెంజుమీ
ఈరీతిన్ గడిమీఱె భార్గవుని స । న్నగ్గాడుదే! చూడవో
ఘోరంబైన కుఠారమున్! శివమహా । కోదండ మత్యల్పమా?
ఏరైనన్ వినినన్ సహింపఁగలరా? । యీకాఱు లింకేలరా?.

శా. నానా కంఠ విలుంఠన క్రియ నసూ । న్నఖ్యాతిఁ బొంపెక్కరా
ఈనాగొడ్డలి; యుద్ధరంగమున న । న్నీడాడి పోరాడెదో?

మానింగా నొక విప్రుఁగాఁ దలఁచి నం । భాషించినం జెల్లునే!
ప్రాణాశం గలవాఁడ వేన్ దొలఁగుమో! వైతండికా! కొండికా!

క. అనవిని లక్ష్మణుఁడిట్లను
ననఘామాకెల్లధనువు । లరయసమంబుల్
వినుఁడు పురాతన మియ్యది
ఘనమా? యిఁక దీనికింత । గాసిలనేలా? 1065

క. గాసిలిన నేమి లాభం
బీసుం గొని వాదులాడ । నేటికి? శివబా
ణాసనమును రాముండట
వీసంబున్ వంచలేదు । ఫెళ్ళున విఱిగెన్. 1066

క. తల్లిన్ జంపిన వానికిఁ
జెల్లునె యీరీతి నీతిఁ । జెప్పఁగ నకటా!
ఉల్లంబొల్లదు బ్రాహ్మణ
తల్లజ వధియింపఁ నిన్ను । దయఁ బ్రోచితిఁబో. 1067

క. భర్గుని శిష్యుండవునై
వర్గము కోపంబు నీకు । శాంతింపదగున్
స్వర్గము మోక్షము చెపుమా
భార్గవ! యీవింటి కొఱకు । వగవం దగునా? 1068

క. కోపము తాపముఁగూర్పున్,
దాపంబున నెట్టి వాఁడు । ధర్మచ్యుతుఁడై
పాపంబుఁ జేసి పశ్చా
త్తాపంబును బొందు హీన । దశకుం గుందున్. 1069

ఉ. నావుడు భార్గవుండు గళ । నాదము దిక్కుల నావరింపఁగా
భూవరులెల్లఱున్ భయముఁ । బొందఁగ నిట్లను “బాలకుండవన్

భావమునన్ సహించితిని । పాడిఁ దలంపక రాచబిడ్డనన్
గావర మంతకంతకెసఁ । గన్ వెడవల్కులఁ బల్కుచుంటివో?

ఉ. ఈవిధిఁబల్కకుండ ధర । ణీశ్వరులన్ వధియించె నేపుమై
నీవఱికక్కటా! పరశు । వేటికి నిన్ను వధింప కున్నదో?
ఈవానరించు పుణ్యమద । యెట్టిదొ! లక్ష్మణ! చెప్పకేమి నీ
చేవకు జంకిగాదు ముని । శేఖరు గాధిజుఁజూచి యోర్చితిన్.

చ. కఱకఱ గండగొడ్డలిని । క్షత్రియవర్యుల కంఠనాళముల్
నఱికితి సర్వభూతలము । నన్ దసియించితి విప్రకోటికి; న
న్నెఱుఁగవు బ్రాహ్మణుండని ము । నీశ్వరుఁడంచు మదిం దలంచి వ
ల్లఱుపులఁ బెక్కులాడెదు బ । లాఢ్యునికై వశి క్షాత్రడింభకా.

చ. కొఱకొఱ ధిక్కరించెదవా! । క్రూర కఠోరకుఠారధారకున్
వెఱవక నిల్వనోపుదువా? । నీతలిదండ్రుల నేడిపింపఁగా
నఱమఱ లేకయిట్లు దగ । నాడెదు భార్గవు; నిన్నుఁగన్నవాఁ
డెఱుఁగును నన్ను బాలకుఁడ । వేటికిఁ బ్రేలెదు కాఱుకూతలన్.

గీ. బ్రాహ్మణ బ్రహ్మచారిని । భార్గవుఁడను
శాపమునఁ జాపమునఁ జంపఁ । జాలినట్టి
పరశురాముని నిరసించి । బ్రదుకఁ గలవె?
బాలకుఁడ వీవు సైరింప । వలసె మాకు. 1074

గీ. కార్తవీర్య బాహు సమూహ । గహన దహన
మీ కుఠారంబు నేమిగా । నెంచి తొక్కొ?
వీరకామినీ గర్భ ని । ర్భేదకంబు
నిస్తులము మత్పరశ్వధ । నిస్వనంబు. 1075

గీ. నరపతి కులంబు చెఱకని । నఱికి నఱికి
మొప్పు వడసిన దిప్పుడు । త్రుప్పు వట్టె

యోధవర! నీదుకంఠ శా । ణోపలమున
వాఁడిఁ బెట్టెదఁ బోరాద । వచ్చెదేని. 1076

గీ. అనినవిని చాలు మేలు మే । లని వచించి
పరశురామునిఁ బరికించి । పరిహసించి,
అట్ట హాసంబుఁ జేయుచు । నిట్టనిల్చి
లక్ష్మణుండిట్టు లనియె ని । ర్లక్ష్యముగను. 1077

ఉ. అడ్డెను నీరుద్రావఁ దగి । నంత వచించితి వూజడిల్లుమే
ఎడ్డమి మాకు వాటిలునొ! । యీనృపులెల్లఱుఁ జూడమాటికిన్
గొడ్డలిఁ జూపి చూపి యెటు । గొడ్డెములాడినఁ జెల్లునొక్కొ!మా
కడ్డగ నిల్వనోపవు ధ । రామర వంశ పయోధి చంద్రమా!

గీ. గొడ్డలిఁ జూపి యిదిపాఱిణ । గొడ్డ మనుచు
మమ్ము బెదిరింపఁ దగునె బ్రా । హ్మణవరేణ్య!
బూరటిల్లంగ బుగ్గలు । పూత్కరించి
ఎగురఁ గొట్టెదవే కొండ । నీడఁ బోక? 1079

గీ. భూమిదేవుల గోవులం । బ్రోచుకొఱకుఁ
బ్రాణములనైన నర్పించి । రాఘవులము;
పరశువుంబూని వచ్చిన । వాఁడ వయ్య,
బ్రాహ్మణుఁడ వీవు సైరింప । వలసె మాకు. 1080

క. భృగుకుల తిలకుఁడ వాపయి
జగదభినుత ముని వరుఁడవు । చంపందగునే?
దగఁజూచిన గోహత్యయు
నెగఁజూచిన బ్రహ్మహత్య । యేమన వచ్చున్. 1081

గీ. పాపమున కపకీర్తికి । భయముఁ జెంది
జంకితింగాక శర శరా । సన కుఠార

ములను వీక్షించి పర్వోత్తు । మూఢుఁ డెవఁడు?
ఇంత కోక వింటిక్కై యింత । పంతమేల ? 1082

క. అనవిని యా సౌమిత్రిం
గని కనుఁగవఁ గెంపుదోప । గ ధిజుఁ గని య
జ్జనపతి సంఘముఁ గని, య
జ్జనకుని, రాముని, మిగిలిన । జనులన్ గనుచున్. 1083

మ. కుటిలభ్రూకుటి ద్వేష రోష జనిత । క్రోధాగ్నికిన్ మూలమై
నిటలాక్షుఁ దలఁపింప నేత్రయుగళిన్ । నిర్నిద్రమై రౌద్రము
త్కటసంధ్యారుచిఁ బోలి దిక్తటములన్ । గ్రమ్మంగ గర్జించి య
జ్జటివర్యుండనివార్య శౌర్యమున వి । శ్వామిత్రుతో నిట్లనన్.

ఉ. కాలుని వీటికేగుటకుఁ । గారుల నోరికోలందిఁ బ్రేలె నీ
బాలకుఁ డెంతయున్ గుటిల । భావుఁ డధర్మపథార్జితాఘుజా
బాల నిమగ్నమానసుఁడు, । భాస్కరవంశ కళంకుఁ డింకనే
జాలము సైపఁజాల ముని । చంద్రమ! వీని వధింతు బ్రేల్మికిన్.

ఆ. వె. తానశించి మఱియుఁ । దన కులంబు నశింపఁ
జేసి కొనఁగ నన్ను । గాసిఁ బెట్టి,
వాసి కెక్కినట్టి । భార్గవు నెదిరించి
బ్రదుకఁ గలఁడె యెట్టి । రాచవాఁడు? 1086

ఆ. వె బాలకుండు వీఁడు । బ్రదికించు కొనుమింక
మద్బల ప్రతాప । మహిమఁ దెలిపి,
జంకుఁ గొంకుఁ దక్కి । జంకింప నుంకించె,
బోదువ కుండ వీని । విడువఁ దగునె? 1087

చ. అనవుఁడు లక్ష్మణుండు పరి । హాసముఁ జేయఁ దలంచియిట్లనున్
మునివర! కాందిశీకులగు । భూపులఁ జంపి యనేకభంగులన్

ఘనముగఁ జెప్పఁగొంటివి జ । గన్నుత కీర్తియుఁ గొంటివింక ని
న్ననఘుఁడు గాధినందనుఁడ । హర్నిశమున్ వినుతింపఁజాలునే!

గీ. నలువను హసించి, వానియా । దలనదన్ని
శివుని నిరసించి, వేనోళ్ల । చిలవఁ దెగడి,
భవద మోఘ ప్రతాపమున్ । బలము, జలము,
నెల్లభంగుల నుడివె నీ । యేకముఖము. 1089

గీ. అంతతోఁబోక, యకట! య । హంకరించి,
గాధినందను నొకవంది । గా నొనర్పఁ
దలఁచి, వర్ణింపుమని మొదు । ధరణిదేవ!
ఈవ వర్ణింపరాదె? యా । పోవుదాక. 1090

గీ. ఈవు గొడ్డలిచేఁబూని । యొసఁగునాఁడుఁ
ఏము జనియించి యుండమా । హేతువునను,
సేగి లేకుండ నీయాట । సాగివచ్చె
భార్గవా! కోప మేటికి । బ్రాహ్మణునకు. 1091

గీ అకట! నిన్నాశ్రయించిన । యారువురును
శాత్రవులు, వారి నెమ్మెయిఁ । జంపఁ దేని
అనఘు శ్రీరాము గెలిచిన । యట్లు వినుము
పాతవింటి కింతటి వంక । రోఁత గాదె! 1092

గీ. ఎగ్గుఁజన్ మోము శోభిల్లు । నేమహాత్మ!
క్రోధభరమునఁ జిత్తసం । క్షోభమునను
దుఃఖముజనించు, జ్ఞానంబు । తొలఁగిపోవు
ధైర్యముంబూనఁ దగునంద్రు । తత్త్వవిదులు. 1093

గీ. సమర కార్యధూర్వహుఁడైన । శౌర్యశాలి,
యుద్ధ సన్నద్ధుఁడై నిల్చు । యోధుఁ జూచి,

పందవలె దంభవాక్యముల్ । పలుకఁడెపుడు,
తున్ను సురవరేణ్య! నీకేల । కంఠశోష. 1094

చ. అనవిని భార్గవుండపు డు । దగ్ర మహోగ్రహావిగ్రహోగ్రుఁడై
జనులను జూచి, భీకరని । శాత కఠోర కుఠార ధారలన్
దునెమొనవీసి, నాయెడల । దోసము లేదని లేచినంతనే
కని తటిమించివచ్చె నపు । గాధిసుతుండుహాసించియిట్లనున్ 1095

గీ. సజ్జనుండవు భృగువంశ । సంభవుఁడవు
బ్రాహ్మణుండవు, బాలుని । వాక్యములకు
నాగ్రహింతువె? సజ్జను । లాగ్రహింప
రితని గుణదోషములను నీ । వెన్నఁదగునె? 1096

గీ. ఇతని యపరాధ శతమున । కించుకంత
నాత్మ శాంతింప రాదె మ । హానుభావ
అనిన నానని గాధేయు । ననునయింపు
వాక్యముల కిట్లని వచించె । భార్గవుండు. 1097

సీ. ఆగ్రహించి యరాతి । నిగ్రహించుస్వభావ
మునుగలవాఁడను । భూనురుఁడను,
మీఁదుమిక్కిలి యెందు । మీఁదులేని కుఠార
మనునాయుధంబుఁగ । లట్టి వాఁడఁ,
గోధశీలుండ, మ । ద్గురువైరి రఘురాముఁ
డెదుట నిల్చె,నితండు । వదరుచుండె,
శాంతింప వేడెదు । శాంతింపవచ్చునె?
నీశీలముంజూచి । నిన్నుఁ జూచి,

గీ. ఓర్చితినిగాక, లేకున్న । నార్చిపేర్చి
పరశువుం ద్రిప్పి యీతని । శిరముఁ దున్రించి,

ఒజ్జలఋణంబుఁ దీర్పక । యుందునోటు?
జనవరధ్యేయ! గాధేయ! । మునివిధేయ!. 1098

క. అన విని పకపక నవ్వుచు
మునివర యని లక్ష్మణుండు । పొంతకుఁ జని నీ,
ఘనత నెఱుంగమె యకటా!!
విను మెవ్వఁడెఱుంగకుండు । విశ్వజనీనా! 1099

క. జననీజనకుల ఋణమును
గొనకొని మునుదీర్చి యిపుడు । గురువు ఋణంబున్
ఘనముగఁ దీర్పఁగ వచ్చితి
వనఘా! నిను మెచ్చవచ్చు । నార్యులు నభలన్. 1100

గీ. క్షత్రియ కులాంతకుని పర । శ్వధముఁజూపి
మాటి మాటికి బెదిరించి । మాటలాడె
దా దినము లంతరించిన । వార్యవర్య!
ఇంతకొక వింటి కింతటి । యెంత తగునె! 1101

క. వాదింపవచ్చి యొత్తిన
వాదింపవో! యెంతటి నెఱ । వాదివో? వినుమా
ఖేదించు ఖడ్గవాది,పై
మోదించును కార్యవాది । మునికులతిలకా. 1102

గీ. కార్యముఁ బరిష్కరింపఁగఁ । గాంతుయున్నఁ
బెద్ద లున్నారు గద వారిఁ । బిలువఁ దగద?
పెద్దలకుఁ దోడు గురువుర । ప్పింపరాదె?
నీవలనఁ గాదు తగవుల । నిర్ణయింప. 1103

గీ. పుచ్చినగవిల్లు, రఘుకుల । పుంగవుండు
వంచెనో లేదా ఫెళ్ళున । బ్రద్దలయ్యె;

గతనలిల సేతుబంధస । కాంతుఁడేటి
కొకటికిన్ నాలుగిచ్చెద । మోర్వరాదె! 1104

గీ. పరమపావన కాషాయ । వస్త్రములకు
మహిని దీపించు రుద్రాక్ష । మాలికలకు
సాధుజన విప్రులకు నమ । స్కారశతము,
క్రూరతర హేతువులకుఁ దిర । స్కారశతము. 1105

క. జననిం జంపిన విప్రుఁడు
జనపాలురఁ జంప నింక । జంకునె కలనేన్;
జనకద్రోహిన్ దునిమిన
జనులకు నుపకారమగునె! । జమదగ్నిసుతా! 1106

గీ. ఇట్లుసౌమిత్రి, క్రోధవా । క్యేంధనములఁ
బ్రజ్వలింపఁగఁ జేసె భా । ర్గవునికోప
వహ్ని; నంతట శీతల । వారిఁ బోలు
వాక్యముల రామచంద్రుండు । పలికె నిట్లు. 1107

గీ. తమ పరితాపంబు నించుకం । తయు నెఱుంగఁ
డజ్ఞుఁ డీ క్షీరకంఠుఁడు, । ప్రజ్ఞ లేని
బాలకుండు తన్నెదిరింప । వచ్చుఁ గాక
బ్రాహ్మణ వరుండు శాంతింప । వలయుఁ గాదె. 1108

క. సమధికమగు నెయ్యము, వి
య్యముఁ, గయ్యము, మంతనంబు । నాటయు నంభో
గము, సద్విద్యాభ్యాసము
సములకు శోభిల్లు నండ్రు । నంయమివర్యా! 1109

క. తల్లియుఁ దండ్రియు నొజ్జయు
నల్లమునన్ జెఱుతవాని । నొప్పరికింపం

జెల్లదె! శాంతింపరె ముని
తల్లజు లీరీతి తమకు । ధర్మంబగునే! 1110

క. జ్ఞానులు, ధీరులు, విప్రులు
మానులు, బాలుఁడు దెగడిన । మన్నించిన మీ
మానసము మార్పుఁ జెందదు
లోనించుక శాంత మూని । లోఁగొనుఁడితనిన్. 1111

గీ. రాముఁ డీరీతి భార్గవ । రాముతోడఁ
బలుకుచుండంగ, సౌమిత్రి । భార్గవునకు,
వికటముగఁ బల్కనుంకింప, । భృగుకులుండు
అబ్జనేత్రున కిట్లనె । యాగ్రహించి. 1112

గీ. అతుల కనకోప మిత్రగాత్రుఁ । డైన నేమి?
పాప పంక కళంకిత । భావుఁడగుటఁ
బరమపాపాత్ముఁడకట! యీ । బాలకుండు
గరళ కంఠుండయా, క్షీర । కంఠుఁడగునె? 1113

గీ. అనిన విని నవ్వి లక్ష్మణుం । డనియెనిట్లు
గరళ కంఠుఁ డెవ్వండు నీ । గురువుగారె,
అయ్య దట్లుండె వినుము, పా । పాలవాల
మైన క్రోధంబుఁ గల విప్రుఁ । డనఘుఁడగునె? 1114

గీ. అనఘ! యుచితానుచితముల । నరయఁడెవుఁడు
జగతికిఁ బ్రతికూలుఁడై । సంచరించుఁ,
గ్రోధి యెట్టిఁడో మీరలె । ఱుంగరొక్కొ?
కోపమును సంహరింపుఁడు । తాపమణఁగు. 1115

గీ. బ్రాహ్మణుండవు, తపసివి । భార్గవుఁడవు
దాసుఁడను నేను,కోపింపఁ । దగునె దేవ!

తాప మేటికిఁ దునిసిన । చాపమునకు?
నాసనముఁ గొంకు, రండాగ్ర । హాంబువలదు. 1116

గీ. భూసురవరేణ్య! శాంతంబె । భూషణంబు,
విశ్రమింపుఁడు, వాదించి । విసిగిరకట
తగినపనివాని రప్పించి । ధను వొసంగి
బాగు గావింప వచ్చు, వి । వాదమేల? 1117

క. అనవుఁడు సౌమిత్రిం గని
జనకుఁడు భీతిల్లి నేత్ర । సంజ్ఞను వలదం
చు నివారించె; ననంతర
మినకులవరుఁ జూచి రాముఁ । డిట్లనెఁ గినుకన్. 1118

గీ. ఘోర విషపూరిత స్వర్ణ । కుంభమట్లు
కుటిల భూయిష్ఠ చిత్తుఁడీ । క్రూరుఁడకట
నన్ను బాధింప నున్నాఁడు । మిన్నకున్న
హాని చేకూరు,సైరింప । నగునె చెపుము. 1119

గీ. నిర్మలాత్ముండ వనిమెంచి । నిన్నుఁ గాంచి
మునివరుండైన గాధేయు । మోముఁజూచి
నేను సైరించు కొలఁది మ । న్నింపకుండ
ధిక్కరించునె నీతమ్ముఁ । డుక్కులుండు. 1120

క. చాపము రోపం బేటికి
నీపాపని సంహరింప । నినకులతిలకా!
కోపించి జలముఁ గైకొని
శాపించిన నుక్కడంగి । చావకయున్నే? 1121

చ. అనవిని లక్ష్మణుండు విన । యంబు నటించుచు లేచిపల్కఁబో
ననుచితమంచుఁ బల్కఁదగ । దంచు రఘుప్రవరుండు నేత్రసం

జ్ఞను ప్రకటించి యిట్లనియె, । జ్ఞానులు మానులు పిన్నవానిపైఁ
గినిసి శపింపరాదు, పరి । కింపుఁడు మంచియుఁ జెడ్డ నాత్మలో.

ఉ. నేర మొనర్చువాని గమ । నింపక యక్కట! పిన్నవానిపై
నీరసమౌని యాయుధము । నెత్తుట ధర్మముగాదు వీరకం
ఠీరవ! చాపభంగము త్రి । నేత్రుని గౌరవ హానియేన్ భవ
త్క్రూర కుఠారధార నను । ద్రుంచునుగాక యశంబు చేకురున్.

గీ. దయయొ కోపంబొ వధయొ బం । ధనమొ లేక
యేమి చేయంగ వచ్చునో । యో మహాత్మ
శిక్ష కర్హుండ భవదీయ । సేవకుండ
నన్ను విడనాడి చంపుదే । పిన్నవాని. 1124

గీ. నేర్చెనో నేరకో మీకు । నేనొనర్చు
నేరమున కన్య శిక్షింప । నీతియగునె?
ధీకులఁగు మీర లాత్మ శాం । తింప నొందు
త్రోవఁ బరికించి శిష్యులఁ । బ్రోవఁదగదె? 1125

సీ. అనవిని రఘురాము । నఘవిరామునిఁ జూచి
భృగువంశ సంభవుం । డిట్టులనియె
విను నాదు కినుకకు । వెరవెఱింగిన వాఁడు
సీతమ్ముఁ డుండఁ జిం । తింపనేల?
కుటిలాత్ముఁ డయినన్నుఁ । గోపింపఁ జేసిన
వాని వధింపదీ । పరశువకట!
నృప మానినీ గర్భ । నిర్భేదనంబైన
పరశువీ క్షత్రియా । గర్భకుని విడిచె

గీ. నేను కోపించి చేసిన । హానియేమి?
జీవ ముండఁగ రిపుని వీ । క్షించుచుంటి

శత్రు వధియింప నా కేలు । జంకుచుండె
నాయుధము కుంఠితంబయ్యె । హేయముగను. 1126

సీ. ప్రళయకాలానల । జ్వాలలం బోలున
మర్త్యాగ్నికిన్ మేను । మండుచుండె
దుష్టరాజులఁ జంపి । త్రుప్పువట్టిన గండ
గొడ్డలి నా ప్రాణ । గొడ్డమయ్యెఁ
బ్రతికూల విధి నన్ను । బాధించి సాధింప
నొక డింభకుని జిహ్వ । నుక్కుఁ జేసె
అరులను శిక్షించు । నభ్యాసముం గల
డెందంబు పరిమాణ । మొందకుండె

గీ. ప్రాణముండఁగఁ గరమునఁ । బరశువుండ
బుణ్యసాగరమైన బ్రా । హ్మణ్యముండ
బాలునకుఁ జిక్కి జీవచ్ఛ । వంబనైతి
హృదయమున కింక శాంతమే । లేదు నాకు. 1127

క. అనవుఁడు లక్ష్మణుఁ డిట్లను
జననుత బాధించి నిన్ను । సాధింపంగన్
నను వంటి వానికగునే?
మనమున శాంతింపుఁ డఖిల । మానవు లలరన్. 1128

గీ. కుసుమ వర్ణంబు మించు వా । క్కులవచించు
నతుల కరుణా పయోధి! భూ । పతివిరోధి!
మిమ్ము సృజియించి నట్టి దై । వమ్ముఁ దిట్టి
యాత్మ శాంతింపుఁ డింక మీ । యఘములింక. 1129

క. అనినన్ విని యుగ్రుండయి
జననాయక సంచయంబు । సంతోషింపన్

జనకుం గని భృగునందనుఁ
డనియెన్ భీకర ఘనాఘ । నారవసరణిన్. 1130

మ. జనకా! వింటివె ప్రల్లదంబులను వా । చాదోషభూయిష్టమీ
తని జిహ్వాగ్రము గాధినందనుని వ । క్త్రింబుల్ విలోకించి రా
ముని శాంతంబును జూచి బాలుఁడకటా । పోనిమ్ము నోనాడ ని
మ్మని సైరించుకొలందిఁ బెచ్చుపెరిగెన్ । బ్రాణాశలేకెంతయున్

ఉ. ఎక్కడిబాలకుండు? వధి । యించెద నాకనుదోయికిన్ వ్రణం
బక్కట! వీఁడు క్రూరుఁడు య । మాలయ దర్శన లాలసుండుసీ
యిక్కడనుండి యీఖలుని । నేమిటికిన్ దొలఁగింపఁ జేయ విం
కొక్కక్షణంబునోర్వ నతు । లోగ్ర పరశ్వథ ధాటిఁ జూపెదన్.

గీ. అనిన విని నవ్వి లక్ష్మణుం । డనఘవినుఁడు
కనులమూసిన వ్రణమెట్లు । కంటబడును?
అనిన రాముండు రాముని । గని దురాత్మ!
తమ్ముశిక్షింప కాలింపఁ । దగునె నీకు? 1133

చ. అలవుఁదలంపుఁ డక్కట దు । రాత్ముఁడు మోఱకుఁడుల్లికుట్టుప
ల్కుల నను నొవ్వనాడఁ బుఱు । లోడఁడుక్రొవ్విన రాచబిడ్డఁడీ
ఖలుఁడ, భవత్సహోదరుఁడు । క్షత్రియ వంశ కళంకుఁడింకనే
నలిగిన వీనిఁ బ్రోవఁగల । వా? చెవుమా రఘువంశసంభవా? 1134

ఉ. తెంపరియై ధరామరునిఁ । దిక్కొని తిట్టిన వీని నాలుకం
ద్రుంపఁగరాదె! నేజననిఁ । ద్రుంచిన దోసము నెంచి నన్నుటం
కింపఁగఁ జొచ్చె, బాలుఁడని । కీడుఁదలంపమి నింతపుట్టెఁగా
కంపఱఁ బోలువాక్కులకు । నక్కట!! నేను సహించువాఁడనే!

ఉ. తమ్ముని పెంకెపోకడ య । ధర్మపథంబని మందలింపవో
కుమ్మడి నాదు నెగ్గులకు । నూకొని మొల్లఁగ మిన్న కుంటివీ

విమ్మయి మిన్నకుంట యది । హెచ్చరికించిన యట్లగాదె! యీ
ఎమ్మెల నేడనేర్చితో? స । హింపఁడు భార్గవుఁ డింతయేటికిన్

ఉ. ఇమ్ముగ నీవు నన్ననుస । యించు నయంబు నటించి, ప్రాణగో
ష్ఠమ్ముగ నెంచుబాలునకొ । డంబడ, జేయఁదలంచినాఁడవే!
తమ్ముఁడు నీకు ముద్దయినఁ । దప్పున గొడ్డలి వేటు! వాఁడు నీ
సమ్మతిలేక వాక్ప్రదర । జాలము నాయెద నాటఁ జొన్పునే?

చ. వెఱపిడివాదు వీవెరవు । పెంపునఁ బ్రెగ్గడ వాదు, తమ్ముప
ల్లఱపుల మందలింపక క । టా కపటాత్ముఁడ వైతివిఁక, నే
నెఱమరఁ దక్క నీదువిన । యంబుఁ దలంచి సహింపరాదు, మి
మ్మఱవరనేసి గొడ్డలికిఁ । బ్రాణములన్ బలిగా గ్రహించెదన్.

మ. మదమేపారఁగ సోదరుండు దెగడన్ । మన్నించి శాంతింపుఁడం
చదనుగాంచి మదీయకోపశిఖఁ జ । ల్లార్పంగ భాషించెదీ
వదరా! యిర్వురు దంభనాటకము నం । దత్యంతముల్ నేర్పరుల్;
ఇదిగో గొడ్డలి, రెండు రండిపుడు మి । మ్మెవ్వాఁడు గాపాడునో!

చ. అఱచుచు నిట్లు భార్గవుఁడు । దగ్ర మహోగ్ర కుఠారమెత్తినన్
వెఱచినయట్లు లక్ష్మణుఁడు । పెప్పెపెయంచు నటించి, మోమునన్
జిఱునగవంకురింప, నిరు । చేతుల నెత్తి నమస్కరించి, వాఁ
డెఱచి వచింపఁబోవ, రణ । ధీరుఁడు రాముఁడు నేత్రసంజ్ఞచే.

గీ. వలదువలదన్న నతఁడు మా । ర్వలుకకుండ
వినయ భారావనతశీర్ష । మునను వెడలి
కౌశికునిఁ జేరె; నంతభా । ర్గవునిఁ జూచి
రాఘవుండిట్టు లనియె న । మోఘ ఫణితి. 1141

మ. వనజాతోద్భవవంశపావన, స్వభా । వజ్ఞాన సంపన్నుల
య్యును, మీరివ్విధిఁ జూపఁగాఁదగునెయ । త్యుగ్రప్రతాపంబు బా,

లుని వాక్యంబులఁ జీరికింగొనరు ను । శ్లోకుల్, విచారింపుఁడో
యనఘా!, శాంతము భూషణంబగుమహా । ర్యశ్రేణికెల్లప్పుడున్.

క. అనవుఁడు భార్గవుఁ డిట్లనుఁ
ద్రినయను చాపంబుఁ ద్రుంచి । తెలియనిగతి, నీ
తిని నాకీగతిఁ దెలుపఁగఁ
జనుదెంచితి వౌర నీకు । సరణియుఁ దెలిపెన్. 1143

చ. ఇలఁగల యెల్లభూవరుల । నీవ బలాఢ్యుఁడ వౌదు వోయి, యీ
పలుకుల కేమి లెమ్ము, పుర । వైరిశిరోధివి, చాలునింక వా
క్కలహము; కుత్సితంబునను । కార్యములేదు; చెలంగి లావుచే
వలఁ బ్రకటించి నాకనుకఁ । బాపుము, జంకెదవేని వధించెదన్.

చ. నినుఁదునుమాడి, నీయనుజు । నిన్ వధియించెదఁగాక, కాచుకొం
డనుచుఁ గుఠారమెత్తిన, ధ । రామరచంద్రునిఁజూచినవ్వుచున్
వినయభరానతాస్యమున । వీరుఁడు రాఘవుఁ డిట్లుపల్కె, మీ
కినుకకుఁ బాత్రులౌఖలులఁ । గీటడగించిన దోసమున్నదే? 1145

గీ. అర్భకునియందు, నాయందు । నాగ్రహించి
తప్పుల గణింప వచ్చునే । ధరణిదేవ?
ఓర్మి వహియింపు డకట యొ । క్కొక్కవేళ
సరళ భావంబునందు దో । షము ఘటిల్లు. 1146

గీ. క్రోధి సరళస్వభావంబుఁ । గుటిలమనుచు
నాత్మఁ జింతించి యెంతయు । నాగ్రహించు,
కుటిలచంద్రుని రాహువు । కోరదెందు
గోపముఁ ద్యజింపు డీమన । స్తాపమేల? 1147

క. ఇదె నే నొదలవంచితి
నదె మీరెత్తిన కుఠార । మక్కట సన్నున్

దుదముట్టఁ జేసి లక్ష్మణు
సదమద మొనరింపుఁ డాత్మ । శాంతిం బొందున్. 1148

క. సభ మిమ్ము మెచ్చు కొనమా
యుభయుల వధియింపుఁ డింక । నుర్వీసుర మీ
యభిమత మీడేరుంగద;
ప్రభుభృత్యులకెందు యుద్ధ । పద్ధతి గలదే. 1149

మ. చనునే మీకు దురాగ్రహంబు తమ వేషంబున్ విలోకించి పై
గనదుగ్రాయుధసంచయంబుఁ గని లో । కస్తుత్య మాలక్ష్మణుం
డనుమానంబున నేమియో పలికె; నా । యజ్ఞానితో నేమి? మీ
ఘనకీర్తిన్ వినియుండుఁగాక మిముఁ దాఁగ । న్నార వీక్షించెనే?

మ. మునిలోకోన్నత! భీకరాయుధచయం । బుల్ బూనియే తెంచున
మ్మనుజుం జూచియెదిర్చి పల్కుటరయన్ । మా వంశమర్యాద; చే
ధనువుల్ మీతనువుల్ వచస్సరణియున్ । దర్కించి మావాఁడువ
ల్కిన పల్కుల్ గణియింపరాదిఁక మనః । క్లేశంబు మీకేటికిన్

గీ. పిన్నయయ్యె మావాఁడు వి । వేకి మీరు
కేవల మునీంద్రులైన జం । కించు వాఁడె
పావనంబైన భవదీయ । పాదరజము
శిరమునం దాల్చుఁ గాక యో । క్షితిసురేంద్ర! 1152

మ. శరణంబంటిని దేవ! బాలకుల య । జ్ఞానంబు సైరింపుఁడీ
క్కరణింబోరెడువాఁడ మీకునముఁదర్ । గానోపనూహింపగాఁ
జరణంబెక్కడ శీర్షమెక్కడ మహా । శాంతస్వభావంబె యా
భరణంబౌ వసుధామరేంద్రునకుఁ గో । పంబింకఁ జాలింపరే.

గీ. వ్రణము భేదించి రక్షించు । వైద్యరీతి
లోకకంటకుఁ దునుమనాఁ । గాక యకట!

వాదులాడుచుఁ దనవల్కు । పట్టుదలకు
నెల్లవారల నణకినఁ । జెల్లునొక్కొ? 1154

గీ. స్వల్పనాముండ రాముండ । క్షత్రియుఁడను
పరశురాములు భార్గవ । వంశభవులు
నేనుమీకుఁ దుల్యుండనే । నిర్మలాత్మ?
ఓడకుఁడు నేన యోడితి । వేఁడుకొంటి 1155

గీ. అనిన నాలించి భార్గవుం । డాగ్రహించి
తెలిసెరా రామ వానికిఁ । దీసిపోవు
చెప్పెద నొకింత తాళుము । చేతకాని
వానిగా నన్ను భావింప । వచ్చు నీవు. 1156

చ. శరసముదాయమాహుతిగఁ । జాపము స్రుక్కుగఁ గోపమగ్నిగా
బరబలమింధనంబుగ న్నృ । పాలవరుల్ పశుపంచయంబుగాఁ
బరశువుఁ బూని యుగ్రతర । భండనయాగమొనర్చినాడ నే
నిరువదియొక్కమారులను । రేంద్రులు భీతిలి తల్లడిల్లగన్.

శా. వృద్ధబ్రాహ్మణుఁడంచు భార్గవునిదో । ర్వీర్యంబు లక్షింపవ
శ్రద్ధం జూచి హసించెదీవు, పురజి । చ్చాపంబు భగ్నంబుగా
నౌద్ధత్యంబునఁ గన్నుఁగాన వకటా । యజ్ఞుండ వేమందు నా
యుద్ధప్రక్రియ నీవెఱుంగఁ గలవా । యోచింపుమా రాఘవా?

క. నుసిపిల్లు విఱిచి భుజముల
పసఁ జూపితి వెల్లరాజ । వర్యులు వొగడన్
గసిదీఱ నిన్ను లక్ష్మణు,
నసిధారం ద్రుంచి గర్వ । మణఁచెదఁ దృటిలో 1159

చ. అనవుఁడు రాఘవుండు విన । యానతకంధరుఁడై వచించెని
ట్లనఘ!యొకింత లోనరసి । యానతి యీఁదగు, స్వల్పదోషముల్

ఘనతర మంచు నెంచి,మముఁ । గాసిలఁ జేసినలాభముండునే
ధనువు తనంతనేవిఱిఁగెఁ । దాకినయంతన; గర్వమేటికిన్ 1160

చ. పసఁగలవిల్లొ,లేక నుసి । పాఱిన విల్లొ,స్పృశించినంతనే
విసవిస ఫెళ్ళునన్ విఱిఁగి । పృథ్విఁ బడెన్;బరికింపు డింతకున్
బొసఁగెఁబ్రమాదమీపనున । బొంకుఁడు రే!మముసంహరించిసం
తసమున నింటికిం జనుఁడు; । తామసి తామసిగాకయుండునే!

గీ. బ్రాహ్మణోత్తము నిరసించు । వాఁడెవండు?
మిమ్ము నిగసించునట్టిభా । వమ్మెయున్న
మ్రొక్కి భక్తితోనిట్లుమీ । మ్రోలనిల్చి
యోధుఁ డెచటైన నుండునే । సాధువినుత? 1162

గీ. అధికబలుఁడైన బలహీనుఁ । డైన నేమి?
కలహముం గోరి యెదిరించి । కాలుద్రివ్వి
యొక్కఁ డొక్కనిఁ జీరిన, । నుక్కుఁదక్కి
మిన్నకుండునె మానసంబు । లున్నవాఁడు? 1163

గీ. క్షత్రియుఁడు జంకఁ డెప్పుడు । కయ్యమునకు
భయముపడువాఁడు భూపుఁడే! । పామరుండు
పొగడుకొనుచుంటి నని నన్నుఁ । దెగడవచ్చుఁ,
గదనమే రాఘవుల కెందు । సదన మనఘ! 1164

గీ. పార్థివుఁడు బ్రాహ్మణుంజూచి । భయముపడిన
బ్రాహ్మణున కద్ది గౌరవా । స్పదముగాదె?
బ్రాహ్మణులు భార్గవులు మీకు । భయముపడుట
గౌరవార్థంబ యగుఁగాక । వీరవినుత! 1165

క. అని పలికిన శ్రీరాముని
ఘనవాగ్గంభీర భావ । గౌరవమునకున్

దన బుద్ధికవాటంబును
మునివర్యుఁడు తెఱచి యిట్లు । మునుకొని యనియెన్. 1166

చ. చివికినపాతవిల్లొకటి । చేకొని ఫెళ్ళున ద్రుంచినంతనే
శివునకు నీవు సాటియనఁ । జెల్లునె? యొల్లనె నామనంబు? భా
ర్గవుఁడను భర్గశిష్యుఁడ, జ । గంబుల నెల్ల జయించినట్లు రా
ఘవ! నను ధిక్కరించెదవు, । కంజభవుండవో? మాధవుండవో?

క. ఏనాటిదో శివచాపం
బీనా నారాయణుధను । వెక్కడఁ గలవే?
నానా విధ వాక్కుల నను
నోనాడుట గాదు, చేకొ । నుము వీరుఁడవేన్. 1168

క. నా సరి వీరుఁడు లేఁడని
యీమన నేఁ బల్కుచుంటి, । నింతేమిటికిన్?
నా సందేహముఁ బాప శ
రాసన మిపుడెక్కువెట్టు । మందఱుఁ బొగడన్. 1169

క. అని యిచ్చిన యాధనువుం
గొనినంతనె భార్గవుని య । కుంఠిత తేజం
బినకులతిలకుం గలసెన్;
ఇను తేజం బబ్జవైరి । నెనసిన రీతిన్. 1170

క. భళిభళి వంచెనో లేదో
ఫెళఫెళ మని విల్లు విఱిఁగి । పృథ్విం బడియెన్,
గళవళ మొందెన్, ముఖమునఁ
గళలన్నియు సన్నగిల్ల । తూన్నెనురుఁ డంతన్. 1171

చ. దడదడ గుండె కొట్టుకొనఁ । దాలిమిఁ దక్కి, భయంబు పెంపునన్
గడగడఁ బాదముల్ వడఁకఁ । గాఁ, జెఱు చెమ్మట లాననంబునన్

జడిగొనఁ, గంటనీరొలుకఁ, । నందియ మేటికి విష్ణువంచుఁ దాఁ
దడఁబడి తర్జనింగఁజది । దాశరథిన్ వినుతించె నీవిధిన్. 1172

పరశురామకృత శ్రీరామస్తుతి

సీ. జయ జయ రఘువంశ । సరసీజవనభాను!
జయ దైత్య వంశ సం । చయ కృశాను!,
జయ జయ సురవిప్ర । జన ధేను హితకారి,
జయ ధర్మరక్షణా । శయవిహారి!,
జయ జయ మునినుత । స్థాణు మానస హంస!,
జయ సర్వదేవతా । సత్ప్రశంస!,
జయజయ సుందర । జలదసన్నిభ గాత్ర!
జయ వేదసన్నుత । సచ్చరిత్ర!,

గీ. గరుడవాహన కిల్బిష । గహన దహన!
లోకమోహన!, శాశ్వత । శ్లోకవహన!,
ప్రణతసుత్రామ! నిర్జిత । పరశురామ!,
రామ! సద్గుణారామ!, నం । గ్రామభీమ. 1173

క. ఆలింపుము నామనవిని,
పాలింపుము నీదు భక్త । వర్యులఁ గరుణన్
దూలింపుము పాపంబుల,
నేలింపుము ధర్మపథము । నృపవర్యులచే. 1174

గీ. ఇట్లువినుతించి, తనబుద్ధి । నేవగించి,
విన్నఁబాటున సభఁజూచి । చిన్నవోయి,
అంధకారమై యజ్ఞాన । మావరించె,
నంచుఁ జింతించి, శ్రీరాము । మంచినెంచి. 1175

చ. పులకితగాత్రుఁడై పరశు । పుం బడవైచి, నమస్కరించి, "భ
క్తుల యపరాధమున్ మఱచి ।. కోరిన కోరిక నిచ్చువాఁడవో
జలరుహనేత్ర! నా యెడదొ । సంగుపొంనగె, క్షమింపు" మంచునో,
కలికి! తపింప భార్గవుఁడు । కాననకు నేగెఁ బ్రబోధితాత్ముఁడై.

క. భర్గుని శిష్యుం డరిష
డ్వర్గముఁ దూలింపలేక । పామర జనసై
సర్గముఁ బొందునె, యోహో
భార్గవుఁడని కౌశికుండు । పకపక నవ్వెన్. 1177

గీ. అంతవాఁడింత యయ్యె మే । మెంత యనుచు
సూర్యునిం బోలు శ్రీరాముఁ । జూడలేక
ఘూకములకై వడిన్, గాంచి । శోకు లగుచు
నౌరలల వంచి వెడలిర । య్యవనిధవులు. 1178

గీ. సర్వదేవతా పుష్పవ । ర్షంబుగురిసె,
దుందుభులు మ్రోగెఁ, బౌరులా । నందమొంది,
రంత నజ్ఞాన మను మేఘ । మంతరింప
నలరి రెల్లఱు భయదుఃఖ । ములఁ దొలంగి. 1179

గీ. పెన్నిధానంబుఁబొడగన్న । పేదఁబోలి
జనకుఁ డానంద జలనిధిన్ । మునిఁగి తేలె,
చంద్రునుదయంబునఁ జకోర । శాబ మట్లు
సీత విగళితసంత్రాసయై । చెలువుఁ గాంచె. 1180

సీ తా వి వా హ స న్నా హ ము

క. తడయక జనకుఁడు కౌశికు
కడకుంజని, యుష్మదీయ । కరుణన్ గృతకృ

త్యుఁడనై తిని, కర్తవ్యముఁ
గడువడి సెలవిండనవుఁడు । గాధిజుఁ డనియెన్. 1181

చ. వినుము, వివాహమాశివుని । విల్లుతునింగిన యంతనేఘటి
ల్లెను, కులసంప్రదాయమున । లీల వివాహ మహోత్సవంబు నీ
వొనరుపవచ్చు, వేగమె యయో । యోధ్యకువిప్రులఁబంపి,సర్వమున్
వినిచి, ధరాతలేశుఁబిలి । పింపుము, భూవర! యీవెలుంగ వే?

క. అనవుఁడు మేలని యప్పుఁడ
జ్జనకుఁడు, సమయంబుఁ జూచి । సత్వరముగ న
జ్జననాథో త్తముదశరథు
వినయంబుగఁ బిల్వఁ బంచె । విప్రజనంబున్. 1183

గీ. ఇవ్విధిన్ విప్రవర్యుల । నెలమిఁ బసిపి,
హితులఁ జుట్టాలు, నరపురో । హితులఁ బిల్చి,
శోభ దైవార దేవేంద్ర । వైభవముగఁ
బొంకమిగురొత్తఁ బురమున । లంకరించె 1184

గీ. నీలములు పత్రిఫలముల । లీలఁ గ్రాలఁ
బద్మరాగంబు లతుల పు । ష్పములు గాఁగ
గనక కదళీ విరాజిత । ఘన వివాహ
మంటపంబొండు నిర్మించె । మనుజవిభుఁడు. 1185

సీ. తద్వితానముఁ జూడ । నద్వితీయము, మంచి
ముత్తియంబుల సరుల్ । పొలుపుమిగిలెఁ,
బలువన్నియల నీను । బంభరవితతితోఁ
బిట్టలతోఁ బూల । చెట్టు లలరె,
శృంగార మిగురొత్త । బంగారుకలశంబు
లందందు నెంతయు । నందమొసఁగె.

నాత్మీయులగు వారి । కాహ్లాదమొసఁగఁగ
గగనవీధిన్ బతా । కంబులెగరెఁ

గీ. జంచలాదేవి సాక్షాత్క । రించి, యందు
జన్మముంబొందెఁ, దచ్ఛోభ । నన్నుతింప
నలవియే యెట్టివానికి । నైనఁ గాని,
దానిఁ జూచిన యతఁడెపో । ధన్యతముఁడు. 1186

మిథిలాపుర బ్రాహ్మణు లయోధ్యకు వెడలుట

గీ. జనకుఁ డొసఁగిన శుభలేఖ । సంగ్రహించి
ఉర్వీసురవర్యులప్పు డ । యోధ్య కేగి,
దశరథేశుని పూజా వి । ధానమునకు
నలరి, శివధనుర్భంగంబుఁ । బలికిరిట్లు. 1187

గీ. రాజ! రాజిత సద్గుణ । రత్నభూష,
పురుషసింహుల విశ్వవి । భూషణులను,
కాశ సంకాశ కీర్తిప్ర । కాశకులను,
పుత్త్రకులఁ గాంచి, ధన్యత । ముండ వైతి. 1188

గీ. తపనుఁడు కృశించె వారిప్ర । తాపమునకు,
శశి కళంకితుఁ డయ్యె ద । ద్యశమునకును,
రామలక్ష్మణులం బోలు । రాజసుతులు
మూఁడులోకంబులను లేరు । భూతలేంద్ర. 1189

చ. భువిఁ గల వీరులా జనక । పుత్త్రికఁ బెండిలియాడఁగోరి, యా
శివ ధనువున్ గదల్పఁజని । చేడ్పడి రయ్యెదియట్టులుండె, మే
రువుఁ బెకలింపనోపునసు । రుల్ విబుధుల్ ధృతిఁదక్కి రక్కటా
ఎవనితరంబు సీతను గ్ర । హించి యశోధనమున్ గడింపఁగన్.

క. లాస విలాసంబునఁ గై
లాసము నాడించినట్టి । లంకాపతియున్
వీసము నైనన్ హరుని శ
రాసముఁ గదలింపలేక । యణఁగి మణంగెన్. 1191

గీ. అంతటి శరాసనంబు ని । శ్చింతతోడఁ
గమలనాళంబు గ్రహియించు । గజము భంగిఁ,
గేల నవలీల నెత్తి భం । గించెనహహ
రాముఁడు నరుండె, యాది నా । రాయణుండు. 1192

గీ. భార్గవుఁడు వచ్చి, శ్రీరాము । బల పరాక్ర
మక్రమంబును బరికించి । చక్రధరుఁడు
గాక నరమాత్రుఁడే యంచు । గర్వముడిఁగి
వలగొని నుతించి, నిజతపో । వనముఁ జేరె 1193

ఉ. రామునిఁబోలు దోర్యుగ ప । రాక్రమముం గలవాఁడు లక్ష్మణుం
డీ మహనీయులం గెలువ । నెంతటి వీరుల కేని శక్యమే?
సామజసంచయంబు హరి । శాబములం గని సంచలించు న
ట్లామనుజేశులెల్ల భవ । దాత్మజులం గని జంకిరత్తఱిన్. 1194

క. అనిపలికిన నుప్పొంగుచు
జననాథుం డాలకించి, । సత్వరము వసి
ష్ఠునిసన్నిధికిం జని తా
వినిపించెఁ గథాక్రమంబు । విప్రులవలనన్. 1195

చ. విని, శుభలేఖఁ జూచి, రఘు । వీరుల ఖ్యాతికి సంతసించి, య
జ్జనకుఁడు ధన్యుఁడయ్యె భువి । జాతను సీతను గాంచి పెంచె; స
జ్జనుల కయాచితంబుగనె । సంపద చేకురునండ్రు; నిర్ఝరుల్
వననిధి సంగమించుట, స్వ । భావ మొకింతయుఁ గామ్యమున్నదే

ఉ. ధన్వికి రక్షితార్తికి,సుధాకర । కీర్తికి, రామమూర్తికిన్
దన్వి నొసంగి తన్విఁగని । సజ్జనకుంజము, ధరిత్రియింక రా
జన్వతియై గ్రహించు, దను । జవ్రజ ఘోరగముల్ నశించు, న
ర్కాన్వయమున్ బవిత్రమగు । నాశయముల్ ఫలియించు భూవరా

ఉ. ఈవును దేవులుం గలసి । సఖ్యము నొజ్జల గౌరవించి, భూ
దేవుల గోవులన్ మఱియు । దేవతలన్ దనియింతు రెంతయున్
ధీవరులన్ సుపుత్త్రకుల । దివ్యులఁ గాంచి రహించితీవు భూ
దేవి సుఖింప నింక నరు । దే? యరుదేక చూచుచుంటి వే!

గీ. పయనముం గమ్ము సీతావి । వాహమునకు
సకల కళ్యాణ సమయంబు । సంభవించె;
ననిన గురువర్యునకు మ్రొక్కి । యాత్మణంబ
తనదుపయనంబుఁ దెల్పెదూ । తలను బంపి. 1199

గీ. అంతిపురి కేగి, కాంతల । పొంత నిల్చి
ఎలమి వృత్తాంత మంతయుఁ । దెలియఁ జేసె;
ఘన ఘనాఘన గర్జనా । కర్ణనమున
నెమ్మలం బోలి యలరి రా । నెలతలపుడు 1200

గీ. నృపుఁడు దేవేరు నెల్లఱు । నీశుభంబు
గాధినందనుకరుణచేఁ । గలిగె ననుచు,
బీదలను బిచ్చగాండ్రను । విప్రవరులఁ
దనియఁ జేసిరి ధనవస్త్ర । దానములను. 1201

గీ. జానకీరామకళ్యాణ । సమయ మనుచు
నిఖిల లోకంబు లలరె, వ । ర్ణింప రాని
శోభఁ దళ్కొత్తె, దశరథ । క్షోణివిభుని,
సీమ యెట్లుండు నూహింప । లేము! లేము! 1202

గీ. స్వర్ణకలశాస్వితంబు, ధ్వజవ్రజంబు,
మత్తకాశినీ శృంగార మంజులంబు,
అఖిల విప్రవేదనినాద ముఖరితంబు,
అతులశోభాన్వితం బయోధ్యాపురంబు. 1203

గీ. వంది మాగధ స్తుతిగీత వైభవమున
నెగడునంతఃపురంబు వర్ణింపఁ దరమె?
సత్యశస్ఫూర్తి, దేవతా చక్రవర్తి
యా రఘూద్వహుఁ డచ్చట నవతరించె. 1204

గీ. పెండ్లివయనంబుకొఱకుఁ బృథ్వీవిభుండు
సిద్ధముగ నుండుఁ డనినంతఁ జిత్తమునిరి
సుతులు, మంత్రులు, వరపురోహితులు, హితులు,
బుధులు, కృతమనోరథులు, సారథులురథులు. 1205

చ. అనిలునికంటె మిక్కిలి రయంబునఁ బర్వకునుత్తమాశ్వముల్
మునుకొనియుండఁ, జామరసమూహములో, దవిదాకుశ్వేతకే
తనములతో, విభూషితవితానములోఁ, గడుసొంపునింపుస్యం
దనములఁదెచ్చిరా దశరథక్షితినాథ వరేణ్యు నానతిన్. 1206

గీ. ధవళ మేఘోపమాన గాత్రములఁ గలిగి,
విపుల హరినీలవర్ణకర్ణములఁ గలిగి
చెలువు దీపించు వారువంబులు రహించె
నినునిరథమట్లు దశరథోర్వీశురథము. 1207

సీ. గజయూథ గళబృహద్ఘంటా నినాదంబు
శ్రావణాంబుద రావ సామ్య మొందె
వేద రాశి సమాన విప్రజనాకీర్ణ
శిబికాది వాహన స్థితి రహించె

బహువస్తు సాముగ్రి । భారావనత ఖర
తురదాశ్వ వృషభోష్ట్రి । కోటి వఱలె
వరపుర స్త్రీ మనో । హర గాన మాధురి
మంగళ ధ్వనులతో । నంగమించె
గీ. వంది మాగధ పండిత । ప్రతతి చెలఁగ
సకల దాన దాసీ విలా । సంబు లెసఁగ
సంబుధులఁబోలి వివిధ వా । ద్యములు మ్రోఁగ
నిర్భరానంద మప్పుడా । విర్భవించె. 1208
సీ. నృపుఁడు పరిసన్నుఁడై । నియతిమై గురువర్యు
నొక్కరథంబున । నెక్కఁ జేసి
విఘ్నేశుఁ బార్వతిన్ । వినుతించి పరమేశ్వ
రధ్యాన మొనరించి । రథము నెక్కి
అల బృహస్పతితోడి । యమరేంద్రునింబలెఁ
గులగురువర్యుతోఁ । గొమరు మిగిలి
నిజకుల మర్యాద । నుజనులఁ బూజించి
వేదపరిచోదిత । విధులఁ జేసి
గీ. అతుల తుంగ తరంగ ఘోం । కృతుల తోడ
దర్పితోద్దండగజబృంహి । తముల తోడ
జనుల కోలాహలంబాక । సంబు దాక
మునివరుని యాజ్ఞ శంఖంబుఁ । బూరటించె. 1209
గీ. సకలజనులపై బుష్పవ । ర్షంబు గురిసె
నమరకాంతల సంగీత । మతిశయించె
రామ రామ సీతారామ । రామ యనుచు
నందఱును స్యందనంబుల । నలరి రపుడు. 1210

### శుభశకునసందర్శనప్రాప్తి

గీ. దక్షిణక్షేత్రమునఁ గాకి । తారులాడ
వనమయూరంబు వామది । క్కునకు వెడలెఁ
ద్రివిధ వాయువు లనుకూల । రీతి వీచె
ఖంజరీటంబు పొరిఁబొరిఁ । గాననయ్యె. 1211

సీ. సంతానయుత పుణ్య । కాంతలు పూర్ణకుం
భములతోఁ నెదురుగ । వచ్చి రెలమిఁ
గూర్మిమై దూడల । కున్ బాలుచేపెడు
ధేనువు లందందుఁ । గాననయ్యె
దధి దుగ్ధ యుతభాండ । భారావనతులైన
గొల్లలు గన్పట్టి । రెల్లకడలఁ
బుస్తకంబులఁ బూని । భూసురోత్తము లిర్వు
రేతెంచి యాశీస్సు । లిచ్చి చనిరి

గీ. మత్స్యముఁ బూని చనుదెంచె । మనుజుఁ డొకఁడు
దక్షిణపుదిక్కు నుండి మం । దలుగ వెడలి
హరిణబృంద మానందమ । హాంబునిధిత
రంగము లనంగఁ దోచె భూ । రమణుఁ డలర. 1212

గీ. అతుల మంగళాకరుఁడు క । ల్యాణమయుఁడు
తపసులకుఁ దాత్రిక, యభిమతా । ర్థప్రదాత,
యగురఘూద్వహు దివ్యక । ల్యాణవేళ
నహహా!! శుభసూచకప్రాప్తి । కక్కజంబె. 1213

చ. వరుఁడు, పరాత్పరుండు గుణవంతుఁడు రాఘవుఁ, డాదిలక్ష్మిత
త్కరముగ్రహింపఁబుట్టె, జన । కక్షితినాథుఁడు, యాజ్ఞవల్క్యవ
ద్గురుకరుణా కటాక్షకలి । తుండగు వేది వివాహకర్త; య
న్నరపతిమౌళి కెందు శకు । నంబులయందుఁ గొఱంతయుండునే!

దశరథుని మిథిలానగర ప్రవేశము

గీ. ఇట్లు పయనంబు సాగించి । యినకులుండు
ధరణిధరముల నదులఁ గాం । తారములను,
జనపదంబులు దాటి యు । త్సాహమునను
మిథిల కేతెంచె నుద్వాహ । విధికి నంత. 1215

చ. తనయుని పెండ్లికై దశర । థక్షితినాథుఁ డుత్లివచ్చె, నా
జనసముదాయముల్ సమద । సామజ సంచయమున్ దురంగవ
ల్గనములుఁ జూడుఁ డంచు నబ । లల్ తరితీపుగ ముచ్చటింపఁగన్
విని జనకుండు మేలనుచు । విప్రులతో సలగాధిపుత్త్రితో. 1216

చ. ఎదురుగ వచ్చి యాదశర । థేశుని మిక్కిలిగౌరవించి, పై
నదయు వసిష్ఠు శిష్టు ముని । సత్తముఁ గాంచి నమస్కరించి, స
మ్మత్రమున మంత్రులన్ హితుల । భూసురులన్ గను నాదరించి మీ
పదరజ మస్మదీయగృహ । పావనకారణ మంచు నవ్వుచున్.

గీ. ఏకరీతిఁ జుట్టాల బ । హూకరించి,
వచ్చిరే యంచుఁ గొందఱఁ । బలకరించి,
పిన్ననగవున మఱియుఁ బ్ర । సన్నదృష్టి
సరసవాక్కులఁ గొందఱ । సత్కరించె. 1218

మ. మదిని పొంగుచు నంతటన్ దశరథ । క్ష్మాపాలచంద్రుండు, వే
సదయుండై తనఁజూడవచ్చు మౌని వి । శ్వామిత్రు వీక్షించి, త
త్పదపద్మంబులఁబట్టి మ్రొక్కుటయు నా । తం డో ధరానాయకా!
ఇదిగో నీదుకుమారులన్ బురుష । రత్నంబులన్ గొమ్మనెన్.

గీ. గురువులన్ మంత్రులన్ భూమి । సురులఁ జూచి
వందనంబుల నర్పించి, । బంధుజనుల
సేవకుల నాప్తులం జేరి । క్షేమ మడిగి
ఘనుఁడు రాముండు తమ్ములఁ । గౌఁగిలించె. 1220

గీ. దశరథేశుని పజ్జసో । దర చతుష్ట
యము రహించెఁ జతుర్వర్గ । మనఁగ నహహ!
పౌరు లుప్పొంగి యానంద । వార్ధి మునిఁగి
వివిధభంగుల నుడికిరి । విసుఁగులేక. 1221

గీ. "జానకీ రామచంద్రులు । సన్నుతింప
నలవియే ? శోభ కాలవాల । మనఁగ నుందురు,
రాజులిరువురు బుణ్యధ । ర్మముల కవధి
భూతు" లని మెచ్చి రప్పుడా । పురమువారు. 1222

క. జనకుని సుకృతం బహహా!
జనులెల్లను సన్నుతింప । జానకి యయ్యెన్;
వినుఁ డాదశరథు పుణ్యము
మునివర్గులు మెచ్చ రామ । భూవరుఁ డయ్యెన్. 1223

ఉ. ఈ ధరణీశుఁ డెవ్వగు మ । హిన్ గతజన్మమునన్ మహేశ్వరా
రాధన మెట్లొనర్చెనొ? య । థార్థసుత సిద్ధి రఘురాముఁ జూడఁ బూ
ర్వాధునిక ప్రియా శుభ ఫ । లానుభవంబు లభించె మాకు ను
ద్బోధము గల్గె; నీపురము । పుణ్యము దెట్టిదొ చెప్పశక్యమే!

గీ. తరుణి! కోమలశ్యాముని । తనువుఁ జూడు
మబ్జములనేలు కన్నుల । యందముఁ గను
మె తపంబొనరించెనో యా । మునకులుండు!
ఎంత నోచెనో మనసీత । యితని కొఱకు." 1225

క. ఈరీతి నగరవాసులు
శ్రీరాముని సీతఁ జూచి । చెప్పుకొనంగన్
హేరాళానంద సుధా
సారంబున స్నాతులైరి । సకలజనంబుల్. 1226

సీ. అంత వసంత శు । భాక్రాంత సంతత
శ్రీమంతమైన హే । మంతమునను
మార్గశీర్షాహ్వయ । మాసంబునన్ శుభ
తిథివార నక్షత్ర । విధి గ్రహించి
గ్రహయోగములఁ జూచి । ఘుటికల లెక్కించి
కడకు గోధూళి ల । గ్నంబు నందుఁ
బణవ శంఖ మృదంగ । వాద్యంబుతోఁబుణ్య
కామినీ మంగళ । గాన మెసఁగ

గీ. భూసురుల వేదనాదంబు । బోరుకలఁగ
జనకుని పురోహితుండు స । జ్జనహితుండు
ఆ శతానందుఁ డానంద । మతిశయిల్లఁ
గోరి యేతెంచె మగపెండ్లి । వారిఁ బిలువ. 1227

గీ. వావివరుసలఁ గల్పించి । బాంధవులను
లెండు రండని యెల్లఱ । లేవనెత్తి
అలవసిష్ఠునితోఁగూడి । యాత్మజంబ
పెండ్లిచవికకుఁ దోతెచ్చెఁ । బెండ్లివారి. 1228

మ. జననమ్మోహనమై పవిత్రయుతమై । సౌందర్యభూయిష్ఠమై
మునిసేవ్యంబగు రాము రూపమును నే । ముద్దాడితిన్ బాడితిన్
గనుఁడీ బాహ్యములన్ద్యజించితిః గన । త్తాలాబ్దముంబోలు నా
తనిదేహంబున స్వర్ణవస్త్రము తటి । త్సంకాశమై రాజిలెన్.

గీ. ధ్యానయోగ్యంబు మంగళ । దాయకంబు
రాముని వివాహవేషంబు । రమ్యతరము
చూచి యానందముంబొంది । సుందరాంగి
మైమఱచి కనుల్మోడ్చి త । న్మయుఁడనైతి. 1230

చ. అరసము హెచ్చదే, శశిస । హస్రమయూఖుల ధిక్కరించును
దరుఁడు, వివాహవేషమును । దాలిచి, విశ్వవిమోహనుండనన్,
దురగము నెక్కె రామ నహహా! । తోయరుహానన! యేమి చెప్పుదున్
గరుడి తురంగవల్గనముఁ । గాంచె, శిరంబు నువంచె లజ్జచే. 1231

గీ. హరి మనోగతి యెఱిఁగి యా । హరి నటించు
చందముం జూడవలెఁ గాక । చంద్రవదన!
నవతటిల్లతా కలిత ఘ । నాఘనంబు
వనమయూరంబు నాడించు । వగిఁ దోఁచు. 1232

సీ. తనకున్న యెనిమిది । కనులతోఁ జూచియుఁ
దనివిఁ బొందక యుండె । వనజభవుఁడు,
ధాతకంటెను నేను । ధన్యుండ నని చూచి,
నెమ్మిఁ బొంది రహించె । నీసుతుండు,
కనలి తన్ను శపించు । గౌతము వినుతించె
నానందవశమున । నమరవిభుఁడు,
ద్విసహస్ర నేత్రంబు । లెసఁగఁ జూచితి నే, న
హీనుండ ననియె న । హీశ్వరుండు

గీ. నేను వదునేను కన్నులన్ । దెఱచి చూచి
పొందు నానంద మత్యంత । మిందువదన;
రెండుకన్నులఁ గలవారు । తృప్తిఁ బడయ
నోపుదురె రామభద్రుని । రూపుఁ జూచి. 1233

గీ. పణవ శంఖ మృదంగ ని । స్వనము మ్రోఁగ
బ్రాహ్మణులతోడ దేవేంద్ర । వైభవమున
వచ్చె మగపెండ్లివారిఁ దా । మెచ్చుకొనుచుఁ
జేతమిగురొత్త నంత,నా । సీతమాత. 1234

ఉ. శ్రీరఘురామచంద్రు, సర । సీరుహపత్రవిశాలనేత్రు, న
మ్మార్గమునం గన్నవాని, నన । మాన కళానిధి నాదరింపఁగ
ర్వ్యారపుటారతింగొని, ప్రి । మోదముతో నెదురేగి, పజ్జగన్
జేరి, సగౌరవంబుగను । జేర్చె మనోజ్ఞ వివాహ వేదికన్. 1235

చ. జనకుఁడు మున్వసిష్ఠముని । సత్తము చిత్తము పల్లవింపఁగన్
ఘనముగ గౌరవించి, యుల । గాధిజుతో నిరమిా ప్రభావముం
చునుడివి, వామదేవముని । సోముని నన్యుల నాదరించి, యా
సనములనిచ్చి, పంక్తిరథు । శౌరిగ నెంచి నుతించె నంతయున్.

గీ. పంక్తిరథుఁ బరమేశ్వర । భావమునను,
పూజఁ గావించుజనకునిం । బొగడి జనులు,
కోర్కె లీడేఱ నేత్రచ । కోరములను,
గనిరి శ్రీరామచంద్రునిఁ । దనివిదీఱ. 1237

కన్యాగానమహోత్సవము

గీ. అంతటన్ లగ్న మేతెంచె । ననివసిష్ఠ
ముని, శతానందుతోఁ జెప్ప, । విని యతండు
పట్టమహిషికిఁ దెలిపె, న । ప్పడఁతిమిన్న
సీతఁ దోడ్కొని వచ్చె ని । చ్చెలుల తోడ. 1238

సీ: జనకుఁ డంతట లేచి । సన్మునీంద్రులు స్వస్తి
నుచ్చైస్స్వరంబున । నుచ్చరింపఁ,
గోర్కె లీరికలెత్తఁ । గులదేవతలఁ గొల్చి
చెలువార మధుపర్క । ముల నొసంగి,
తడయక మంగళ । ద్రవ్యంబులం గూర్చి,
మహితవిధానహో । మం బొనర్చి,

పణవ శంఖ మృదంగ । బహువిధవాద్యంబుల
ధణధణధ్వని దిగం । తముల మ్రోఁగ,

గీ. భూమిసుర వేదనాదంబు । బోరుకలఁగ
భార్యతోఁ గూడి బంగారు । పళ్ళెరమునఁ
బరమపావన శ్రీరామ । పాదములను
హర్ష ముగుఁరొత్తఁ గడిగి కృ । తార్థుఁడయ్యె. 1239

సీ. ఏపాదములఁ గొల్వ । హృదయంబు విమలమై
కలికాల పాపపం । కంబుఁ బాయు,
నేపదంబులధూళి । రూపఱి శిలయైన
సతికి సత్యోత్తమ । గతి నొసంగె,
నేయంఘ్రియుగ్మంబు । నెల్లఱు సేవించి
మోక్షఫలంబును । బొందుచుందు,
రేచరణద్వయి । యెల్లయోగుల మనః
కమలంబులందు భృం । గంబులయ్యె,

గీ. నెయ్యవి మదీయహృదయదీ । ర్ఘికనుసతము
నరుణపద్మంబులై యుండు । నంబుజాక్షి!
అట్టియడుగులఁ గడిగిన । యలఘుమతుల,
భాగ్య మెట్టిదో వర్ణింప । వశమె మనకు? 1240

గీ. నన్నుఁ ద్రిభువనంబులఁ, బావ । నముగఁ జేయు
గంగఁ గాంచిన యడుగులఁ । గడిగినంత
జనకుఁడు మహర్షియై జగ । జ్జనకుఁడయ్యె,
నహహా సునయన సునయన । యై రహించె. 1241

గీ. లోకపరిపాటిఁ బాటించి । లోకవినుత
వేద మర్యాద నారఘు । వీరవరున

కాత్మకన్యక నొసఁగి,ధ । రామరులకు
నఖిలదానంబు లొసఁగి ధ । న్యాత్ముఁ డయ్యె. 1242

గీ. తుహినధరవిభుండు పార్వతిన్ । జంద్రమౌళి,
కమృతవారాశి శౌరికి । నాదిలక్ష్మి
నొసఁగిన విధాన రామున । కొసఁగెఁ గన్య
నని నుతించిరి జనకుని । సర్వమునులు. 1243

గీ. ప్రతిమణిస్తంభసీమను । బ్రతిఫలించు
జానకీ రామచంద్రుల । సౌరుఁ గాంచి,
అహహా!!బహురూపములఁ । దాల్చియాయనంగ
డంగనంగూడి యేతెంచె । ననిరిజనులు. 1244

గీ. రమణిశిరము సింధూరప । రాగమున న
లంకరింపఁగఁ గరములు । సంకుచించెఁ
గమలయుగ్మంబు రాముని । కరయుగంబు,
శీతభానునిబింబమా । సీతముఖము. 1245

గీ. మంగళమయంబు శోభాత । రంగితంబు
నఖిలజనసమ్మతము నైన । యా వివాహ
వైభవంబును వర్ణింప । వశమె యేక
ముఖముఁ గలిగిన కవికి । నంభోరుహాక్షి. 1246

సీ. అంతవసిష్ఠుని । యానతిఁ దలఁదాల్చి
జనకుఁ డూర్మిళ లక్ష్మ । ణున కొసంగె
"ఈమె యీతని కీతఁ । డీమెకుఁ దగుననన్"
మాండవిన్ భరతుని । మగువఁ జేసె
మునులు సంతోషింప । భువనవిశ్రుతకీర్తి
శ్రుతకీర్తి శత్రుఘ్ను । సతిగఁ గూర్చె

జాగ్రదాదితురీయ । సంగతి జీవునిం
బలె మండపముచూడఁ । జెలువుమీఱెఁ

గీ. దన క్రియా చతుష్టయమున । దశరథుండు
వరచతుర్వర్గ ఫలములఁ । బడసి నట్లు
హర్షముప్పొంగ ధనవస్తు । వర్షమునను
యాచకుల బాంధవులను బ్రా । హ్మణులఁ దనిపి; 1247

క. సుతులన్ దత్సతులన్ నిజ
సతులన్ గుణవతులఁ గూడి । సద్బంధుజనా
శ్రితులన్ స్వపురోహితులన్
హితులన్ దనుగొల్వ విడిది । కెలమిం జనియెన్. 1248

గీ. బాంధవులఁ జూచి యాశ్రిత । ప్రతతిఁ జూచి
అవనిసురులను జూచి వి । ద్వాంసుఁ జూచి
తనపురోహితు మున్నిడి । జనక విభుఁడు
ఎలమిఁ గరముల జోడించి । యిట్లులనియె. 1249

క. పొరపాటు లెట్టి పెండ్లికిఁ
బరిపాటిగ నుండు నండ్రు । పాటింపక నన్
గరుణన్ క్షమింప వేడెద
ధరణీసురకల్పభూజ । దశరథ రాజా! 1250

క. తమకంబున దుఃఖంబను
తమసంబున బ్రుంగి, యిపుడు । ధన్యుఁడ నైతిన్
దమసంబంధముచే, ను
త్తమసంగతి చేకూరె మాకు । దశరథ రాజా! 1251

గీ. కూఁతులను నీకొసంగితిఁ జేతులారఁ
ఏలుబడినీది యింక నా । కేలచింత,

అనిన దరహాసముం జేసి । జనకవిభుని
గౌఁగిటం జేర్చి యాతండు । గౌరవించె. 1252

గీ. అట్లు వియ్యంకు లిరువురు । నతుల తోష
వారినిధిఁ దేలి మునుఁగుఁగ । బంధుజనము
మాటలన్ బాటలన్ మేను । మఱచియుండ
సీత రాముని జూడఁ గాం । క్షించుచుండు. 1253

క. ఆనలినాక్షుని రాముని
మానిని వీక్షింప మాటి । మాటికిఁ దలఁకున్,
మానసము ప్రేరణంబునఁ
దానించుక చూచుఁ గాని । తనియక యుండున్. 1254

ఉ. ఆ యబలాలలామ తన । ప్రాణవిభున్ దిలకింపఁ, బ్రేమత
ప్లాయితనృత్స్వరంపర, ప । దాంబురుహాంబుల బంభరంబులై
కాయసరోవరంబునఁ బ్రి । కాశముఁ బొందుచు నీఁదుచేపలై
హాయిగ సంచరించె నహ । హాయని మానసముల్లసిల్లఁగన్

గీ. ఆమెకౌశేయ పరిధాన । మతుల శోభఁ
బ్రాతరారంభ వేళఁ బ్రా । గ్భాగమునను
దోచునరుణార్క విభవంబుఁ । దోఁచివుచ్చు,
నేమనందు సౌదామని । నీసడించు. 1256

ఉ. పాడుచునాడుచున్ సకల । బంధుజనంబులు ముచ్చటింపఁగన్
మూడుదినంబు లప్పురిని । ముద్దుల నుద్దులఁ బొద్దుపుచ్చి తా
వేడుకతోడ జేఁడు తన । వీటికి నేగఁ దలంచినంతనే
మాడలఁ జేడెలన్ హరుల । మత్తగజంబుల స్యందనంబులన్

గీ. వస్త్రముల నవ్యకాంచనా । భరణములను,
దాస దాసీజనంబుల । వేసడముల,

వెంటఁ గొనివచ్చి, జనకుండు ప్రీతితోడ,
నఖిలజనములు మేలన నరణమిచ్చె. 1258

గీ. నేఁడు కొమరుల కోడండ్రితోడనహహా!!
దశరథ నృపుండయోధ్యకుఁ దరలు ననుచు,
నల్ప సలిలస్థ మత్స్యంబు ననుకరించి
జనకవిభు రాణివాసంబు సంచలించె. 1259

చ సునయన దుఃఖబాష్పములు చూపుల కంకిలిపెట్ట, మెల్లఁగన్,
కనులనుదుడ్చుకొంచు, జన కక్షితినాథునిబిడ్డఁజేరి యు
క్కునఁగదియించి, తక్కుఁగల కూఁతులనాదటఁ గౌఁగిలించి, యి
ట్లను:-"వినుఁడత్తమామలస మాదరణంబును బొందుఁడెల్లఱున్

గీ. పతుల యాజ్ఞకు లోఁబడి వార లిచ్చ
మెచ్చిన విధాన సతతంబు మెలఁగ వలయు,
నీతిఁ బాయక లోకవిఖ్యాతిఁ గొంచు,
సిరులఁ దులదూఁగుఁ డనుచు నాశీర్వదించె. 1261

చ మునుకొని యొక్కబ్రాహ్మణుఁడు ముందఱమార్గముఁ జూప, రాఘవుం
డనుజులఁగూడి, ప్రేమమెయి నాప్తులు మిత్రులు వెంబడింపఁగన్
జనకుని వానియంతిపురి చానలఁ దక్కినబంధుసంఘమున్
గని తనవీటికిన్ సెలవుఁ గైకొని యేఁగఁదలంచి వచ్చినన్.

సీ. మనపుణ్య పరిపాక మునఁగాదె యిప్పూరి
పరమపావన మయ్యె భామలార!
అది యదృష్టము కాక యహహా!! సీతకు మంచి
మగఁడు చేకూరెనే మగువలార!
కలవుదీఱఁ గుమారుఁ గనుపారఁ గాంచనే
కౌసల్యఁ బొగడరే కాంతలార!

జనకుఁ డెంతటి తప । స్సంపన్నుఁ డేవీని
పదములఁ గడుగంగఁ । బడఁతు లార!

గీ. పేదకుం గల్పకంబు ల । భించినట్లు,
మరణశీలున కమృతంబు । దొరకి నట్లు,
మనకుఁ బ్రాప్తించె నితనిద । ర్శనముతరుణు
లార! యని రాముఁజూచిర । ప్పౌరసతులు. 1263

క. మనమనిశంబు భృశంబని
మనమున రఘురామురూప । మాణిక్యంబుఁ
జొనిపి సుఖించినఁ జాలదె
యని కొందఱు లోఁదలంచి । రత్తఱిగిరిజా! 1264

సీ. రూపరాశుల, సర్వ । పాపనాశుల రాజ
తనయుల వీక్షించి । సునయనాది,
రమణులెల్లఁ గప్పు । రంపుటారతి నిచ్చి
స్నాతులఁ గాఁజేసి । సత్వరముగ
షడ్రసోపేత భో । జనమునఁ దనియించి,
వలిపంపు జలతారు । వలువ లొసఁగి,
గౌరవించిన యంత । ఘనుఁడు రాముఁడు లేచి,
మగువలంజూచి న । మస్కరించి,

గీ. పూజ్యపాదులు మాతండ్రి । పుచ్చెమమ్ము
సకల సౌభాగ్యవతులార! । సత్ప్రసన్న
మనములన్ మమ్ము దీవించి । యనుమతింపుఁ
డనిన నిట్లనె సునయన । సవినయముగను. 1265

సీ. పరిపూర్ణ కాముండ । వరిషట్కజేతవు,
విజ్ఞానమయుంబు భా । వప్రియుంబు

భవదీయ భావంబు, । పరమపావనమూర్తి
అఘ వినాశన వర్తి । అతులకీర్తి
అమిత కృపాస్ఫూర్తి । అఖిల భక్తుల గుణ
గ్రాహకుండవు, మమ్ము । మోహహతుల,
నాదరింపుము, సీత । నాదటఁ బాలింపు
మేలింపు మనుజుల । నితరసుతల

గీ. జ్ఞానులకు శిరోమణివీవు । సదయహృదయ!
రామ సద్గుణారామ ని । న్నేమనందు,
నలిన ముఖమున దరహాస । మంకురింప
సెలవుఁ గైకొని వెడలె నా । శ్రీవిభుండు. 1266

గీ. అనుజులంగూడి శ్రీరాముఁ । డరుగుచుండ
స్త్రీలదృక్కులు వెన్నంటి । తిరిగెఁగాని
మానసంబులుకటకటా! । మగిడిరావు
వారివిరహవ్యథ వచింప । వశమె గిరిజ! 1267

చ. చిలుకలు ముద్దుముచ్చటల । చే, మురిపంబులచే, మరాళముల్,
పలుకులచేత శారికలు, । లాస్య విలాసముచే మయూరముల్,
అలరినవాట సీత విర । హవ్యథ కెంతయు నేడ్చెఁగాక, దృ
క్కుల జలధార లూర జన । కుండుఁ గడుంగడు నేడ్వవచ్చునే?

గీ. జనకుఁ డంతటఁ బరివార । జనముఁగూడి
పెండ్లివారలతో నేగి । పెద్దలైన
వారియనుమతిం గొనివచ్చి । భక్తితోడ
ఘనుని శ్రీరామచంద్రునిఁ । గాంచి పలికె. 1269

సీ. గాఢంబుగా నిన్నుఁ । గౌఁగిలింపఁగనిమ్ము
రామ శ్రీధామ! ని । న్నేమనందు!

ముని మహేశ్వర చిత్త । వనరుహ మార్తాండ
అరిషట్కము జయించి । నట్టి ఘనులు
నాశరహిత చిదా । నందంబు నిర్గుణ
బ్రహ్మంబు గ్రహియింప । వశముగాక
తల్లడిల్లుచునుందురు; । తర్కింపఁ జాలక
నిగమంబులే వేళ । "నేతినేతి"

గీ. యనుచు ఘోషించు చుందునో । వనజనేత్ర!
శుద్ధచైతన్య మత్యంత । సుఖదమగును;
అనఘ! నినుఁగాంచి ప్రేమించి । యనుభవించి,
భవమహోదధి ఈదంగఁ । బాలుపడితి. 1270

గీ. అహహ! భవదీయ మహిమంబు । నరయవశమె
నిర్గుణంబును సగుణంబు । నీవయగుదు
నామనము భగవచ్చర । ణంబులందు
లీనమైయుండఁ గోరెద । భానుకులజ! 1271

క. అనియిట్లు పలికి జనకుఁడు
వనజాక్షునిఁ గౌఁగిలించి । బాష్పజలంబుల్
కనుదోయి జాఱవిడిచెన్
ఘనమగుతన ప్రేమరసముఁ । గార్చిన కరణిన్. 1272

గీ. అతనిభావంబు గ్రహియించి । యంబుజాక్షుఁ
డట్ల యగుఁగాక యని మంద । హాసమందె
తాననుండయి వినతుఁడై । యనుమతిఁగొని
యనుజులంగూడి దరశథు । ననుగమించె. 1273

చ. వినయనిధిన్ రఘూద్వహుని । వీడ్కొని, యజ్జనకుండు గాధినం
దనునకు మ్రొక్కి, దేవ! సుర । నాథునకేని లభింపరాని ద

ర్శనము లభింపఁజేసి, పరి । రాజుల నన్నుఁగృతార్థుఁజేసితే
మని వినుతింతు నంచు విన । యానతుఁడై చనె నాత్మసీమకున్.

క. హితులుఁ బురోహితులు శితులు
నతిశోభఁ వెంబడింప । హార్దంబెసఁగన్
గతిపయ దివసంబుల క
్షితిపాలుఁ డయోధ్యకేగె । సీతాపతితో. 1275

గీ. సుతులతోఁగూడి దశరథ । క్షితివరుండు
వచ్చు ననువార్త నాలించి । పౌరవరులు
యోధుల కసాధ్యమైన య । యోధ్య నహహా
చక్కఁగ నలంకరించిరి । జలజగంధి! 1276

చ. సురుచిరగాత్రి! యప్పురము । సొంపును బెంపు నుతింపనౌనె? సు
స్థిరమతి నిర్జరాదులు మ । థింప జనించు పయోధికన్యకన్
బరిణయమాడి కేశవుఁడు । వచ్చిన నాటి వికుంఠసీమయై
కరమువిరాజిలెన్ సురల । కన్నుల పండువు గాఁగ నత్తఱిన్. 1277

చ. మదనవిలాసినీసదృశ । మానిను లారఘురామమూర్తిఁ ద
త్సుదతినిఁజూచి మెచ్చుచుఁబ్రి । సూనములన్ వెదఁజల్లి,ప్రూజకున్
అదనిది యంచుఁ గప్పురపు । టారతినిచ్చి నుతించిరంత న
మ్మదజలరాశిఘోషనలె । మంగళ రావము లొప్పె నెల్లెడన్.

సీ. హర్మ్య గవాక్ష ని । ర్యద్ధూపధూమముల్
శారివణమాసాబ్ద । చయము గాఁగ
బుర కామినీ ధృత । పుష్పగుచ్ఛంబులు
వరబలాకంబుల । వరుస గాఁగ
మందిరాంగణ బద్ధ । మణిమయ తోరణ
పంక్తి దేవేంద్రచా । పంబు గాఁగ

నూత్న వధూహార । రత్నకాంతిచ్ఛట
తరళ విద్యుల్లతా । తతియుఁ గాఁగ

గీ. ఘనఘనారావములు గర్జి । తములుగాఁగ
బ్రాహ్మణులు చాతకమయూర । రాజిగాఁగ
మునులుఁ బౌరులుఁ గర్షక । జనులు గాఁగ
నమరుల సుగంధ జలవర్ష । మతిశయించె. 1279

సీ. చాలకాలముదాఁక । జపియించి తపియించు
యోగీశ్వరుఁడు మోక్ష । మొందినట్లు
అక్షయ క్షయసంక । టాక్రాంతరోగిసు
ధారస ధారలఁ । ద్రావినట్లు
ఆగర్భ నిర్భాగ్యుఁ । డై కుందు నిఱుపేద
కనక నిధానంబుఁ । గాంచినట్లు
అభినయంబున సంజ్ఞ । నాశయం బెఱిఁగించు
మూఁగవాఁడొగి వాణిఁ । బొందినట్లు

గీ. పుడమిఁ దడఁబడి మార్గంబు । నడిగి యడిగి
తడవుకొనెడు నంధుఁడు దృష్టిఁ । బడసినట్లు
రాజపత్నులు చెప్పఁ ద । రంబుగాని
అతులసంతోష మొందిరి । య్యవసరమున. 1280

గీ. జానకీ రామచంద్రుల । సంగతమున
నతుల మంగళాన్వితమైన । యయ్యయోధ్య
కొంతకాలంబుదాఁక యే । చింత లేక
అతివ ! యానంద వారాశి । యన రహించె. 1281

గీ. అంత నొకనాఁడు గాధేయుఁ । డాశ్రమమున
కరుఁగ నూహించి సభకేగి । నంత నృపుఁడు

ఆసనంబిచ్చి పూజించి । యాదరించి
తనుజసహితుఁడై పాదవం । దనముఁ జేసి. 1282

గీ. శిష్టజనవర్య! యుష్మదా । శీస్సు వలన
సకల సౌభాగ్యములు మాకు । సంఘటిల్లె
నుతులఁ బ్రోవుడు ననుఁ గృపక । జూడుఁ డనుచు
మగుడ మ్రొక్కిన దీవించి । మౌనివరుఁడు. 1283

గీ. పోయివచ్చెద నని, రాము । మోముఁ జూచి
మందహాసంబుఁ గావించి, । మందగతిని
మార్గముంబట్టి, పురినుండి । సిర్గమించె
రాముఁడే తేర గొంతదూ । రంబుదాక. 1284

చ. సరసిజ నేత్రుఁ డంచు ముని । సంఘముచే నుతిఁ గొన్న జానకీ
వరుని వివాహ వైభవముఁ । బాడినఁ బల్కిన, నాలకించినన్
స్థిరమగుశ్రీసమృద్ధియు, వి । శేషసుఖంబు,నపార ఘోరసం
సరణపయోధిని స్తరణ । శక్తియుఁ జేకురుఁ జూవె పార్వతీ! 1285

చ. వరమపవిత్రమైన భగ । వద్గుణజాలము నాలకించి దు
స్తర భవవార్ధి దాటితివి । ధన్యతఁ గాంచితివో ధరా ధరే
శ్వరుతనుజా! రఘూద్వహుని । పాదయుగంబు స్మరించినంత, నే
నరుఁడు పవిత్రచిత్తుఁడయి । నారకవార్ధిఁ దరింపకుండునో. 1286

గీ. దుష్ట కలికాల భక్షిత । దుర్జనులకు
రాఘవుని దివ్య నామస్మ । రణమె దిక్కు;
రామ నామామృతంబున । వ్రావినంత
ఘోర తాపత్రయాగ్ని చ । ల్లారుఁ జూవె 1287

మ. మనసా! చెప్పెద నొక్క వా ర్తవిని సం । భావింపుమా, యింక దు
ర్జనసాంగత్యముఁ బాసి, యాకపట సం । సారంబు వర్జింపుమా;

అనఘుండై, భవవార్ధిపోతము గు బ్ర ॥ హ్మానందకందంబు, రా
మునినామంబును సంస్మరింపఁదగదే ॥ మోక్షంబు సిద్ధించెడున్.

చ. రవికులపావనుండయిన ॥ రాముని కీర్తి నుతించుచోట కవి
ప్రవరుల జీవనంబనుచు ॥ వాణి పవిత్రముగా రచించితిన్
గవివరులార! రాఘవు జ ॥ గన్నుతదివ్యచరిత్రవార్ధి నే
నెవియఁ దరింపఁజాలుదు నె? న ॥ గంబును పంగువు దాటనోపునే?

మ. శివకోదండ విఖండనార్జిత యశ ॥ శ్రీదామ! శ్రీరామ భా
ర్గవరామ ప్రణతోరునామ! నతసు ॥ త్రామా! బలోద్దామ! భ
క్త వితానావనకామ! భూధవసుధా ॥ ధామా! పరంధామ! యి
య్యవనిన్ నీదుకథాక్రమంబెసఁగుబో ॥ యాచంద్రతారార్కమున్.

కం. రాజ శిరోమణి పూజిత
రాజేంద్ర! సురేంద్ర మకుట ॥ రత్న సమూహా
భ్రాజిత పదరాజీవా
రాజీవ విశాలనేత్ర! ॥ రమ్యచరిత్రా! 1291

మాలిని. సుగుణ మణి కలాపా ॥ స్తూయమానప్రతాపా!
విగత జనక తాపా ॥ భన్న ఫాలాక్షచాపా!
సగుణ విగుణ రూపా ॥ సన్నుతాశేషభూపా!
జగదవనకలాపా ॥ జానకీ పుష్పరోపా! 1292

గద్య. ఇది శ్రీభాగవతుల నృసింహశర్మ విరచిత శ్రీతులసీ రామా
యణమునందలి బాలకాండము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.

---

## గమనింపుడు:—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 23 | వరశోగంధ | వరయశోగంధ |
| 4 | 19 | కొనవిడు | కొనలిడు |
| 15 | 2 | మత్కవిప్రియవాహ | మత్తవితాప్రవాహ |
| 31 | 20 | గనుంగవరయోడ్చి | కనుంగవమోడ్చి |
| 51 | 6 | మృదుభ్రాషల | మృదుభాషల |
| 51 | 8 | యొనరించెన్ | యొనరిచెన్ |
| 51 | 13 | సృష్టికుని | సృష్టికిని |
| 114 | 12 | సత్తపో | సత్తపో |
| 177 | 14 | గణిరాజవరుల్ | గనిరాజవరుల్ |
| 177 | 17 | మానిసివరునకు | మానివరునకు |
| 180 | 1 | శుద్ధగాంత | శుద్ధశాంత |
| 186 | 12 | తేదండము | వేదండము |
| 186 | 14 | సుభప్రరంబుగన్ | శుభప్రద |
| 190 | 16 | కస్యత్వము | కన్యాత్వము |
| 193 | 7 | చందుసింజోర | చంద్రునింజకోర |

233 పుటలో, 240 పద్యములోని మొదటిరెండు గీతపాదము లిట్లు దిద్దుకొనవలెను.

గీ. నాదుహృదయదీర్ఘికను, వం । తతము, నెయ్య
వరుణపద్మంబులై యుండు । నంబుజాక్షి.

మఱియు నందందు పొరపాటుగ లుండవచ్చును. చదువరులు దిద్దికొనంబ్రార్థితులు. అందందుఁగన్పట్టు తప్పుల మాత్రమే, మేము సవరింపఁగలిగితిమి.

సంపాదకుఁడు.

# వేగుఁజుక్క గ్రంథమాల

పూడిపెద్దివారివీధి, బరంపురము (గంజాము)

Established on the 12th December 1911
IN HONOUR OF THE DELHI CORONATION DURBAR.
*This cancels all Premous Rules.*

అధ్యక్షుడు — బ్రా॥శ్రీ॥ ఆదిభట్ల తరిణియ్య సిద్ధాంతిగారు.

కార్యదర్శి — భాగవతుల నృసింహశర్మ

1. నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, పురాణములు, మృదుమధురప్రబంధములు, మనోహరనాటకములు, మనోల్లాసములగు నితిహాసములు, చక్కని నిండుక్యాలికోబైండుతో మూడుమాసముల కొక్కొక్కటిగా వెలువడుచుండును.
2. గ్రంథము వెలువడినవెంటనే శాశ్వతచందాదారుల పద్ధతిని, రు 1—0—0 వెలకు (పోస్టేజీగాక) వీ. పీ. గా చందాదారులకు పంపబడుచుండును.
3. నాలుగు గ్రంథములు పోస్టేజీలుగాక వత్సరమునకు నాలుగు రూపాయలకు మించదు.
4. ప్రవేశరుసుము నాల్గు అణాలుమాత్రమే.
5. చందాదారులగువారు వెనుకటిగ్రంథములన్నియు గొనవలయునను నిబంధనలేదు. కాని కోరినవారికి చందాదారుల వెలకే వెనుకటిపుస్తకములు లభించగలవు.
6. ఇందప్పుడప్పుడు ప్రచురింపబడు అనుబంధగ్రంథములు చందాదారులకుమాత్రమే నుచితముగఁ బంపబడును.

## గ్రంథరచనానియమములు

1. Characterisation 2. Development of character 3. New ideas 4. Historical Beauties 5. Description of Nature and other Varieties,

N. B:—శ్రీతులసీరామాయణము (బాలకాండము) విభ్రమరాఘవము అను రెండు గ్రంథములు మాత్రము సగము క్యాలికోఅట్టబైండుతో వచ్చునని యిదివరకే చందాదారులకు తెలియజేసియున్నారము.

# వేగుంజుక్క గ్రంథమాలలో

## లభించు యితరగ్రంథములు.

<u>నాటకత్రియము</u>

1. <u>విజయవిజయము</u> 0—10—0

(ఈనాటకము కర్ణునికొఱకే వ్రాయబడినది)

2. <u>విచిత్రవీరబొబ్బిలి లేక పద్మనాయకవిక్రమము</u> 0—12—0

(విజయరామరాజుగారి రాజనీతి యిందు చక్కగ చిత్రింపబడినది. బొబ్బిలియుద్ధనాటకములలో ప్రసిద్ధికెక్కినది)

3. <u>ప్రతిజ్ఞాచాణక్యము</u> 0—12—0

(శ్రీ ద్విజేంద్రలాల్‌రాయిగారి నాటకరత్నము. చాణక్యుని పాత్ర నెఱుంగవలెనన్న నిద్యాది తప్పక చదువుడు.)

4. <u>అభినవభర్తృహరి</u> 0—10—0

(భర్తృహరిబోలిన నూతనగ్రంథము నీతి, శృంగార, వైరాగ్యముల బోధించు చక్కనిపద్యములు)

<u>నవలలు</u>

5. <u>రసపుత్రజీవనసంధ్య</u> 0—14—0

కావ్యనిధి చెలికాని లచ్చారావుగారిచే సంపాదితము శ్రీరమేశచంద్రదత్‌గారి బంగాళీనవల కనువాదము చరిత్రాత్మకము అద్భుతకథావిధానము)

6. <u>వైకుంఠమతము</u> 0—8—0

(సాంఘిక నిరూపకనవల నాగరికతపేర జరుగు సాంఘిక దురాచారముల గనుగొన నిది చూడుడు)

వేగుంజుక్క గ్రంథమాల

పూడిపెద్దివారివీధి

బరంపురం (గంజాము)

# AMRUTA BINDU
## OUSHADHALAYA,
### BERHAMPORE, (Ganjam).

అతిరిక్త శుక్ల, క్షయము వలన కలిగిన పలువిధ రోగములకు

సిద్ధౌషధము

స్మృతిశక్తి, రతిశక్తి, స్నాయుశక్తిని దృఢపరచు శక్తిగల

భగవద్దత్తమగు తంత్రశాస్త్రోక్త

## మృత్యుంజయకల్పము

---

సప్తధాతువులను, ఆశయములను బలపరచును. పలచని వీర్యమును చిక్కపరచి, రతిశక్తి హెచ్చించును. మూత్రములో, నిద్రలో, స్త్రీప్రసంగములో, వీర్యస్రావము కలుగుచున్నను త్వరలో కట్టును. సకలవిధ మేహములు, బహుమూత్రములు, యింద్రియశైథిల్యము, చిత్తచాంచల్యము, దగ్గు, క్షయ, శ్వాస, వాతము, అజీర్ణము, మొదలగు పురాతనరోగముల నశింపజేసి, నూతన ఉత్సాహము, బలము, తేజము, కాంతి, స్మృతి, ధృతి, కలిగించును.

15 రోజులకు సరిపడు 30 మాత్రలు గల డబ్బీ 1కి రు3-0-0

చిరునామా:—

కవిరాజ శ్రీమధుసూదన శర్మ

అమృతబిందు ఔషధాలయము, బరంపురం (గంజాం)

# శ్రీమద్వాల్మీకి రామాయణము

ఓంకారము వేదములకు మూలమైనట్లును గాయత్రీమంత్రము మంత్రములకెల్ల ప్రారంభమైనట్లును శ్రీమద్వాల్మీకి విరచిత రామాయణము కావ్యములకెల్ల నాదియై యలరారుచున్నది. సర్వోత్కృష్టతగల యీ రామాయణమహాగ్రంథమునకు మహనీయు లనేకు లనేక సంస్కృత వ్యాఖ్యానతీరముల నేర్పరచియుండిరి. అందుఁగొన్ని ముద్రింపఁబడి దర్శనీయములుగను గొన్ని ముద్రింపఁబడమి దర్శన సౌలభ్యము లేకయుండుటయుఁ గాంచి బ్రహ్మశ్రీ భమిడిపాటి కామేశ్వరశాస్త్రిగారు ముద్రితాముద్రిత వ్యాఖ్యానములఁ జాలవఱకు సంతరించి పండితులు పామరులు త్రిమతస్థులు తదితరులు సంస్కృత వ్యాఖ్యానతీరముల సుగమముగాఁ బ్రవేశించి చూచి యందలివిశేషములఁగాంచి సంతసించునట్లు నాకనాఁబరగు సంపూర్ణాంధ్ర వ్యాఖ్యానమును, ప్రతిశ్లోకమునకు ప్రతిపదార్థము, తాత్పర్యము, విశేషార్థములు, కథాసందర్భము ననుసరించి చిత్రపటములును గలిగి యలరారునట్లు రచించి 50 పౌనుల డబుల్ రాయల్ సైజు గ్లేజు కాగితములమీఁద రెండుమాసముల కొకొక్క సంపుటముగాఁ బ్రకటించుచున్నారు. సంపుటము 200 పుటలు గలిగి బైండు చేయఁబడియుండును. జీవితశేషము నిందుఁగడువ బద్ధకంకణులై శ్రీ శాస్త్రిలవారు దీనంగల రాజకీయనైతికసాంఘిక మతధర్మములను, ఐహికాముష్మిక మార్గములను గరతలామలకముగాఁ జేసి ముద్రించుచున్నారు. ప్రతి భారతీయాంధ్రుఁడు బఠింపఁదగిన గ్రంథము. ఇంతవఱకు బాలకాండమున నైదుసంపుటములు ముద్రింపఁబడినవి. అయోధ్యాకాండ సంపుటములు ముద్రింపఁబడుచున్నవి. సంపుటములన్నియుఁ దెప్పించుకొనువారు శాశ్వతచందాదారులుగా నెన్నఁబడుదురు. శాశ్వత చందాదారులు మొదట రు 0-8-0 లు ప్రవేశ రుసుము చెల్లింపవలెను.

సంపుటము 1కి పోస్టుఖర్చులుగాక చందాదారులకు రు 1-2-0, ఇతరులకు రు 1-4-0. వివరములు మాకువ్రాసి తెలిసికొనవచ్చును.

శ్రీమద్వాల్మీకిరామాయణ గ్రంథమాలా కార్యస్థానము,

ఆర్యాపురము, రాజమహేంద్రవరము.